శ్రీ

# భాగవతకథ

(శ్రీమద్భాగవత దర్శనము)

ద్వావింశ భాగము



హిందీ మూలము

శ్రీగంగా ప్రభు దత్త బ్రహ్మచారి మహారాజు

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ వేంకటేశ్వరాష్ట్ర భారతీ ప్రచురసంస్థ

హైదరాబాదు.

సర్వ స్వామ్య సంకలితము

తృతీయ ముద్రణము

2000 ప్రతులు

1985

వెల రూ॥ 5



ప్రతులు లభించుచోటు

దివాకర్ల పబ్లికేషన్సు

శంకరమఠము

నల్లకుంట

హైదరాబాదు-500 044

# తొలి పలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁ డుత్తమోత్తముఁడుగా పరిగణింపఁబడుచున్నాఁడు. అందు కితరజీవజంతువులకు లేని జ్ఞానమతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణామయుడై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నించ వలయును. అట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్ష ప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ, భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గములను అవలంబింపఁ జాలువా రరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తి మార్గమును స్త్రీలనక, పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీ మద్భాగవతములతోపాటు పదునెనిమిది మహాపురాణములను, ఉపపురాణములను కూడ రచించి యుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా వేదనిషిక్తములైన ధర్మ నీతి తత్త్వములను జిజ్ఞాసువు లందఱికిని సుబోధ మొనరించును. పదునెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీ మద్భాగవతమా, దేవీ భాగవతమా, అను విషయమున పండితులలో వివాదమున్నది.

కాని పలువురది శ్రీ మద్భాగవతమేయని భావించుచున్నారు. ఇది యెంతమనోహరమో, భాషా భావము లంతంత క్లిష్టమైనది. అందు చేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్పడుటయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలికైనం దమ్మిచూలికైన"నని చెప్పుటయు సంభవించినది. "భగవతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి. ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము అను పంచలక్షణములు పురాణమునందుండును. శ్రీమద్భాగవతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటించు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏకవింశత్యవతారములును (21) వర్ణింపబడి యున్నవి. "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీ మద్భగవద్గీతలో భగవంతుడు చెప్పినట్లాతండు ధర్మ సంస్థాపనము కొఱకును. సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విషయమే శ్రీ మద్భాగవతము నందు ప్రపంచింపబడినది. మత్స్యకూర్మాద్యవతారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వహించిన మాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీ కృష్ణుని జన్మాది వృత్తాంతములు విపులతరముగా వివరింపబడినవి. భాగవత తార హారమునకు దశమస్కంధము తరళ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతి పాదింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్ష ప్రాప్తి కదియే పరమసాధనమని యది బోధించును. అందలి కథోపాఖ్యానము లన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనముగనే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని నిరసింప లేదనుటకు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ" అని వివేక చూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యముకూడ నంతే. కలియుగము నందలి జనులు కర్మజ్ఞాన మార్గముల నవలంబింపఁ జాలని వారగుటచే భక్తినే ఆశ్రయింపవలయును. సంసార సాగర తరణమునకు భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుఁడు భాగ. వతము నిగమ కల్ప తరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టముల సిద్ధింపఁ జేయును

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భాగవతమును మహా భక్తుఁడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోతరాజు గద్య పద్యాత్మముగా తెలుఁగున కనువదించెను. అతఁడు రచించిన భాగ వతము నందలి కొన్ని భాగములు లే కారణము చేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యనువారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తిలేదు. అందుకతని పద్యములందలి ధారా శుద్ధియు నాన్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్న

మొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడి వాఁడు కాఁడు. కాల వైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించు కొను వారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీక రించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొం దించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పు డెందఱో యుండరు. అందుచే సంస్కృత భాగవతము నకు రెండు మూఁడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగ వతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్త శిఖామణులు నైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగ వతము నందలి విషయములను కథావృష్టాంతానుభవ పూర్వకముగ సరళసుందరమైన హిందీ భాషలో నఱుపది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకట నర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తిప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణ్యుఁడైన పోత రాజాంధ్రీకరించుటవలన నాంధ్రలోకమున కెంత మహోపకారము జరిగినదో భక్త చూడామణులైన శ్రీ ప్రభుదత్తబ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తి సముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుటవలన కూడ నంత మహోపకారము జరిగినది. ఆ

గ్రంథమునకు శ్రీ మద్భాగవత దర్శనమను పేరు సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్యశేఖరులునైన భక్తులొక రా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునను నుద్దేశముతో అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్పబీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రు లాఫలమును ఆస్వాదించి ఆనంద పారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మసంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మసంస్థ పక్షముననే ముద్రింపఁబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా.

దివాకర్ల వేంకటావధాని

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృత ద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

– సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణ మూలము శుకా
లాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తమ్ము మహాఫలమ్ము విమల
వ్యాసాలవాలమ్మునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువు
ర్విన్ సద్ద్విజశ్రేయమై

– శ్రీ మదాంధ్ర మహాభాగవతము

ఈ గ్రంథము

శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సాహాయ్యముతో

ముద్రింపఁబడినది.

# భాగవత కథ

## జగన్మోహినీ

### మన్వంతరావతారముల కథ

శ్లో॥ స్వాయంభువస్యేహ గురోవంశోఽయం విస్తరాచ్ఛ్రుతః ।
యత్ర విశ్వసృజాం సర్గోమనూనాన్యా వదస్వనః ॥
యత్రయత్ర హరేర్జన్మ కర్మాణి చ మహీయసః ।
గృణంతి కవయో బ్రహ్మంస్తాని నోవద శృణ్వతామ్ ॥

శ్రీభాగ. ౮ స్కం. ౧ అ. ౧-౨ శ్లో॥

క. వినఁబడియెను స్వాయంభువ
మనువంశము వర్ణధర్మ మర్యాదలతో
మనుజుల దనుజుల వేల్పుల
జననంబులు స్రష్టలెల్ల జనియించుటయున్.

ఉ. ఏమను రాజ్యమందు హరియీశ్వరుఁడేటికి సంభవించె నే
మేమి యొనర్చె నమ్మనువు లేరతఁడేక్రియఁజేయు మన్న పేఁ
డేమి నటించుమీఁదగతమెయ్యది సజ్జనులైనవారు ము
న్నేమని చెప్పుచుందురు మునీశ్వర నాకెఱిఁగింపవే దయన్.

శ్రీమదాంధ్ర భాగవతము.

1)

కృత, త్రేతా, ద్వాపర, కలియుగములను నీనాలుగుయుగ ములు వేయిసార్లు గడచినప్పుడు బ్రహ్మకొక దిన మగును. మరల నింతేకాలము రాత్రిగడువగా బ్రహ్మ త్రిలోకములను దనలోనికి లీనమొనర్చుకొని భగవంతుని యుదరమందు నిద్రించును. నిశావ సానము కాఁగానే మరలఁ దన సృష్టికార్యములోఁ బ్రవేశించును. వ్యాపారి రాత్రి యందు దుకాణములో సామానంతను లోననుంచి తాళము వైచి నిద్రించి మరలఁ బ్రాతఃకాలము కాఁగానే మరల దుకాణమును దెఱచును. ఇదేవిధముగ బ్రహ్మయును దినాంతమందు భూర్భువస్సువర్లోకములను దనలోనదాచుకొనును. మహ, ర్జన, స్తప్త, సత్యలోకములు నాలుగును మిగులును. మహర్లోకము ఖాళియగును. అచ్చటనుండువారు జనలోకమునకుఁ బోవుదురు. దీనినే కల్పప్రళయ మందురు. మహాప్రళయమందు, అనఁగా బ్రహ్మకు నూఱు సం వత్సరముల అయువు పూర్తియైనపుడు కలుగు ప్రళయ మును మహాప్రళయమందురు. అసమయమున నేలోకము నుండదు. బ్రహ్మ లోకము వఱకన్నియును వైకుంఠనాథునితో లీనమగును. ఒక కల్పమునకు పదునాలుగు మన్వంతరములుండును.

డెబ్బదియొక్క మహాయుగములకుఁ బైగా నొక మన్వం తరముండును. ఆ మన్వంతరమున కధిపతులుగ మనువు, మను పుత్రులు, సప్తర్షులు, దేవగణము, ఇంద్రుఁడు ఆ మన్వంతరమున కొక అవతారముండును. ఈకల్పమునకు మొదటి మన్వంతరము నకు స్వాయంభువ మన్వంతరమని పేరు. దానిలో మన్వంతరావ తారము యజ్ఞపురుషుఁడు, కపిల, నర నారాయణాద్యవతారములును

వచ్చెను. ఈ విధముగ నిది నిమేష, పల, ఘటికా, ముహూర్త, ప్రహర, దిన, పక్ష, మాస, వర్ష, దివ్యవర్ష, యుగ, మన్వంతర, కల్ప, మహాకల్పములని యిట్లు నిర్ణయింపఁబడి యుండును. ఇట్లొకటి తరువాత నొకటి వచ్చుచుండును. ఈప్రవాహమనాది. అనంత కాలము వఱకిట్లు నడచుచునే యుండును. దీనికాదిలేదు. అంతము లేదు. చాలులేదు. మూలలేదు ఇంత గొప్పకాలమందు మనుష్య దినములతో మనుష్యుల నూఱుసంవత్సరములు, అనంత సాగరమున నొక్క బిందువంతైనను లేదు. అట్టి దానికొఱకే ప్రాణి విఱ్ఱవీగిపోవుచుండును. "నే నది చేసెదను, నేనిదిచేసెదను" అనుచుండును. ఆయ్యా! నీవు చేయున దేమున్నది. ఈ ప్రవాహము సనాతనమైనది. నీ వవతార చరిత్రములను వినుము. దీనివలననీకు మేలుకలదు. ఈ భౌతిక పదార్థములు సదా యిట్లే యుండినవి, ఇట్లే యుండగలవు. నౌకను గడతో నడుపుము లేక పెద్దదిచేసి ఆవిరితో నడుపుము. మనము దున్ని పండించనిండు, వివిధ యంత్రములతోడనో విద్యుత్తుతోడనో పండించనిండు. దీనితో నంతరమేమియును లేదు మానవ జీవనసాఫల్యము భగవచ్చరిత్ర శ్రవణమునందుఁగలదు. భక్తులయొక్కయు, భగవంతునియొక్కయు చరణములందుఁ బ్రీతియుంచుటలో నున్నది. అదియే శ్రవణీయమైనది. అదియే మనము చేయఁదగినది. అంతయును జగజ్జంజాలమే. ఇదంతయును మాయా సంసారమే జనన మరణముల నొసంగునవియే. ఇంక నధికాధికముగ సంసారములోఁ బడవేయునవియే.

ఈకల్పమున నెందఱు మనువులైరి ? ఎందఱిప్పటికి గడిచిరి. ఇప్పుడే మన్వంతరము నడచుచున్నది. ఇంకముందెన్ని మన్వంతరములు మిగిలియున్నవి ? వీనినిఁదెలిపి వీనిలో నేవైన విశేష చరిత్రములున్నచో వాని నొక్కెడ సంక్షేపముగను, నొక్కొక్కచో విస్తారముగను జెప్పుఁడు."

ఇదివిని శుకుఁడిట్లనెను:- "రాజా ! ఈ కల్పముననే కాదు అన్ని కల్పములందును పదునల్గురు మనువులుందురు. ఈకల్పమున (బ్రహ్మయొక్క పగలు) ఆఱు మన్వంతరములు గడిచినవి. ఏడవది నడుచుచున్నది ? ఇంక నేడు జరుగవలయును జరిగిన మన్వంతరములివి-స్వాయంభువ, స్వారోచిష, ప్రియవత, తామస, రైవత, చక్షుషములు. ఇప్పుడు జరుగుచున్నది వైవస్వత మన్వంతరము. ఇది యేడవది. దీని కధిపతి వివస్వంతుని పుత్రుఁడగు శ్రాద్ధదేవుఁడు. ఈవిధముగ నివి యేడు మన్వంతరములైనవి. ఇంక నేడ్గురు మనువులు వచ్చెదరు. వారు సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి, వీరట్లు క్రమముగ నొకరితరువాత నొక రేవిధముగ నందఱును దమ తమ మన్వంతర పర్యంతము శాసించెదరు. ప్రతి మన్వంతరమునను భగవానుని యవతార మొకటి యుండును".

ఇదివిని శౌనకుఁ డిట్లనెను:- "సూతా! మాకు భగవదవతార చరిత్రలనే వినిపింపుఁడు."

అంత సూతుఁడిట్లనెను:-"స్వామీ! ప్రతి మన్వంతరమందును భగవంతుఁ డాఱురూపములతో నుండును. ఈయాఱు చరిత్రలు భగవచ్చరిత్రాంతర్గతములే. మనువు, మనుపుత్రులు, ఇంద్రుఁడు దేవగణము, సప్తర్షులు, మన్వంతరావతారములు. భగవానుఁడు క్రీడకొఱకై యీ యాఱు రూపములను ధరించుచుండును. ప్రతి మన్వంతరమున నవతారములను గైకొని భగవానుఁ డేదో విశిష్ట కార్యమొనర్చును."

అంత శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! అన్నిటికంటె ముందు స్వాయంభువ మన్వంతరమందు భగవంతుఁడే మన్వంతరావతారము నెత్తెను? ఆతఁడే విశిష్టకార్యము నొనర్చెను? ఈవిషయమును మీరు మాకుఁ జెప్పవలయును."

ఇదివిని సూతుఁడిట్లనెను:- "స్వామీ! ప్రథమ మన్వంతరాధిపతి స్వాయంభువ మనువని నేనిదివఱకే చెప్పితిని. ఆతనికి శతరూపయను భార్యకలదు. ఆమె కాకూతి, దేవహూతి, ప్రసూతి యను ముగ్గురు కూతుండ్రు కలిగిరి. ప్రియవ్రతుఁడు, ఉత్తాన పాదుఁడను నిద్దరు పుత్రులు పుట్టిరి. దేవహూతి గర్భమునుండి ప్రథమ యుగావతారుఁడగు గపిలుఁడుద్భవించెను. ఆతఁడే యీ ప్రపంచమున కంతటికిని జ్ఞానోపదేశమును గావించినాఁడు. ఆతని చరిత్ర నిదివఱలో మీకుఁ జెప్పియున్నాను ఆకూతిగర్భమునుండి భగవంతుని మన్వంతరావతారము కలిగెను. ఆతఁ డీ ప్రపంచమున ధర్మప్రచారమొనర్చుటకై 'యజ్ఞుఁ'డను పేరఁ బ్రసిద్ధిఁ బొందెను.

ఈ యజ్ఞ భగవానుఁడు స్వాయంభువ మనువును అసురరాక్షసుల నుండి రక్షించెను. ఆతఁడే ఆ మన్వంతరమున నింద్రుఁడై యింద్రుఁ డెట్లు పరిపాలించవలయుననునది నేర్పెను."

అంత శౌనకుఁడిట్లడిగెను:-"సూతా! స్వాయంభువ మనువును నసురులును రాక్షసులును నేలబాధించిరో, అప్పుడు యజ్ఞభగవానుఁ డెట్లు వారిని రక్షించెనో ప్రసంగమును నీవు మాకు విస్తార పూర్వకముగఁ జెప్పవలయును."

ఇదివిని సూతుఁడిట్లనెను:- "స్వామీ ! విస్తారముగఁ జెప్పఁ జాలను. ఏలయనఁగా నికను జెప్పవలసినది చాలకలదు. సంక్షేపముగ మాత్రము చెప్పెదను మీరు సావధానులరై వినుఁడు."

స్వామీ! స్వాయంభువ మనువు తన పుత్రికలకును, బుత్ర పౌత్రులకును వివాహ మొనర్చిన మీఁదట సాంసారిక భోగములపై నాతని కరుచికలిగి, తనరాజ్యము నంతను బుత్రుల కప్పగించి, వైరాగ్యముచే సమస్తభోగముల మీఁదను విరక్తినిఁజెంది, తన భార్యయగు శతరూపతోఁ గూడి తపస్సు చేసికొనుటకు వనమునకుఁ బోయెను.

అచ్చటికిఁబోయి యాతఁడు గుహ్యమంత్రో పనిషత్సారమును నిరంతరము జపించుచుండెను ఆతఁడు జపించుచున్న మంత్ర సారమిది:-"ఈ సమస్త బ్రహ్మాండమును వ్యాపించినవాఁడును, నెవని సత్తామాత్రము చేతనే సమస్త ప్రాణులును చైతన్యవంతము

తైనవో కాని యెవనికే చేతనతయు నవసరములేదో, తఃపిశ్వ మంతయును శయనించుచున్నను నెవఁడు సర్వదా మేల్కొని యుండునో, అతఁడు జగత్తు నెఱుఁగునో, జగత్తెవరిని నెఱుఁగఁ జాలదో, కనఁబడునవియు, వినిఁబడునవియు నెవనివలన వ్యాపించి నవో, అట్లుండుటచేతనే ఆతఁడు సర్వవ్యాపకుఁడగు విభువు, బ్రహ్మయగుచున్నాఁడు జగత్తులో నేదికలదో అది యంతయును నీశ్వరునిచేఁ గప్పఁబడి యున్నది అందువలన భక్తిభావముతో భోగింపవలయును. సమస్తమును నాతనికి సమర్పించి ప్రసాద రూపమున గ్రహింపవలయును. ఎన్నడును నితరుల ధనములపై నాసక్తినిఁ జెందరాదు. ఆ బ్రహ్మ చక్షు, కర్ణశ్రోత్రాది ఇంద్రియ ములకు విషయముకాదు ఈ బాహ్యేంద్రియముల ద్వారా ఆతని జ్ఞానము అసంభవము; కాని యాతఁడు స్వయముగ జ్ఞానస్వరూ పుఁడు. ఆతని జ్ఞానమెన్నటికిని క్షీణింపదు. ఆతఁడందఱ యంతః కరణములందును నివసించుచుండును. ఏ విధమగు నాసక్తులును లేనివాఁడు. ఆ పరాత్పర ప్రభువును ధ్యానింపవలెను.''

ఏ ప్రభువునకాది కాని, మధ్యకాని, అంతముగాని, స్వపర భేదములుగాని లేవో, లోపలనిగాని బయటనిగాని కాకుండ నెవ్వఁడు సర్వత్ర వ్యాపించియున్నాఁడో, ఆది, మధ్యాంతములును, గర్త యును, ధర్తయును, హర్తయును నన్నియు నాతఁడేయై యీ దృశ్యప్రపంచమునంతను నెవఁ డుత్పన్నము కావించినాఁడో,ఎవఁడు సత్యస్వరూపుఁడో, చైతన్యుఁడో, అనంతుఁడో అట్టివాఁడు సర్వత్ర పరిపూర్ణుఁడై బృహత్స్వరూపుఁడగుటచే బ్రహ్మయనఁబడు చున్నాఁడు.

ఈ విశ్వమే ఆతని ప్రత్యక్ష స్థూలశరీరము. ఆతనికనంత నామములు కలవు. ఈశ్వర, సత్యస్వరూప, స్వయం ప్రకాశ, అజన్మ, పురాణపురుషాది నామములు ప్రసిద్ధములు త్రివిధ శక్తులకును నాతఁడేకైక ప్రభువు. తన మాయాశక్తిచే నీ విశ్వ బ్రహ్మాండమును రచించి, దానితోడనే పాలించుచుఁ బాలింపఁ జేయుచున్నాఁడు. ఆతఁడే తన నిత్యసిద్ధ జ్ఞానశక్తిచే నీ యన్నిటి నిఁద్యజించి సర్వథా నిరీహుఁడగు చున్నాఁడు. కర్మబంధన కారణ మైనను నైష్కర్మ్యసిద్ధికొఱకు సాధనరూపమగు కర్మను జేయవల యును. ఆతని ద్వారానే సకామకర్మస్థానమున నిష్కామకర్మ నొనర్చుచుందురు; ఏలయనఁగా నిష్కామ భావముతో జేయఁబడిన కర్మయే మోక్షమును బొందించుటకు సమర్థమగుచున్నది. కర్మ యొనర్చుటచేతనే బంధమగుచో భగవంతుఁడు నానావతారములను ధరించి వివిధ కర్మలనేలఁ జేయును. ఆ సర్వాంతర్యామియగు ప్రభువు కర్మలొనర్చును. ఆత్మలాభముచేఁ బూర్ణకాముఁడగుటచే నాతనికి కర్మా సక్తిలేదు. నిరాసక్తుఁడై కర్మలొనర్చును. ఈ విధముగ నెవరు తదీయులో, ప్రసన్నులో భగవచ్ఛరణాపన్నులో వారును నిష్కామకర్మలొనర్చుచు నాకర్మ ఫలముబమీఁద నాసక్తినిఁ జెందుదురు. ఏ ప్రభువందఱకును శిక్షణ నొసంగుచున్నాఁడో, నిష్కా ముఁడయ్యు కర్మల నాచరించుచున్నాడోఁ తన సనాతన మార్గమందు న్నాఁడో, ఎవఁడు జ్ఞానస్వరూపుఁడగుటచే నహంకార రహితుఁడో, ఎవఁడు పూర్ణకాముఁ డగుడచే నిష్కాముఁడో, పరప్రేరణచేఁ గార్యములొనర్పక సమస్త ధర్మముల నెవఁడు ప్రవర్తింపఁ జేయునో అట్టి పరాత్పర పరమేశ్వరుని నేను శరణు వేఁడుచున్నాను."

శ్రీశుక దేవుఁడిట్లనెను:- "రాజా! ఈవిధముగస్వాయంభువమనువు ధ్యానమందు తన్మయుఁడై ఏకాగ్రచిత్తముతో నీమంత్రోపనిషత్తునునిరంతరము జపముచేయుచుండెను జపము చేయుచుండ నాతనికి శరీరస్పృహలేదు. అదేసమయమున నచ్చటికి చాలమంది అసురులును, రాక్షసులును వచ్చిరి. వారు బుభుక్షు పీడితులై యుండిరి. ఆఁకలిచే వారందఱును గలిసి మనువును దినుటకుఁ బరువిడిరి. ఆతఁడు ధ్యానమగ్నుఁడై యుండెను. మనుపుత్రియగు నాకూతి గర్భమున బుట్టి యజ్ఞరూపమును ధరించిన సర్వాంతర్యామి యగు ప్రభువు వెంటనే అచ్చటకు యామములను పేరుగల తన పుత్రులతోఁగలిసి వచ్చెను. వారువచ్చి యక్షరాక్షసులతో ఘనఘోర యుద్ధమును గావించెను. చివరకు యక్షరాక్షసులోడిపోయిరి. భగవానుఁడు వారి నందఱను గొట్టి పాఱఁద్రోలెను. భగవంతుని యీ ప్రభావమును గాంచి దేవగణమత్యంత హర్షమును బొందిరి అప్పుడు దేవతలందఱును గలిసి భగవానుని దేవేంద్రుఁడవు కమ్మని ప్రార్థించిరి. దేవతల ప్రార్థన నంగీకరించి భగవానుఁడు స్వర్గమున నింద్రాసనముపైవిరాజిల్లెను. ఆతని పుత్రులగు యామములందఱును నామన్వంతరమున దేవతాగణములైరి ఈవిధముగ నామన్వంతరమున భగవాఁనుడింద్రుడై పాలన మొనరించెను. ఇప్పుడు నేను ప్రథమ మన్వంతరావతార కథను జెప్పితిని.

స్వాయంభువ మన్వంతరము గడచిపోయిన తరువాత రెండవ మన్వంతరమున నగ్నిపుత్రుఁడగు స్వారోచిషుఁడు రెండవ మనువయ్యెను ఆతనికి ద్యుమంతుఁడు సుషేణు డురోచిష్మంతుఁడు

మొదలగు మనుపుత్రులుండిరి ఆమన్వంతరమున నింద్రుని పేరు. రోచనుఁడు, తుషితులను వారు దేవగణమైరి. ఊర్జస్తంభాది యేడు గురు మునులు సప్తర్షి పదము నధిష్ఠించిరి. ప్రథమ మన్వంతరమున మన్వంతరావతారమును, నింద్రుఁడును నొక్కఁడే యైనట్లీ మన్వంతరమునఁ గాలేదు. ఇందులో రోచనుఁడింద్రుఁడు వేరుగ నయ్యెను. వేదశిరుఁడను మునికి తుషితయను భార్యయందు భగవంతుఁ డవతరించెను."

అంత శౌనకుఁ డిట్లనెను :- "సూతా! ఈ స్వారోచిష మనువు పూర్వజన్మమున నెవరు ఏ పుణ్యప్రభావముచే నాతనికీ త్రైలోక్య వందిత పదము ప్రాప్తించినది. దయయుంచి ఆకథను మీకుచితమని తోఁచినచో మాకుఁ జెప్పుడు."

ఇదివిని సూతుఁడిట్లనెను :- స్వామీ! ఈ ద్వితీయ మనువు యొక్క కథ మిక్కిలి సరసమైనది, మనోరంజకమైనది, శిక్షాప్రదమైనది. దానిని మీకుఁజెప్పెదను. మీరు దత్తచిత్తులరై దీనిని శ్రవణము చేయుఁడు."

కాశీక్షేత్రమందు భాగీరథిలోనికి పుణ్యతోయములగు వరుణానదివచ్చి కలియును. వరుణానది చాలాపవిత్రమైనది. ఈనదీతటమందుఁ బ్రాచీనకాలమున వరుణాస్పదమను నొక సుందరనగరము కలదు. దానిలో నొక సదాచారియుఁ గర్మనిష్ఠుఁడగు బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. ఆబ్రాహ్మణుఁడెంతో సుందరుడు. ఆతనినిఁ జూచుటకు దూరదూరములనుండి వచ్చుచుందురు. దేవతలతో స్వర్గ

మందు అశ్వినీ కుమారులెట్లు సుందరులుగనెన్నఁబడుచుందురో అదే విధముగ మర్త్యలోకమున నీబ్రాహ్మణ కుమారుఁ డతిసుందరుఁడుగ నుండెను. ఆతఁడు శారీరకముగ నెట్లు సుందరుఁడో ఆతని యంతఃకరణమును స్వచ్ఛము, నిర్మలము, పవిత్రతా పూర్ణమైయుండెను. తనయింటికివచ్చిన యతిథుల నాదరించుటయందును, స్వాగత సత్కారములనొనర్చుటయందును, వారిని సేవించుట యందును మిక్కిలిగ నాతఁడానందించెడువాఁడు. దీనివలన నాతనికి నలువైపులను మంచిపేరు కలిగెను. ఎవరైన నతిథిఆశ్రయ వృత్తాంత మడిగినచో నందరును నిస్సంకోశముగ నీతని పేరును జెప్పుచుండెడువారు. ఈతఁడును వచ్చిన వారిని మిక్కిలిగ నాదరసత్కారము లొనర్చుచు నుండుటకు వసతినిఁ జూపించుచు, భోజనమునకు సామాగ్రి నొసంగుచుండెడు వాఁడు. ఇంక వారేదైన నిచ్చను బ్రకటించినచో యథాసాధ్యముగఁ బూర్తికావించెడు వాఁడు. దీనివలన నాతని యశము సర్వత్ర వ్యాపించెను. అందరు నాతని కాదర సత్కారము లొనర్చెడు వారు. బ్రాహ్మణుఁడు కొంచెముగఁ బ్రకృతి మీదఁ బ్రేమకలవాఁడు. ఆత డేకాంతమున బోయి గంటల కొలఁది చెట్లను, ఆకులను జూచు చుండెడు వాఁడు. ఆతఁడిట్లను కొనెడు వాఁడు :- "ఇట్టిసుందర పుష్పములను జేసిన వాఁడెవఁడు! ఇన్ని ఫలవృక్షము లెట్లుత్పత్తి యైనవి! ఈ పృథివి యెంతపెద్దది! అబ్బో! ఈభూమిపై నెన్ని దేశములు కలవు! అందరును హిమాచలమును బ్రశంసించెదరు. హిమాలయ ప్రాంతమెట్లుండునో"

ఈవిధముగఁ భూమిమీద వనోపవన నద, నదీ పర్వతములను జూచుటకు సదాసముత్సుకుఁడై యుండెను.

ఒకదినమున నాతనికడ కొక వేదజ్ఞుఁడగు బ్రాహ్మణుఁ డతిథియై వచ్చెను. బ్రాహ్మణ కుమారుఁడాతని మిక్కిలిగ నాదర సత్కారములు కావించెను. శ్రద్ధతో భోజనము పెట్టెను, ఉండుటకు వసతి యొసంగెను. సత్సంగమునకు కూర్చుండినపుడు, అగంతుక బ్రాహ్మణుఁడు అనేక దేశముల వృత్తాంతములను జెప్పెను. ఆ దేశమట్లుండును, ఈ దేశమిట్లుండును, ఆదేశపు సమాచారములివి, అచ్చటి స్త్రీలిట్లుందురు. హిమాలయ పర్వత శిఖరముల పూర్వము, దానిపై సిద్ధులును, గంధర్వులును జరించుచుందురు. అప్సరసలు విహరించుచుందురని చెప్పెను."

ఈ విషయము లన్నిటిని వినఁగానే బ్రాహ్మణకుమారునకు మిక్కిలి కుతుహలము కలిగెను. అతడా యాగంతుంక బ్రాహ్మణు నిట్లడిగెను :- స్వామీ ! నాకొకసందేహమున్నది. మీరుదానిని నివారింపవలయునను. మీమాటలను బట్టిమీరు దేశ విదేశము లందుగల సమస్త ప్రదేశములను చెన్నగాఁ దిరిగినట్లు తోచుచున్నది. సముద్రమున కావలి దేశములకుఁ గూడ మీరుపోయినట్లున్నది, సర్వ పర్వతప్రాంతములను మీరు తిలకించినట్లున్నది."

బ్రాహ్మణుఁడిట్లనెను :- అవును ద్విజవరా! నీయనుమానము సత్యమే. భూమిమీద నేనుజూడని దేశములు లేనేలేవు."

అప్పుడు బ్రాహ్మణ కుమారు డిట్లనెను :- "నాసందేహ మేమనఁగా - మీరేమంతగా వృద్ధులను గారు, మీకు యాత్రా జనితశ్రమయును గనఁబడుటలేదు. అట్టియెడ మీరింత దీర్ఘయాత్ర నెట్లు చేయగలిగితిరో?"

బ్రాహ్మణుడిట్లనెను :- "ద్విజవరా! నేను కాలినడికను బోవలసిన పనిలేదు. నాకనేకములగు నోషధులు తెలియును, నావద్ద నొక ఓషధి కలదు. దానిని బాదములకు లేపనము చేసికొని, యే దిశకుఁబోవలయునో ఆ దిశకభిమంత్రించినచో నాయోషధీ ప్రభావముచే నేనర్ధదినములలో నాలుగు వేల క్రోసులు పోగలను."

ఇదివినగానే బ్రాహ్మణ కుమారునకుఁ జాల ఆశ్చర్యము కలిగెను. అతడిట్లనెను :- "స్వామీ! నాకు హిమాలయములను జూడవలయునను కోరిక మిక్కిలిగఁ గలదు. మీరు నన్ను గ్రహించు నెడల నేను నాకోరికను దీర్చు కొనఁగలనుఁ''

ఇది విని బ్రాహ్మణుఁ డిట్లనెను :- ''మంచిది నేనునీ కోరికను నెఱవేర్చెదను."

ఈ మాటతో బ్రాహ్మణ కుమారునకు మిక్కిలి యానందము కలిగెను. ప్రాతఃకాలమునసంధ్యాగ్నిహోత్రములను గావించుకొని హిమాచల యాత్రకొఱకుసిద్ధమయ్యెను అతఁడిట్లనుకొనెను :- "ఒక్కపూటలో నాలుగువేల క్రోసులు వెళ్లఁ గలిగినచో సాయంకాలమున కింటికి వచ్చి సంధ్యాగ్ని హోత్రములను జేసికొందును.

అందువలనఁ దనవెంట నగ్ని హోత్రదులకుఁ గావలసిన వస్తువు లను వేనినిఁ దీసికొని పోలేదు.''

బ్రాహ్మణుఁ డాతని పాదములకొక లేపనమును రాచెను. ఉత్తరదిశ నభిమంత్రించెను. ఇప్పుడతఁడుత్తర దిక్కుగా నెగుర సాగెను. ఎచ్చట దిగవలయునను సంకల్పము కలుగునో అచ్చట దిగుచుండెను. మరల నెగురు చుండెను. ఈవిధముగ మార్గమునఁ గల నగరోద్యాన, నదీ నదములను, విశిష్ఠ స్థానములను జూచుచు నా బ్రాహ్మణ కుమారుఁడు హిమాలయమునకుఁ జేరుకొనెను. అచ్చటి శోభనుగాంచి యతఁడు చకితుఁడయ్యెను, ఒక పర్వతశిఖరమునుండి మఱియొక పర్వతశిఖరమున కెగురుచు (బోవుచుండెను. ఆతఁడు హిమాలయ శోభను గాంచి ఆత్మవిస్మృతినిఁ జెందెను. మంచుగడ్డచేఁ గప్పఁబడి స్వచ్ఛ, శుభ్ర, నిర్మల రజతము వలె మెఱయుపర్వతములను గాంచి అతఁడు ముగ్ధుఁడయ్యెను. హిమాలయో పత్యకమందలి యద్భుత శోభయును, అచ్చటి విచిత్ర పుష్ప ముల మనోహరమగు వాసనయును, శాంత ఏకాంతస్థానములును నీ సమస్తవస్తువులు విప్రుని మనస్సునందొక యనిర్వచనీయానంద సంచారమును గలుగ జేసెను. బ్రాహ్మణుఁడు తన్నుఁదాను మఱచి కాలినడకను నాహిమా వృత ప్రదేశమందు విహరింపసాగెను. మంచుమీఁదఁ గాలి నడకనుబోవుటచే నోషధీ లేపనము పోయెను బ్రాహ్మణునకిది తెలియదు. ఆతఁడిటునటుఁ దిరిగి తిరిగి అలసి పోగానే, ఇంతలోనే భువన భాస్కరుఁడును నస్తాచలమునకుఁ

బ్రస్నాన మొనర్చుచుండెను. అప్పుడాతని కగ్నిహోత్రము, సంధ్యా స్మృతి కలిగెను. ఇప్పుడాతడు మరల నెగిరి యింటికిఁబోవుటకు సంకల్పించెను, కాని ఇప్పుడేమి జరుగును ఓషధి మంచునీరు చేఁగడుగఁబడినది. దాని ప్రభావము నశించినది. బ్రాహ్మణు డింటికి వచ్చుటక సమర్థుడయ్యెను. ఇప్పుడాతనికి మిక్కిలి చింత కలిగెను, "ఈసమయమున నాకెవరైన నొకసాధువు లభించినచో నాధర్మమునకు లోపము కలుగదు. సంధ్యాగ్ని హోత్రము లొన ర్చుట నావరమధర్మము. నేనన్నిటిని వదలఁ గలనుగాని ధర్మమును వదలుట నావలఁనగానిపని, ధర్మసంకటమునఁ బడిన వారిని సాధు వులే రక్షింపఁగలరు.'' ఇట్లాలోచించుకొని సాధువులనన్వేషించుట కాతఁడటు నిటుఁ దిరుగసాగెను. ఆతనికి సాధువెవరును దొఱక లేదు, గాని ఒక సాధ్వీమాత్రము దొరకెను.

ఆ వన్య ప్రదేశమందు వరూధిని యను నప్సరస అటు నిటుఁ దిరుగుచుఁ బ్రకృతి పర్యవేక్షణ చేయుచుండెను, యౌవన మదాతిరేకమున నున్న నాయప్సరస తన సౌందర్య కాంతులచే దశ దిశలను బ్రకాశింపఁజేయుచు ముగ్ధ హరిణమువలెఁ దిరుగు చుండెను. ఆమె స్వర్గమందలి సర్వశ్రేష్ఠలగు నప్సరసలలో నెన్నఁ బడుచుండెడిది. ఆమె అనవద్య సౌందర్యవతి, ఆమె యింత వఱకే పురుషునిఁ బ్రేమింపలేదు. అకాత్తుగా నామె దృష్టి విపత్తు లోఁబడిన నీ బ్రాహ్మణ కుమారునిపైఁ బడెను. ఏకాంతమున నీతని

యనవిద్య సౌందర్యమును గాంచి, అప్సరస యాతని రూపము నందా సక్తినిఁ జెందెను. కాముకుఁడెంతటి సుందరుఁడైనప్పటికిని కామినీ వాసన చేతను, నిరంతర మనచ్చింతనము చేతను నాతని సౌందర్యము మలినమగును. వానియందా కర్షణయుండదు. కాని సదా చారియును, సంయమియు నైనవాడంత సుందరుఁడు కాకున్నను, సంయమ సదాచారముల ఓజ తేజస్సులచే నాతని సౌందర్య మతి శయముగనుండును. ఆతని యందొక విధమగు నద్భుతాకర్షణము సమావేశమగును. ఆతనిపై దృష్టిని సారించిన వారందఱును వానిని జూచి ప్రేమించుచుందురు. ఆ వరూధిని ప్రేమ పిశాచి. ఇంత వఱకామె హృదయమందిరము ప్రేమప్రతిమలేక శూన్యముగనుం డెను. ఆమె దానియందింకను బ్రేమప్రతిమను స్థాపించలేదు. మం దిరమున కనురూపమగు ప్రతిమ ఆమెకుఁ గనఁబడలేదు. వెంటనే అననాహౌత భావముచే నా బ్రాహ్మణుని యనుపమ ఛవి ఆమె హృదయ మందిర మందుఁ బ్రవేశించుటయే కాదు [illegible]వంతముగ నచ్చటఁ గూర్చుండెను. అప్సరస యున్మత్త వలె నా విప్రకుమా రుని వైపు చూచుచుఁ జూచుచు నిలిచి పోయెను.

బ్రాహ్మణ కుమారుఁడు కామియైయుండినచో నాతని చిత్తమును జంచలమైయుండెడిది. ఆతఁడు మాటిమాటికి నామె ముఖము వైపు చూచుచుండెను. సాధారణముగ హృదయభావము ముఖమున నంకితమగును. దానినిఁ బఠెంచుటకుఁ బ్రయత్నించు చుండెను. కానీ ఆతడు ధర్మాత్ముఁడు. అందువలననాతఁడు వరూథిని వైపుచూడనైనఁ జూచుటలేదు. కాని వరూధిని తన సర్వస్వమును

నా బ్రాహ్మణ కుమారునకు సమర్పించి యుండెను. కావున నామె తన ప్రకాశముచే నాయరణ్యప్రాంతము నా ఛాసిత మొనర్చుచు వచ్చి సరళముగ విప్రకుమారుని సమ్ముఖమున నిలుచుండెను.

ఆ యేకాంతపర్వత ప్రాంతమందొక పరమసుందరి రమణీ మణినిగాంచఁగానే యా బ్రాహ్మణునకుఁ గొంచెము ధైర్యము కలిగెను. ఆతఁడు మధుర స్వరమున నిట్లనెను:- "సుందరీ! నీ వెవరవు? ఎవరిపుత్రికవు? ఇచ్చటనేకాంతమున నొంటరిగా నేలఁ జరించుచున్నావు?"

వరూధిని అత్యంతానురాగభరిత వాక్కులందు పరమస్నేహ, లజ్జా, వీడాభావములను బ్రదర్శించుచు నిట్లనెను:- "మహాభాగా! నేనుస్వర్గమందలియప్సరసను. నన్ను వరూధిని యందురు. నేను బ్రేమపిపాసినై యీ ప్రాంతమందు స్వేచ్ఛగా విహరించుచున్నాను. నేనుజాలమందిమనుష్యులను, దేవతలను దైత్యులను. యక్ష గంధర్వ, సిద్ధ, చారణ, కిన్నర, విద్యాధరాది దేవయోనులలోనివారి నందఱను జూచితినిగాని మీలోనున్న సౌందర్యము నాకెచ్చటను గనఁబడలేదు. మీరునన్నుఁబరవశనుజేసి ఆకర్షించి, నట్లెవరును జేయలేదు. మీరెవరు? ఎచ్చటి నుండి వచ్చుచున్నారు?"

ఇది విని బ్రాహ్మణ కుమారుఁడిట్లనెను:- "సుందరీ నేను బ్రాహ్మణుఁడను. అరుణాస్పదమను నగరనివాసిని. ఒక సిద్ధుని కృపచే, దివ్యానులేపన ప్రభావమున నేనీ ప్రాంతమునకురాఁగలితిని. నా యజాగ్రత్తవలన మంచునీరుచే నాలేపనముపోయినది. ఈ

సమయమున నేను గొప్ప ధర్మసంకటమునఁబడితిని. నేను నా అగ్నిహోత్రాదినిత్యకర్మలనుండి వంచితుఁడనైతిని. నీవు నాకు సాయముచేయవలయును.

వరూధిని అనురాగభరిత హృదయముతోడను, ప్రేమభరిత వాక్కులతోడను నిట్లనెను:-"ఓ దేవా! ఆజ్ఞాపింపుఁడు నేను నీకేమి సేవచేయవలయును?"

బ్రాహ్మణుఁడిట్లనెను:-"నేను నాయింటికిఁ జేరఁగల నుపాయ మేదైననున్నచో చూడుము."

వరూధిని తన సమస్త మమతను గ్రుమ్మరించుచుఁ, గన్నుల నశ్రువులరాల్చుచు, గద్గదస్వరమున నిట్లనెను:-"జీవనధనా! నీవిట్టి మాటను మీనోట నిఁకఁ బలుకకుఁడు. నేను నీవులేక బ్రదుకఁజాలను. నేను నాసర్వస్వమును మీ చరణముల కర్పించితిని. మీయండను రక్తనగు నన్నుస్వీకరింపుము. దుఃఖినియగు నాదుఃఖమును దోఁ గొట్టుము. కామబాణపీడితనగు నాకు ప్రేమదానమొసఁగి ప్రసన్నుఁడ వగుము."

బ్రాహ్మణుఁడు గంభీరుఁడై యిట్లనెను:- "సురసుందరీ! నీ వెట్టి ధర్మవిరుద్ధపు పలుకులు పలుకుచున్నావు? బ్రాహ్మణుఁడు కామవశుఁడగుటెన్నటికిని ఉచితముకాదు. అతఁడు సదాధర్మములో నుండవలయును. తన నిత్యనైమిత్తిక కృత్యములందు నిరంతర మనురక్తినిఁ జెందియుండవలెను. సాంసారిక ప్రేమ పదార్థములు

క్షణకాలము సుఖము నొసంగునుకాని ధర్మాచరణము లోకమునఁ గొంత కఠోరముగఁ గనఁబడినప్పటికినిఁ బరలోకమం దనంత సుఖము నొసంగును. కావున నీవు నాకు కొంచెము సహాయమొసర్చి నచో నేను నా యింటికిఁ జేరగలను.

మ. తరుణీ రేపును మాపు హవ్యములచేతన్ దృప్తుఁ డౌవహ్ని న
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుఁ గన్ శక్య మే నీకు నా
కరణుల్ దర్భలు నన్నులున్ ప్రియములై నట్లన్యముల్గావౌ డల్
తిరమే చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్॥

-మనుచరిత్రము

వరూధిని యిట్లనెను:- "దేవా ! వరలోకమందును నిదియే సుఖము. మీరు భాగ్యవశమున నాకు ప్రాప్తించితిరి. మీరిచ్చటనే నివసింపుడు; ఈ ప్రాంతము స్వర్గముకంటెను సుందరమైనది. కావుననే మేము స్వర్గమును వీడి యిచ్చటఁ జరించుచుందుము. నేను మీకన్నివిధములను సేవయొనర్చెదను. నా హృదయహారముగఁ జేసికొందును. దివ్యవస్త్ర భూషణములను సుందర భక్ష్యభోజ్యములను, అంగరాగమును, వాడని పుష్పముల , దివ్యమాలలను, ఇతర భోగసామగ్రిని మీకు సమర్పించుకొనుచు చును. నా తను, మన, ధనములను, సర్వస్వమును సమర్పించి సదా మీసుఖసంతుష్టులను గావించుచుందును."

బ్రాహ్మణుఁడిట్లనెను:- "భామినీ! ఈ సాంసారిక పదార్థములందును, విషయభోగములందును యథార్థమగు సుఖములేదు నిజ

మైన సంతోషములేదు వాస్తవికసుఖము ధర్మపాలనమునఁ గలదు. నీవీ పార్వత్యప్రదేశము రమణీయమైన దనుచున్నావు. నాకొఱకు అగ్నిశాలయేసర్వోత్తమ సుఖస్థానము. త్రేతాగ్నులు నాఆరాధ్యములు యజ్ఞవేదియే నాకు ప్రియ. నీవు నాతో నట్టిధర్మవిరుద్ధపు ప్రస్తావము కావింపవలదు. నేను చంచలభావశమున దేశములు చూడవలయు నను లోభముచే నా అగ్నిశాలను వీడి యిచ్చటికి వచ్చితిని. బ్రాహ్మణుఁ డగ్నిశాలయందేయుండి నిత్యనైమిత్తిక కర్మలయాచరిం డవలయును ఆతడు దేశవిదేశములను జూడవలయునను లోభమును సంవరణము గావింపవలయును. యాత్రతలోఁ బూజాసామగ్రి దొఱ కదు. బాగుగా నిత్యనైమిత్తిక కర్మలును జరుగవు."

వరూథిని యిట్లనెను :- "ప్రాణనాథా ! మీరెట్టి స్నేహ హీనవాక్యములను బలుకుచున్నారు. శరణాగత రక్షణమును శాస్త్ర ములలోఁ బరమధర్మముగఁజెప్పిరి. నేను మిమ్ము శరణుజొచ్చి తిని. మిమ్ముల నెదుటనుంచి కాముఁడు నాకు మార్మిక బాధను గలిగించుచున్నాడు. నా అంగప్రత్యంగములందా మార్మిక బాణ ములు గ్రుచ్చుకొన్నవి. శరణాగతరక్షకా ! దానినుండి నన్ను రక్షింపుము. దీననగు నన్ను స్వీకరించుఁడుఁ గౌఁగిలింపుఁడు."

శా. ఎందేదెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
చెందున్ గుంభగతప్రదీపకళికా శ్రీదోపనెందెందు బో
కెందేనింద్రియముల్ సుఖంబుగను నాయింపేపరబ్రహ్మమా
నందోబ్రహ్మయటన్న ప్రాజ్ఞుడవు నంతర్బుద్ధినూహింపుమా॥

మనుచరిత్రము

అప్పుడా బ్రాహ్మణుఁడు-

శా. ఈ పాండిత్యము నీకుదక్క మఱియెందే గంటిమే కామశా
స్త్రోపాధ్యాయినినావచించెదవుమేలోహో త్రయీధర్మముల్
పాపంబున్ రతిపుణ్యమంచునిఁక నేలాతర్కముల్ మోక్షల
క్ష్మీపాధ్యాగమసూత్రపంక్తికివెపోమీసాంప్రదాయార్థముల్
-మనుచరిత్రము

ఇట్లు పలుక నామె అత్యంత కాతరభావముచేఁ బరమాను రాగముతో బలపూర్వకముగ బ్రాహ్మణునిఁ గౌఁగిలించుకొనెను. ఆసమయమున నామె శరీరము రోమాంచ మయ్యెను. కామపీడిత యయ్యెను.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁబాలిండ్లుపొంగారఁబై
యంచుల్ యొత్తఁగ గౌగిలించి యధరంబానింపహా! శ్రీహరీ!
యంచున్ బ్రాహ్మణుఁడోర మోమిడి తదీయాంసద్వయం బంటి పొ
మ్మంచున్ ద్రోచెఁ గలంచునే సతులమాయల్ ధీర చిత్తంబులన్ ॥
-మనుచరిత్రము

ఆమెయొక్క యిట్టి సాహసమును గాంచి బ్రాహ్మణుఁడు సాహసముతో గద్దించి రోషముతో నిట్లనెను :- "దూరముగాఁ

బొమ్ము దుర్మార్గులారా ! నన్ను దాఁకితివా నిన్నిప్పుడే భస్మ మొనర్చెద . నీయిచ్చను నెఱవేర్చువాని కదకుఁబొమ్ము" ఇట్లు పలుకఁగానే ఆ యప్సరస మానవుఁ డగ్నిని, సర్పమును, వృశ్చికమును, సింహాది హింసక మృగములను గాంచి వెనుకకుఁ దగ్గినట్లు తగ్గెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా ! భగవానుఁడీ మనుష్య ప్రాణినపూర్ణముగఁ జేసినాఁడు. ఈతఁడొక్కరినే ప్రేమింపఁగలఁడు. ధర్మమును ప్రేమించువారికి ధర్మవిరుద్ధమగు కామమును, ధర్మహీనమగు ధనమును దుచ్ఛములు. వారు ధర్మముతప్ప మిగిలినవాని నన్నిటినిఁ దుచ్ఛముగఁ దలంచెదరు. ధర్మబలివేదికపై వారు సమస్తమును హోమము కావించెదరు. ధర్మముతప్ప వారినింకేమియు నాకర్షింపఁ జాలదు. హృదయమునఁ గామమావేశించి యున్నప్పుడు, అట్టి కామికి ధర్మార్థములు తోఁచవు. అట్టివాఁడు కామము కొఱకై ధర్మవిరుద్ధాచరణము కావించును. ధనమును నీరువలెఁ బ్రవహింపఁ జేయును. అర్థలోలుపుఁడు ధనముకొఱకు ధర్మకామములు నెఱుఁగఁడు. డబ్బుకొఱకు తన భార్య, సోదరి, కూమార్తెతోఁగూడ ననుచితకార్యము నొనర్చును. ఏ వరూథిని యొక్క కటాక్షవీక్షణముకొఱకు కలియను గంధర్వుఁడు తన సర్వస్వమును హోమమొనర్ప దీనతా పూర్వకముగఁ బ్రార్థించెనో అట్టిదానిని ధర్మభీరువగు బ్రాహ్మణుఁడు చెడ్డవస్తువువలెఁ గాలఁదన్నెను."

బ్రాహ్మణుఁడు సూర్యాస్తమానమునకుఁ బూర్వము తన యగ్నిహోత్రశాలకుఁజేరఁ నసమర్థుఁడగుటను దెలిసికొని ఆతఁడు చింతించెను. ఆతఁడిట్లనుకొనెను: –"నే నిన్నాళ్ళు నుండి అగ్ని హోత్రు నవ్యగ్రభావముతో, ఆలస్య, దంభ, కపటరహితముగ నారాధించితిని. అట్టివాఁడిట్టిసమయమున సహాయము కావింపఁడా?" యని యాతఁడు నిర్మలబలముల నాచమించి చేతులు జోడించుకొని యిట్లనెను:-

ఉ॥ దానజపాగ్ని హోత్రపరతంత్రు డనేని, భగవత్పదాంబుజ
ధ్యానరతుండనేని, పరదార ధనాదులఁ గోరనేని స
న్మానముతోడనన్ను సదనంబుననిల్పుమినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ మున్న రయంబున హవ్యవాహనా ॥

–మనుచరిత్రము

అగ్నిదేవా! నీవు జగత్తునకుఁ బాలకుఁడవు. అందఱకును రక్షకుఁడవు. నన్నురక్షింపుము."

సూతుఁడిట్లనెను –"మునులారా! ఇట్లు పలుకఁగానే వెంటనే ఆతని శరీరములో గార్హపత్యాగ్ని ప్రవేశించెను. ఆతని జ్వాలలచే నాబ్రాహ్మణుని శరీరము ద్వితీయ సూర్యునివలెఁ బ్రకాశించెను. వరూథుని ఆతని యీ యపూర్వ ఏజస్తేజములను గాంచి యింక నధికముగ నాసక్తినిఁ జెందెను. అగ్ని ప్రభావముచే నాతఁడు

వెంటనే యెగిరి సూర్యాస్తమానముకాక పూర్వమే అతఁడింటికి జేరుకొనెను. అచ్చటికిఁజేరి యాతఁడు తన నిత్యాగ్నిహోత్రాదికమును జేసికొనెను."

ఇచ్చట వరూథినిస్థితి అధ్వాన్నముగ నుండెను అతడు వెడలిపోఁగానే ఆమెఖండిత లతవలె నేలపైఁబడెను. ఆమెకు శరీర స్పృహలేదు. దీర్ఘనిశ్వాసములను విడుచుచు, జలములనుండి బయటఁబడిన చేఁపవలెఁదపతప కొట్టుకొనుచుండెను. ఆ రాత్రి యంతయు నామె మిక్కిలి కష్టముతోఁదన్నుకొనుచుఁగన్నులన శ్రువులనురాల్చుచు గడిపెను. ప్రాతఃకాలమైనను నామె స్థితిలోఁబరి వర్తనము కలుగలేదు. ఆఁకలిదప్పులు, ఆహారవిహారముల స్పృహయే లేకుండెను. అశ్రువులను రాల్చుచు నాబ్రాహ్మణకుమారునిఁ దలంచు కొనుచు విలవిల నేడ్చుచుండెను.

ఆసమయమునఁగలియను గంధర్వుఁడచ్చటకు వచ్చెను. ఆతఁడిది వఱకే వరూథినియందాసక్తిని, జెందియుండెను. ఆతఁడిదివఱకే మిక్కిలి దీనముగ వరూథినినిఁ బ్రణయ భిక్షనుగోరెను. అప్పుడు వరూధిని నాతని నంగీకరింపక పోవుటయేకాదు తిరస్కరించియుండెను. వాఁడు వెనుదిరిగిపోయెను కాని యాతని మనస్సు నుండి వరూథినియొక్క మనోహరరూపము పోలేదు. ఆతఁడు సదాదానినే చింతించుచుండెను. నేఁడాతఁడు వరూథినియొక్క యీ స్థితిని గాంచి పరమ విస్మితుఁడయ్యెను వరూథినికీ స్థితి యెట్లుకలిగిన దాయని ధ్యానమునఁ జూచెను. ధ్యానమున నాతని కన్నివిషయములు

నుఁదెలిసెను. ఇప్పుడాతని ముఖము మెఱయసాగెను ఆతఁడిట్లను కొనెను "నేను బ్రాహ్మణరూపమును ధరించి యీమెనేల మోసగింప కూడదు?"

ఆతఁడు కామిఁ కామ సమ్ముఖమున సత్య ధర్మ ము ల కాతనిమనస్సున నాదరములేదు. అందువలన మాయావి యగు నా గంధర్వుఁడు మాయచే నదేవిధముగ బ్రాహ్మణ రూపమును ధరించి ఆమె సమ్ముఖమున నటునిటుఁదిరుగ సాగెను. వరూథిని వానినిఁ గాంచి నాతఁడు మరల వచ్చినాఁడని భావించి పరువిడి ఆతని సమీపమునకుఁబోయి యిట్లనెను:- దేవా! మీరు నన్ను రక్షింపవల యును. నిజముచెప్పుచున్నాను, మీరునన్నుఁ గాలఁదన్నినచోఁ బ్రాణములు వదలెదను. దీనిచే మీకు స్త్రీ వధా పాపము సంభ వింపఁగలదు."

బ్రాహ్మణ వేషదారియగు కలియిట్లనెను:- "భామినీ! ఏమి చేయుదును. నేమ ధర్మసంకటమునఁ బడితిని ఒక ప్రక్క నా వ్రతమును, మఱియొక ప్రక్క నీప్రాణ రక్షణము. వీనిలో దేనిని గ్రహింతును దేనిని వీడెదను."

అంత దీనతాస్వరమున వరూథిని యిట్లనెను:- "ధర్మజ్ఞా! ఎవరి ప్రాణమునైన రక్షించుట కోటిధర్మములకు మించినది. మీరు నన్ను రక్షించినచో మీకుఁ బుణ్యలోకములు ప్రాప్తింపఁగలవు."

బ్రాహ్మణవేషధారియగు గలియను గంధర్వుఁడిట్లనెను:- "నీవొక ప్రతిజ్ఞను జేయవలయును. రతికాలమున నీవు నేత్రములను

మూసుకొనవయును, ఆసమయమున నావైపునఁ బొరపాటుననైనఁ జూడరాదు."

వరూథినికి దీన నేమి యభ్యంతరముండఁగలదు ? ఇద్దరకును గాంధర్వవివాహము జరిగినది. ఇద్దరునానందముతో గిరిరాజముపైనఁగల పుష్పకాననములందును, సుందరమనోహర పర్వతగుహలందును, సుందర సరిత్తటము లందును, విహరించుచుండెను. వరూథిని గర్భాధారణసమయమున నా బ్రాహ్మణదేవునిఁ తేజోమయమూర్తినే ధ్యానించుచుండెను. కొంతకాలమున కామెకు గర్భము కలిగెను. ఆమెకు గర్భమని తెలిసి గంధర్వుఁడగు కలి వెడలిపోయెను. కాలాంతరమున నాయప్సరస యొక పుత్రరత్నమును బ్రసవించెను. ఆతఁడు కిరణములచే సూర్యునివలె వెలుఁగుచుండెను. అందువలనఁ తల్లి యాతనికి స్వారోచిషుఁడను బేరును బెట్టెను. క్రమక్రమముగా నాబాలకుఁడు పెరిగి పెద్దవాఁడగుచుండెను. ఆతఁడు మునులవలన వేద, వేదాంగములను, ధనుర్వేద సహితముగ సమస్త విద్యలను నేర్చుకొనెను. ఆతఁడు ధనుర్బాణములను ధరించి రాజకుమారులవలె నాపర్వత ప్రాంతమునఁ జరించుచుండెను.

ఒకరోజున నాతఁడు ధనుర్బాణములను ధరించి, ఒకానొక అత్యంత మనోహరమగు నువత్యక సమీపముగఁబోవు చుండునంతలో నాతనికి "రక్షించుఁడు, రక్షించుఁడను కరుణాభరితమైన

సుమధుర కోమల శబ్దములు వినఁబడెను దృష్టిని సారించిచూడఁగా నొక అత్యంత సుందర నవయువతి భయవిహ్వలయై ఆయనినభత భిక్షను వేడుచుండెను."

తనధనుస్సునకు బాణమునెక్కిడి నవయువకుఁడగు స్వరోచిషుఁ డిట్లనెను :- "దేవీ ! నీవు భయపడవలదు. నేను నిన్ను రక్షించుటకు సిద్ధముగ నున్నాను. నీవెవతెవు ? ఎవరి పుత్రికవు నీకు భయమెవరివలనఁ గలిగినది ! వృత్తాంతము నంతను నాకు వినిపింపుము."

ఇదివిని భయమునవణకుచు నాయువతి నలువైపులను దృష్టిని సారించి యిట్లనెను :- "దేవా ! విద్యాధరులలో నొక గణమున కధిపతిగా నలనాభుఁడను నొక గంధర్వరాజు కలఁడు. ఆతని పుత్రునిపేరు ఇందీవరాక్షుఁడు. నేనాతని పుత్రికను. నాపేరు మనోరమ మా మాతామహుఁడు మరుధన్వుఁడను గంధర్వుఁడొక విఖ్యాతవీర్యము కలవాఁడు. అతఁడు వశిష్ఠభగవానుని వలన సత్త్రహృదయమను విద్యను నేర్చుకొనెను. వశిష్ఠుడు స్వాయంభువ మనువు నుండియును, స్వాయంభువ మనువు పినాకధారియగు శూలపాణి రము శివునినుండియు నేర్చుకొనెను నేను నాతండ్రి కేకైక పుత్రికను, నాకిద్దరు సఖులుండిరి. ఒక దానిపేరు విభావరి. ఆమె మందారుఁడను విద్యాధరుని పుత్రిక, రెండవయామె కళావతి యను నది పారమునియొక్క పుత్రిక, మేము ముగ్గురమును క్రీడలొనర్చుచుఁ గైలాసపర్వతమందలి ఒక పావన ప్రదేశమునకు బోయి

తిమి. అచ్చట మిక్కిలి చిక్కియున్న యొక విరూప మునినిగాంచి యౌవనమదమున నాతనితో బరిహాసములాడితిమి. ముని క్రోధో ద్రిక్తుడై నాతో నిట్లనెను :- "దుష్టా ! నీవునన్ను పరిహాసమొన ర్చుచున్నావు. పొమ్ము. అల్పకాలముననే ఒకానొక రాక్షసుడు నీపై కుఱుకగలడు."

మునిశాపమును విని నాసఖులు మునిని దిట్టసాగిరి. ఆతని తపస్సును నిందింపసాగిరి. ముని క్రోధముతో నుండెను, అందు వలన నాతడు వారిలో నొక స్త్రీకకు గుష్టరోగము ప్రాప్తింపగలదనియును, రెండవ యామెకు రాజయక్ష్మ (క్షయ) ప్రాప్తించు ననియు శపించెను. ముని శాపమసత్యము కాదు, కాజాలదు. కావున వెంటనే వారిద్దరి కారోగములు సంభవించెను. నావెంట నేటికి మూడు దినముల నుండి యొక భయంకర రాక్షసుడు పడినాడు చూడుడు. వాడు గర్జించు చున్నాడు వానినుండి నన్ను రక్షింపుడు.''

ఆమె యిట్లు చెప్పునంతలో నొక భయంకర రాక్షసుడు స్వరోచిషునకు గనబడెను. అప్పుడు భయవిహ్వలయగు మనో రమ యిట్లనెను :- "దేవా ! మీరీ రాక్షసునిపై నేనుజెప్పినయస్త్ర ములనే విడువుడు. విషయమేమనగా మా మాతామహునకు వచ్చిన అస్త్రము లన్నిటిని నిరణముక్రింద నాయస్త్ర విద్యను మా తండ్రి కొసంగి నాడు. నాతండ్రి నా మీదగల ప్రేమచే నాకు

నేర్పినాఁడు. మీరు నానుండి యా విద్యను వెంటనే ప్రయోగోప సంహారములను నేర్చుకొనుఁడు. వానిమూలమున మీరు వానిని జయింప గలరు.''

స్వరోచిషుఁ డాచమన మొనర్చి సంతోషముతో నాయస్త్ర హృదయమును గ్రహించి, యాయస్త్రమును నా రాక్షసునిపైఁ బ్రయోగింపఁ దలఁచెను. దీనిచే రాక్షసుఁడు భయభీతుఁడై యిట్లనెను :- ''శూరవీరా ! ముందుగా నా మాటలను విని తరువాత నీ యస్త్రమును బ్రయోగింపుఁడు''

స్వరోచిషుఁడిట్లనెను :- "చెప్పుము. ఏమనెదవు ?'' రాక్షసుఁడిట్లనెను :- ''వీరవరా ! నేను రాక్షసుఁడనుగాను. ఈవిల్ల తండ్రియగు నిందీవ రాక్షసుడను. విద్యాధరుఁడను.''

స్వరోచిషుఁడిట్లడిగెను :- ''అయితే నీవు రాక్షసుఁడ వెట్లైతివి ? నీపుత్రికనే హింసింపఁ బూనితివేమి ?''

రాక్షసుడిట్లనెను :- "అయ్యా ! ఇది నాస్వకర్మ ఫలమునే. నాయుర్వేదమును జదువుటకు బ్రహ్మమిత్రుడను ముని కడకు బోయితిని, ఆతఁడు నన్ను నిషేధించెను. నేను మాఱువేషమున మోసగించి చదివితిని. విషయము తెలియగానే ఆతఁడు రాక్షసు డగునట్లు శాప మొసంగెను. మిక్కిలి అనునయ వినయము లొనర్పఁగా నాతఁడిట్లనెను :- "రాక్షసుఁడవై నీవు నీపుత్రికపైఁ తెలియక హింసింప బడు నపుడొక యువకుఁడు నీపైఁ బ్రచండముగ నాస్త్ర

మణకు రాఁగలఁడు. ఆతని మూలమున నీకుద్ధారము కలుగఁగలదు. నీకుమరల గంధర్వలోకము ప్రాప్తింపఁ గలదు." ధర్మజ్ఞా! ఇప్పుడు నాకు పూర్ణజ్ఞాన మబ్బినది. నే నీకాయుర్వేద విద్య నొసంగెదను. ఈనామనోరమ కన్యను గూడ నీకొసంగెదను." ఇట్లు పలికి యాతఁడు తన కూఁతురను, ఆయుర్వేద విద్యను నొసంగి గంధర్వ లోకమునకుఁ బోయెను. అనంతర మాతనికి విద్యాధర జన్మము ప్రాప్తించెను.

ఇచట స్వరోచిషుఁడు మనోరమను విధ్యుక్తముగ వివాహ మాడెను. ఆయుర్వేద ప్రభావముచే నాతఁడు తన పత్ని యొక్క యిద్దర సఖులను రోగ విముక్తలను గావించి వారిని గూడ వివాహ మాడెను. ఈవిధముగ నాతఁడు తన ముగ్గురు పత్నులతో నామనో హర హిమాలయో పత్యకలందు నానందముగ విహరించు చుండెను. ఆముగ్గురి గర్భముల నుండి విజయ, మేరునంద, మహాబలియను ముగ్గురు పుత్రులుదయించిరి. ముగ్గురు పుత్రులకు మూఁడు నగర ములను నిర్మించి వానిలో నుంచెను. ఈముగ్గురు పత్నులతోఁ బూర్వరీతిని పార్వత్య ప్రదేశమందే ఆనంద విహార మొనర్చు చుండెను.

స్వరోచిషునకు వేటయనిన మిక్కిలి ప్రీతి అందువలన నొకదినమున ధనుర్బాణములను ధరించి యాతఁడొక సూకరమును వెంటాడెను. ఇంతలోనే ఒక హరిణము వచ్చి యిట్లనెను:- "ధనుర్ధా రులలో శ్రేష్ఠుఁడైనవో రాజా!. నీ వీ సూకరముపై బాణమును

ప్రయోగించెదవేల ? నన్నే ఆ బాణముతోఁగొట్టి చంపివేయుము దానిచే నేనత్యంతక్లేశము నుండి బయటఁబడఁగలను. నీ బాణమును సఫలము గాఁగలదు."

మృగినోట మానుష వాణిని విని సహానుభూతి స్వరమున స్వారోచిషుఁడిట్లనెను:- "మృగీ ! నీ కేమి కష్టముకలదు నీకష్టమున కుఁ గారణమును జెప్పుము. నాకు చేతనైనంతవఱకు దానిని నివారించుటకుఁ బ్రయత్నించెదను."

మృగి యిట్లనెను:- నీ కే కష్టమును లేదు, ఎవనిని నేను ప్రేమించుచున్నానో ఆతఁడు నన్ను బ్రేమించుటలేదు. ఇదియే నాకష్టము, ప్రేమ లేని రూక్షజీవనము వ్యర్థము. నా ప్రేమాస్పదుని అవ హేళనమును భరించుటకంటె మరణమే మంచిది, సర్వ శ్రేష్ఠమైనది.

స్వారోచిషుఁడిట్లనెను :- "నీవు ప్రేమించుచుండ నిన్ను ప్రేమింపని యాపురుషుఁడెవఁడు ? వట్టి హృదయహీనుఁడు.

మృగి యిట్లనెను,- కాదు, హృదయహీనుఁడు కాఁడు; కాని యాతఁడన్య స్త్రీలను బ్రేమించుచున్నాఁడు.

స్వారోచిషుఁడిట్లనెను :- "నాకు ఆతడెవరో చెప్పుము."

మృగిట్లనెను :- "దేవా ! అపరాధమును క్షమింపవల యును. నేను మిమ్మే ప్రేమించుచున్నాను, నిన్నేఁబొందఁ దలంచు

చున్నాను. మీకీ సుందరులుండఁగా నన్ను ప్రేమింపరు కావున మీ బాణముచేఁ జచ్చుటయే నాకు సుఖము"

నవ్వి స్వారోచిషుఁడిట్లనెను :- నేను ద్విపాదుఁడను, నీవు చతుష్పాజ్జంతువవు. నేను నిన్నుఁ బ్రేమించినను వ్యర్థమే నిన్నెట్లు వివాహమాడఁ గలను ?"

మృగియిట్లనెను :- "మీరునాపైఁ గృపఁజూచుచో ననురాగ భరిత హృదయముతో నన్నాలింగనము చేసికొనుము. స్నేహాలింగనము ననంభవములును సంభవములుగఁ జేయఁ గలుగు దివ్యౌషధి.

ఇదివిని సరోచిషుఁడు స్నేహపూర్వకముగ దాని నాలింగన మొనర్చుకొనెను. ఆలింగనము చేసికొనఁగానే అది అత్యంత సుందరి దివ్యరూప ధారిణియు, సర్వాంగసుందరియు, సుకుమారియునగు స్త్రీ యయ్యెను."

విస్మితుఁడై స్వారోచిషుఁ డిట్లనెను :- "నీవెవరవు ?"

నవ్వి యామె యిట్లనెను :- "దేవా ! నే నీ వనమున కధిష్ఠాత్రి దేవతను, ప్రథమ మన్వంతరమైన తరువాత, ద్వితీయ మనువు వీర్యముచే నాగర్భమున నుత్పన్నము కాఁ గలఁడని నాకు దేవతలు చెప్పిరి. కావున మీరు మీ వీర్యముచే నాయందు ద్వితీయ మనువు నుత్పన్నము కావింపుఁడు.

ఇది విని స్వరోచిషుఁడు వనదేవీ గర్భమునుండి యొక పుత్రరత్నము నుత్పన్నము కావించెను. తండ్రి అతనికి ద్యుతుమంతుఁడను పేరిడెను. కానిస్వరోచిషుని పుత్రుఁడగుటచే స్వారోచిషుఁడయ్యెను. తపఃప్రభావముచే నాతఁడు బ్రహ్మను ప్రసన్ను నొనర్చుకొనెను. ఆతఁడితనిని మను పదమునఁ ప్రతిష్ఠితునొనర్చెను. ఈతఁడే ద్వితీయ మన్వంతరమున కధిపతియగు స్వారోచిషమనువయ్యెను. స్వారోచిషుడనునది అగ్నియొక్క పేరు. కావున స్వారోచిషడను నది ఒకానొక కల్పమున నగ్నిపుత్రుడను పేర విఖ్యాతినిఁ జెందెను.

తదనంతరము పరీక్షిన్మహారాజిట్లు డిగెను :- "స్వామీ ! ద్వితీయ మన్వంతరావ తారము పేరేమి ? ఆతఁడేమి విశేష కార్యము నాచరించెను ? ఈ కథ యట్లేయున్నది.

ఇదివిని శ్రీశుకుఁడిట్లనెను :- రాజా ! ఈయవతారమందు భగవంతుని నామము "విభువు"

రాజిట్లడిగెను :- "స్వామీ ! ఈ విభుని భార్య పేరేమి ? ఈతఁడే కార్యముల నొనర్చినాఁడు ?"

అంత శ్రీ శుకుడిట్లనెను :- "మహారాజా ! ఈవిభువు వివాహమాడలేదు ప్రపంచములో నైష్ఠిక బ్రహ్మచర్య మెట్లుండ వలయునో తానాచరించి చూపినాఁడు. ఇదియే ఆతఁడొనర్చిన కార్యము పూర్వము పుత్రులకు గతిలేదను మాన్యత యుండెడిది.

ఈతఁడిట్లనెను :- "లేదు పరమార్థమునకు దారా పుత్రులవసరము లేదు. సంతాన వాసన లేనివారఖండ బ్రహ్మచర్య వ్రతము నాచరించినచో నక్షయ లోకములను బ్రాప్తింపఁగలరు మోక్షాధికారులగుదురు. నైమిశారణ్యమందున్న నెనుబది యెనిమిది వేలమంది మహర్షులునుగౌమారత్వమునుండియే బ్రహ్మచర్యవ్రతమును బాలించుచు యమనియమాది సాధనములతో సాధనతత్పరులైరి. ఈ వ్రత దీక్షను విభుభగవానుఁడే వీరికొసంగెను. వీరు కల్ప జీవులగు ఋషులు, కలియుగమురాఁగానే వీరు జనలోకము నకుఁబోవుదురు. మిగిలిన సమయమును నైమిశారణ్యాది పుణ్యస్థలములందు భగవత్కథలతోఁగాలమును గడపు చుందురు."

శ్రీ శుకఁడిట్లనెను :- "రాజా ! నేను నీకు ప్రథమ, ద్వితీయ మన్వంతరావతారములను గూర్చి చెప్పితిని, ఇప్పుడిఁకఁ దృతీయ చతుర్థ మన్వంతర రావతార చరిత్రమును వినుము."

....

## తృతీయ చతుర్థ మన్వంతరములు

శ్లో॥ చతుర్థ ఉత్తమభ్రాతా మనుర్నామ్నా చ తామసః ।
పృథుః ఖ్యాతిర్నరః కేతురిత్యాద్యా దశ తత్సుతాః ।
తత్రాపి జజ్ఞే భగవాన్హరిణ్యాం హరిమేధసః ।
హరి రిత్యాహృతో యేన గజేంద్రో మోచితో గ్రహాత్ ॥

-శ్రీభాగ. ౮ స్కం. ౧ అ. ౨౮, ౨౯ శ్లో ॥

సీ॥ మానవాధీశ్వర మనువు నాలవవాఁడు,
తామసుండనఁగ నుత్తముని భ్రాత
పృథివీపతులు కేతువృషవరఖ్యాత్యాదులతని
పుత్రులు పద్గురధిక బలులు
సత్యక హరివీర సంజ్ఞులు వేల్పులు త్రిశిఖ
నామము వాఁడు దేవవిభుఁడు
మునులు జ్యోతిర్వ్యోమ ముఖ్యులు
హరిపుట్టె హరిమేధునకుఁ బ్రీతిహరిణియందు

ఆ. గ్రాహ బద్ధుఁడయిన గజరాజు విడిపించి
ప్రాణ భయము వలనఁ బాపిరాచె
హరిదయా సముద్రుఁడఖిల లోకేశ్వరుఁ
డనిన శకునిఁజూచి యవని విభుఁడు.

శ్రీమదాంధ్ర భాగవతము

నాస్తికు లెందఱో జగత్తునకుఁ గర్త లేఁడని పలుకుచుందురు. స్వభావముచేతనే గుణములు గుణములందు వర్తించును. జలమునకు శీతలమెట్లు స్వభావమో రజోవీర్య సంయోగముచే సంతానోత్పత్తి యును స్వభావమే యగుచున్నది. ప్రకృతి నియమములచేతనే యీప్రపంచము నడుచుచున్నది. ప్రకృతి జడమైనచో దానియందు సంయమిత మొనర్చు శక్తి యుండదు. ఏ జడయంత్రమైనను జైతన్య నియంత్రణము లేక చిరకాలము నియమానుసారముగ నిలువఁజాలదు. ప్రపంచమేదో ఒక నియమమునకుఁగట్టుబడి యథా

వత్తుగ నడుచుచుండుట మనము గాంచుచున్నాము ఋతువులు క్రమముగా వచ్చుచున్నవి. కాలాను సారముగ ఫలపుష్పాదులు లభించుచున్నవి. సూర్య చంద్ర, గ్రహ, నక్షత్రాదు లొక నియమమున నడుచుచున్నవి. ఈ కారణము లన్నిటిచేఁ బ్రకృతికిఁ బరుఁడైన పురుషోత్తముఁడున్నాఁడని ఋజువగుచున్నది. పగలు తరువాత రాత్రియు, నెండాకాలము తరువాత వర్షకాలమును, వర్షకాలము తరువాతఁ జలికాలమును వచ్చినట్లు. ఒక మన్వంతరము తరువాత రెండవ మన్వంతరమును, రెండవదాని తరువాత మూఁడవదియును నిట్లు కల్పమునకు బదునాల్గు మన్వంతరములు గడుచుచుండును. వానిలో నదే విధముగ మనువులును, మను పుత్రులును, ఇంద్రుడు దేవతలును, సప్తర్షులును, అవతారములును వచ్చుచుండును. తరువాత రావలసిన మనువు, దేవతలు, సప్తర్షులు, మొదలగువారు స్వర్గలోకమునకును, మహర్లోకమునకునుబోయి అధికారహీనులై ఆనందము ననుభవించుచుందురు. రెండవ కల్పమందు మరల నెన్నిక జరిగినప్పుడు మను వింద్రుఁడు కావచ్చును. ఇంద్రుఁడు మనువు కావచ్చును. కొందఱు సప్తర్షులయ్యెదరు. ఇట్లు పదవులు మారుచుండును. బ్రహ్మ పదవి వఱకు శాశ్వతమైనవే, క్షయిష్ణువులే. ఒక విష్ణుపదము మాత్ర మక్షయమైనది.

శుకదేవుఁడు పరీక్షిత్తుతో నిట్లనెను :- "రాజా! నీకు నేను రెండు మన్వంతరావతారములను గుఱించి చెప్పితిని. ఇప్పుఁడిక మూఁడవ మన్వంతర వర్ణనమును వినుము."

ఇదివఱకు స్వాయంభువమను వంశవర్ణనమును జెప్పితిని. స్వాయంభువమనువు కుమారులు ప్రియవ్రత, ఉత్తానపాదులు. ప్రియవ్రతుని పుత్రుఁ డుత్తముఁడు ఆతఁడు తన పుణ్యప్రభావముచే తృతీయ మన్వంతరమునకు మనువయ్యెను. ఆ మన్వంతరమంత యును నాతఁడు మనువై పాలించెను. ఆతనికి పవన, సృంజయ, యజ్ఞహోత్రాదులను బుత్రులు కలిగిరి. వారీపృథివి కధిపతులై దీనినిఁ బాలించుచుండిరి. వసిష్ఠునకుఁ బ్రమదాదు లేడ్గురు పుత్రు లుండిరి. వారేడ్గురును నా మన్వంతరమందు సప్తర్షులైరి. సత్య, దేవశ్రుత, భద్రులనువారు దేవతాగణములయిరి. ఆ మన్వంతరమున కింద్రుఁడు సత్యజిత్ అనువాఁడు, ఆ మన్వంతరమున భగ వానుఁడు "సత్యసేనుఁ" డనుపేర నవతరించెను. ధర్మదేవుని భార్య లలో సూనృత గర్భమునుండి భగవానుఁడుద్భవించెను.

ఆ సమయమున దుష్టులగు యక్షరాక్షసు లింద్రు ననేకవిధ ముల బాధలుపెట్టిరి. ఏవిధముగనైన నింద్రుని స్వర్గసింహాసనము నుండి దించి తామధిపతులైపాలింప వలయునని ప్రయత్నించు చుండిరి. అసత్యస్వభావులును, దుశ్శీలురును, దుష్టులు నగువారి యభిప్రాయమును గ్రహించి దేవేంద్రుఁడు సత్యసేనుని శరణువేఁడి ఆతని సహాయమును గోరెను ఈమన్వంతరమున భగవదవతార మీ ప్రయోజనముకొఱకే వచ్చినది. అందువలన భగవానుఁ డింద్రుని ప్రార్థన నంగీకరించి, దుష్టస్వభావులగు యక్ష, రాక్షస, అసుర, భూతాదులను నాశము కావించెను. ఏలయనఁగా వీరు ప్రాణు

లందఱకును ద్రోహమొనర్చుచుండిరి. యజ్ఞాదులకు విఘ్నములు కలిగించుచుండిరి. అట్టివారినిఁ జంపుటచే నింద్రునకు మిక్కిలి ఆనందము కలిగెను.

ఆతఁడు భగవాను నిట్లు ప్రార్థించెను :- "ప్రభూ! మీరు నన్ను మిత్రభావముతో స్వీకరించుఁడు. ఇదేవిధముగ నన్ను అసత్యపరాయణులగు నసురులనుండి రక్షింపుఁడు."

భగవాఁనుడు 'తథాస్తు'ని యింద్రుని ప్రార్థనను మన్నించెను. అప్పటి నుండియే యాతఁ డింద్రు సఖుఁడనిపించుకొనెను. భగవానునితో సఖ్యసంబంధమును స్థాపించుకొనుటచే నింద్రుఁడు నిర్భయుఁడై, ఆమన్వంతర మంతయును స్వర్గమును భగవంతుని సహాయముతోఁ జేయుచుండెను.

ప్రియవ్రతుని ద్వితీయ పుత్రుఁడును, నుత్తమునకు దమ్ముఁడును నగు దామసుఁడు నాల్గవ మన్వంతరమునకు మనువయ్యెను. ఆతనికి సృథు, ఖ్యాతి, నర, కేతువను వారలు పదుగురు పుత్రులుండిరి. వారు పృథివియందు భిన్న భిన్న స్థానము లేర్పరుచుకొని, రాజధానులను నిర్మించుకొని పాలించిరి. వారు రాజ వంశములను వృద్ధిగావించిరి. ఆ మన్వంతరమున సత్యక, హరి, వీరులను దేవతా గణములుండిరి. ఇంద్రునిపేరు త్రిశిఖుఁడు. జ్యోతిర్ధామాదులు సప్తర్షులు, ఆ తామసమన్వంతరమున విధృతుని పుత్రులగు వైధృతులు దేవగణమైరి. వీరు విశేషదేవగణము. వీరుకాలక్రమమున నశించిరి, వీరేసప్తర్షులను రక్షించిరి. ఆ సమయమున సప్త

ర్షులు కొంచెము తేజోహీనులుగా నున్నట్లున్నది. అప్పుడు విశేష దేవగణమవతరించి తమతేజములను రక్షించుకొనిరి. ఆ మన్వంతరమున భగవానుడు 'హరి' యవతారము నెత్తెను. హరిమేధుడను ఋషికి హరిణియను భార్యయందు హరియవతరించెను.

రాజిట్లడిగెను :- "ప్రభూ ! "హరి" భగవానుఁ డేమి విశేష కార్య మొనరించినాఁడు."

అంత శుకదేవుఁ డిట్లనెను :- "రాజా ! ఈహరియే మకరచే జిక్కిన గజము నుద్ధరించినాడు."

ఇదివిని అత్యంతోల్లాసముతోఁ బరీక్షిన్మహారాజిట్లనెను :- "ప్రభూ ! గజ గ్రాహోద్ధార కథ ప్రపంచమున సర్వత్ర ప్రసిద్ధియై యున్నది. ఇదియత్యంత పరమ పావన చరిత్రము. భగవానుని భక్తవత్సలతకిది సర్వశ్రేష్ఠమగు నుదాహరణము. తన యాశ్రితులను రక్షించుటకు భగవంతుఁడెట్లు పరువిడి వచ్చునో దానిని గూర్చిన యుజ్జ్వ లోదాహరణ మీకథయందు లభింపగలదు. ప్రభూ! నేనీ పుణ్యాఖ్యానమును విస్తారముగ వినఁదలచుచున్నాను. గజమును గ్రాహమెట్లు పట్టుకొనినది ? భగవానుఁడెట్లు పోయి దాని నుద్ధరించినాఁడు. ఈపరమ పవిత్రమంగళ ప్రదమగు శుభచరిత్రమును మీరు దయయుంచి నాకు జెప్పవలయును. పవిత్రమగు కీర్తన కలిగిన శ్రీహరి నామ గుణకీర్తనము లేకథల యందు వచ్చునో ఆప్రసంగములు శ్రేష్ఠములు. ఆప్రసంగములే ప్రశంస

నీయములైనవి. ఆదరణీయములు. స్వామీ! నేను శిష్యుఁడను, ఈపరమపావన పుణ్యప్రదమగు ప్రసంగమును ప్రేమపూర్వకముగఁ బ్రణతుఁడనైన నాకుఁజెప్పుఁడు."

సూతుఁడు శౌనకాది మహామునులతో నిట్లనెను:- "ఋషులారా! పరీక్షిన్మహారాజింత దీనతతో నత్యంతో త్సాహముతో గజగ్రాహోద్ధారమును గూర్చి ప్రశ్నింపఁగా వ్యాసనందనుఁ డాతనిఁ బ్రశంసించి, భగవత్కథలందిట్టి ఉత్కాటానురాగముండ వలయునని మాటి మాటికనుచు రాజుతో నిట్లనెను:-"రాజా! నేనునీకు గజగ్రాహోద్ధార కమనీయ కథను జెప్పెదను. దానిని నీవు శ్రద్ధాసహితముగ ఋషులతోఁ గూడి శ్రవణ మొనర్పుము."

......

## గ జ ము - గ్రా హ ము

శ్లో॥ ఆసీద్గిరివరో రాజం త్రికూట ఇతి విశ్రుతః।
క్షీరోదే నావృతః శ్రీమాన్యోకనాయుత ముచ్ఛ్రితః॥

-శ్రీ భాగ. ౮ స్కం. ౨ అ. ౧ శ్లో.

సీ॥ రాజేంద్ర విను సుధారాశిలో నొక పర్వ
తము త్రికూటం బనఁ దనరుచుండు
యోజనాయుతమగు నున్నతత్వంబును
నంతియ వెడలుపు దనతిశయిల్లు

-శ్రీమదాంధ్ర భాగవతము

ఈ పృథివీ మండల మనియమితముగా స్వతః యేర్పడిన దనరాదు. దీని నిర్మాణము మిక్కిలి జాగ్రత్తగా గొలిచి తూచి యేర్పఱుపఁబడినది. ఆర్యశాస్త్రములలో వర్ణన మిట్లున్నది - ఈ పృథివిని నేఁడు ద్వీపములు కలవనియును, వానినిఁ జుట్టుకొని యేడు సముద్రములు కలవనియును, వికసించిన కమలమువలె నీ జంబూద్వీప మున్నదనియుఁ గలదు. జంబూద్వీపమందు నవ ఖండములుకలవు. కమల మధ్యమునఁ గర్ణికవలె నున్న భాగమున నిలావృత వర్షమున్నది. దానిలో దివ్యసుమేరు పర్వతముఁకలదు. కమలమునకు నలువైపులను దళములుండునట్లు మిగిలిన నెనిమిది వర్షములు కమల దళములవలె నున్నవి. దీనికి నలువైపులను నుప్పునీటి సముద్రము కలదు. సముద్రమున కావల నలువైపులను ప్లక్ష ద్వీపము కలదు. కోటకు నలువైపుల నగడ్త యుండునట్లు ప్లక్ష ద్వీపమున కొక ప్రక్కను క్షార సముద్రమున్నది. రెండవ వైపున నిక్షు సముద్రమున్నది. ఒక సముద్రమును దరువాత నొక ద్వీపమును. నిట్లు సప్తద్వీపములు సప్తసముద్రములచేఁ జుట్టుకొనఁ బడియున్నవి. క్షారసముద్రము, ఇక్షు సముద్రము, సురా సము

ద్రము, ఘృత సముద్రము, క్షీర సముద్రము, దధి మండోద సముద్రము, శుద్ధోదక సముద్రము-ఇట్లేడు సముద్రములు కలవు. క్షారసముద్రము తప్ప మిగిలిన నాఱు సముద్రములును నీ చర్మ చక్షువునకుఁ గనఁబడవు. అవి దివ్యములు, వానియందును నిట్లే జీవజంతువులు, లతా గుల్మ, వృక్ష, గ్రామ, నగర, వన, పర్వత, నదీ నదాదులన్నియునుగలవు. వీని పర్వతముల మీఁద సుందర దేవోద్యానములు కలవు. వానిలో దేవతలప్సరసలతోవచ్చి విహార మొనర్చుచుందురు.

సూతుఁడిట్లనెను :- "నిరాహారవ్రతమును బూని, మిక్కిలి సావధానముగ శ్రీశుకముఖ నిసృత ధామృతపాన మొనర్చి తృప్తుఁడైన బరీక్షిన్మహారాజు వ్యాసనందనుని గజేంద్రమోక్షణ కథను జెప్పుఁడని ప్రశ్నించెను. అప్పుడు శుకుఁడు గద్గద కంఠముతో నిట్లనెను:-రాజా! నీవు ధన్యుఁడవు. జలములను త్యజించినను గథా శ్రవణమందు నూతనోత్సాహమును జూపించుచున్నావు. ముందుగా నేను నీకు గజ, గ్రాహముల నివాసస్థానములను గూర్చి చెప్పెదను. దీనిని నీవేకాగ్రచిత్తుఁడవై సమస్తమునులతోఁ గూడి శ్రవణ మొనర్చుము.

ఉత్తరానందవర్ధనా! రాజా! క్షీర సాగరముచేఁ జుట్టుకొనఁబడి అత్యంత రమణీయమగు నొక త్రికూట పర్వతముకలదు. అది సాధారణ పర్వతముకాదు. సుమేరువువలెనే అది ప్రసిద్ధమును, విస్తీర్ణమునగు పర్వతము. అది పదివేల యోజనములెత్తు గలిగి,

అంతే విస్తీర్ణము గలిగియుండెను. రాజా! అది భూస్వర్గమునకు మకుటమణియైన గిరివరము. దానిక్రింద పుణ్యశేషముగల స్వర్గీయ పురుషులు నివసించుచుందురు. వారెన్నటికిని వృద్ధులుకారు. వెంట్రుకలు తెల్లబడవు. అచ్చట పాలసముద్రముండనే యున్నది. కోరికల ననుసరించి సమస్తవస్తువుల నొసంగు నసంఖ్యాకములగు దివ్య ద్రుమములు కలవు. అచ్చట నుండువారలకు శోకము, రోగము లుండవు. ఆపర్వతముమీఁద దేవ, యక్షకిన్నర, గహ్యాకాప్సర సలును స్వచ్ఛందముగ విహరించుచుందురు ఆపర్వతమునకు మూఁడు శృంగములు కలవు ఒకటి సువర్ణశృంగము, రెండవది రజతశృంగము మూఁడవది లోహాశృంగము. అందువలన అది త్రికూట మని పిలువఁబడు చుండును. ఈ మూడు కూట (శృంగ) ములు దానికి ప్రధాన శృంగములు. ఇవిగాక ఆవిశాల పర్వత మునకు ననంఖ్యాకములగు శృంగములుకలవు. వానియందు నానా విధములగు ధాతువుల గనులుకలవు ఒక్కొక్కచోట భూమి రక్త వర్ణముగనుండును. ఒక్కొక్కచోటఁ బాషాణములు కృష్ణవర్ణముగ నుండును. కొన్నిచోట్ల తెల్లగనుండును. కొన్నిచోట్ల వివిధమణుల గనులుకలవు. అవి సూర్యకిరణ సంయోగముచే దిశలను బ్రకాశిత మొనర్చు చుండెను. అచ్చటి వృక్షములత్యంత మనోహరములగను, సదాఫలపుష్ప భరితములై వంగియుండును అచ్చటచ్చటఁ ద్రికూట పర్వత మందలి కొండకోనలు స్వచ్ఛజలములతోఁ బ్రవహించు చుండెను. వృక్షములమీఁదఁ గూర్చుండిన పక్షిగణము కలవర మొనర్చుచుండెను. ఆ విశాల పర్వతమునకు నలువైపులను క్షీర

సాగరముకలదు. అది క్షీరసాగరమునఁ గమల మున్నట్లుండెను. క్షీరసాగర దుగ్ధమయీ తరళ తరంగములచేఁ బ్రక్షాళితమగు చుండిన నాపర్వత పాదప్రాంతము హరిత వర్ణముతో నుండిన శిలలచేఁ బృథివి కొంచెము శ్యామవర్ణముగ నున్నట్లుండెను.

ఆ గిరిరాజము యొక్క శోభ సజీవసాకార స్వరూపమును ధరించియుండెను. అచ్చటచ్చటఁ గమనీయ కందరములు కలవు. అవి సర్వఋతువులందును సుఖము నొసఁగుచుండును. అచ్చట నప్సరసలు తమప్రియతములతో నేకాంతిక క్రీడలొనర్చుచుందురు. కొన్ని కందరములలో సింహవ్యాఘ్రాది వనజంతువులు సుఖముగ నివాసము చేయుచుండెను వాని యరపులచేతను, గజముల ఘీంకారము చేతను నవినిరంతరము కీర్తనము చేయుచుండెను. ఒక సింహము ఘీంకరించెనా దాని ప్రతిధ్వని కందరములనుండి బయలు వెడలును. మొదట గర్జించిన సింహము తనకు బ్రతిద్వంది తన్నుఁ గవ్వించుచున్న దనుకొని యీర్ష్యావశమునను, నసహిష్ణుత చేతను నింకను నధికముగ గర్జించుచుండును. దాని గర్జనతర్జనలను విని సింహమింకను గర్జించుచుండును. ఏనుఁగులీ గర్జనమును వినఁగానే అవియును ఘీంకారము లొనర్చుచుఁ బరు విడుచుండెను. ఈవిధముగ నచ్చట నిరంతర కోలాహలము జరుగుచుండెను.

సుందర, విస్తృత కందరములు, వానిలో నివసించునాటవిక మృగముల సమూహమును, దేవద్రుమ సంకులమగు దేవోద్యాన ములును, వానిలో వివిధ క్రీడలొసగు [illegible]

మీఁదఁ గూర్చుండిన విహంగముల సుమధుర కమనీయ కలవర ములును, సుందరస్వచ్ఛ సలిలముచే నిండిన సరోవర సమూహ మును, తరంగావర్తములచే నెగురుచుఁగుటిలగామినులగు సరిత్తులును నివియన్నియును నచ్చటి శోభను సహస్రగుణములఁ బెంచుచుండెను. అచ్చటనున్న సుఖస్పర్శను గలిగించు స్వచ్ఛ జలమునకు వచ్చి నిర్భయులై దేవాంగనలు స్నానము చేయు చుందురు. వారి కుచకుంకుమచేఁ బీతముగను సుగంధముగనునైన జలమును మృగములును, మృగవధూటులును నత్యంతోల్లాస ముతోఁ బానమొనర్చు చుండును.

ఆ త్రికూట పర్వతము మీఁద వృక్షములు ఫల భరితములై యుండెను. అటునిటు ననేకజాతి వృక్షములు తమశోభ నిడుమ డించుచుండెను. పర్వతముపైనఁ బశ్చిమ దిశయందు లోకపాలుఁ డును జలస్వామియు నగు వరుణునకు ఋతుమంతమను క్రీడా కాననము కలదు. అచ్చటి శోభ అవర్ణ నీయము, దేవాంగనల గతి చేతను, విలాసాట్టహాసముల చేతను నది నిరంతరము నవ్వు చున్నట్లుండెను. అచ్చటి పక్షులు తమ కలకూజిత కంఠములతోఁ గ్రీడాకామినుల కామక్రీడలను సమర్థించుచున్నట్లుండెను. అచ్చటి ద్రుమములు శాఖలను హస్తముల నూపుచుఁ గ్రీముసక్తులను దమ సమీపమునకు బిలుచుచున్నట్లుండెను. ఆ వృక్షములు సదా దివ్య దివ్య ఫలపుష్పములచే సుశోభితములై యుండెను. ఆకాననమున నసంఖ్యాకములగు వృక్షములుండెను. సాల, తాళ, తమాల, హిం తాళ, మందార, పారిజాత, పాటల, పనస, ఖర్జూర, జాము, ఆమ్ర,

ఉదుంబర, అర్జున, అరిష్ట, రావి, జువ్వి, మ్మ్రి, పిచుమంద, నారింజ, బదరీ, కించుక, కోవిదార, కదళీ, కర్పూర, కపిత్థ, జంబీర, చందన, బిల్వ, సరళ, పున్నాగ, దేవదారు, జంబు, ద్రాక్ష, ఆమ్ల, పోక, దానిమ్మ, అశోక, నిమ్మ, నారికేళాద్యనేక వృక్షములు దేవోద్యానములను శోభాయమానమొనర్చు చుండెను. అచ్చట కమలము లసంఖ్యాకములు, గిరి శృంగము లెల్లప్పుడును సదా హిమావృతములై యుండును. అచ్చటి మెట్ట దామరలు తమ యుత్కట గంధముచే నాద్రుమరహిత స్థానమును శోభాయుక్తముగ నొనర్చుచుండెను. సరోవరము లందును, తటాకములందును, జలకమలములు వికసించి యుండెను. కొన్ని యెఱ్ఱగను, కొన్ని తెల్లగను, కొన్ని నీలముగను, కొన్ని అష్టపత్రములుగను, కొన్ని షోడశ పత్రములు గలవిగను, గొన్ని శత పత్రములుగను, కొన్ని సహస్రదళములు గలవిగ నుండెను. కుముదోత్పల కల్హారాది వివిధ కమల జాతులుండెను. ఆ సరోవర స్వచ్ఛ జలములలో వివిధ వర్ణములుగల మత్స్యములటునిటుఁ దిరుగుచుండెను. అవి అటు నిటుఁ దిరుగుటచేఁ గమలములు కదలి కాముకుఁడు కామినినిఁ గాంచిన నాతని చిత్తమెట్లు చంచలమగునో అట్లు చంచలముగ నున్నట్లుండెను. ఆ సరోవరములందు హంస, కారండవ, చక్రవాక, సారస, జలకుక్కుట, బకుల, నీటి కోయిల మొదలగు జలవిహంగము లటునిటుఁ దిరుగు చుండెను.

అచ్చట సరోవరములు, కొండవాగులు, నదీ, నదములు, తటాకములనేకములు కలవు. కాని వాని అన్నిటితో గొప్ప సరో

వరమొకటి యుండెను. దాని తీరమునఁ గదంబములు, వేము పొదలు, వేఁప, పగడపు తీఁగలు మొదలగు సుగంధ పుష్పములు కలవు వాని పరాగము నీటిలోఁ గలిసినప్పుడు కమల సుగంధ ముతోఁ దన్మయమై, ఆ జలము అమృతమునకు మించి స్వాదిష్ట ముగను, సుందరముగను, సుగంధముగను నుండెను. ఆ సరోవర సమీపముననే లతా కుంజములు కలవు. జాజి, మల్లె, మాధవి, మొదలగు లతలు చెట్లకుఁ బెనవైచుకొని యుండెను. ఇవిగాక నాగ, పున్నాగ, కుంద, కురువక, సువర్ణ, యూధికా, పీతమల్లి కాది వివిధ రంగులుగల పాటలాది పుష్పములచే నాభూమి పుష్పావృత మై యుండెను. ఇంకెంతని చెప్పఁగలను ? సరోవరము సమస్త ఋతువులందును సుఖకరముగను, నచ్చటి సరోవరము లన్నిటిలో సర్వశ్రేష్ఠముగను నుండెను. దానిలో నొక బలమైన మొసలి నివసించుచుండెను. అదేదో పుణ్యక్షీణ శాపముచే శాపిత సిద్ధుఁడు. ఆతని శరీరము యోజనముల కొలఁది పొడుగైనది. అంత పెద్ద శరీరముతో నాసరోవర మంతయును వ్యాపించి దానిలో నివసించు చుండెను. అది సరోవరమునకు సామ్రాట్టా యనునట్టుండెను.

ఆ వనమందొక యూథపతి గజరాజుకూడ నివసించు చుండెను. అది గజముకాదు నడచుచున్న అంజన పర్వతమా యను నట్లుండెను. సింహము దానినిఁగాంచి పాఱి పోవును. వ్యాఘ్రము దాని సమీపమునకు రానేరాదు. తోడేలు దానినిఁగాంచి తప్పుకొని పోవును. ఏనుగులును దానిరాకనుగాంచి తప్పుకొనును. అది యూ

వనములో నుండుటచేఁ దోఁడేళ్ళు, అడవిపందులు, ఎనుములు, ఎలుఁగులు, చిరుతలు, కోఁతులు, కొండముచ్చులు, హరిణములు, శశకములు, అడవికుక్కలు, ఇతర క్షుద్రజీవులు నిర్భయులై అటు నిటుఁ దిరుగుచుండెను. ఆ సరోవరమునకు గ్రాహరాజు మెట్లు సామ్రాట్టో, అవనమున కంతయును గజరాజు సామ్రాట్టుగ నుండెను. దాని కనేకములగు నాడుయేనుఁగులు కలవు. వేలకొలది పిల్లలు కలవు. వాటితోఁగలసి ఆనందముతోఁ దన రోజులను గడుపుకొను చుండెను. దాని కందఱును భయపడు చుండెను. దాని ప్రతిద్వంది ఆ వనములోలేదు. దానిభయముచే సింహ మాఁకలికి చావవలసినదే. ఏ చిన్న జంతువును బట్టుకొనుటకు దానికి సాహసములేదు. అది గర్వముతో విఱ్ఱవీగుచుండెను తన నెవ్వరును నెదుర్కొనఁజాలరని దానికి గర్వము.

శ్రీ శుకదేవుఁ డిట్లనెను :- "రాజా ! మదహారియగు హరి అందఱి మదముల నణచును. ఆతని కాహారము మదమే. తన భక్తునకు మదము కలిగెనా వాని నణఁచక వదలఁడు, ఈగజ గ్రాహములకు రెంటికిని దమ భౌతికబలముమీఁద నతిశయమగు మదము కలదు. ఈ రెండును బ్రపంచములోఁ దా మజేయుల మనుకొనుచుందురు. వీరు పూర్వజన్మమున హరిభక్తులు, అందువలన వారి మదము నణఁచి వారి నుద్ధరించెను."

అంతఁ బరీక్షిన్మహా రాజిట్లడిగెను :- "ప్రభూ ! భగవానుఁడు వీరినెట్లుద్ధరించెను. తత్ప్రసంగమును నాకు జెప్పవలయును."

ఇదివిని యానందమును బ్రకటించుటకు శుకుఁడిట్లనెను :-
"రాజా ! ఇప్పుడు దానినే చెప్పెదను. రాఁబోవు కథను బ్రేమతో వినుము."

......

## మకరము కరి పాదమును బట్టుకొనుట

శ్లో॥ తం తత్ర కశ్చిన్నృప దైవచోదితో
గ్రాహో బలీ యాంశ్చరణే రుషాగ్రహీత్ ।
యదృచ్ఛయైవం వ్యసనం గతో గజో
యథాబల సోఽతబలో విచక్రమే ॥

—శ్రీ భాగ. ౮ స్కం. ౨ అ. ౨౭ శ్లో ॥ ౩

క॥ పడిఁదప్పించి కరీంద్రుఁడు,
నిడుదకరం బెత్తివ్రేయ నీరాటంబుం
బొడవడఁగినట్లు జలములంబడి
కడువడిఁబట్టెఁబూర్వ పదయుగళంబున్ ॥

చ॥ పదములఁబట్టినందలఁకుఁబాటొకయింతయు లేక ఘోరతన్
మదగజ వల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంతఘట్టనం
జెదరఁగఁ జిమ్మె నమ్మకరి చిప్పలు పాదులు దప్పనొప్పఁ బన్
వదల జలగ్రహంబు కరివాలము మూలముఁజీరెఁగోరులన్॥

శ్రీ మదాంధ్రభాగవతము.

జీవి చీఁకటిలోఁ గొట్టుకొనును, అజ్ఞాన సాగరములో మునిఁగి తాను బయటఁబడుట కాలోచించును, అప్పుడు చేతులు చలించును. అతఁడదృష్ట వంతుఁ డగుచో నే భక్తుని పాదములైనను దొరకును. భక్త చరణములు తన ప్రయత్నమున లభింపవు. హరికృపయున్నచో నింటిలో నుండినసే సాధువు వాని నను గ్రహించుటకుఁదనకు దానే వచ్చును, ఇంటికి వచ్చినను నాతఁడు నీటినిఁద్రావి వెడలి పోవును. ఏ దినమున జీవి హరిభక్తుని చరణ ములను దృఢముగఁబట్టు కొనినాఁడో, చేతనైనంత వఱకు వానిని వదలఁడో అట్టివాఁడు సంసార సాగరము నుండి బయటఁబడిన వాఁడే యగుచున్నాఁడు. భగవంతుఁడు వానికి దర్శన మొసఁగి, వానిని దేహబంధ విముక్తునిఁగావించి తన ధామమునకుఁ గొని పోవును.

శ్రీ శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా! యూథపతి యగు నా గజేంద్రుఁడు తన వందల కొలఁది కరిణుల తోడను, వేలకొలది తన పుత్ర పౌత్రుల తోడను సాగరమువలె నున్న నా విశాల సరోవరమునకు జలపాన మొసరించుటకును,

గ్రీడ యొనర్చుటకును బోయెను. ఏనుఁగులుష్ణమునుసహింపఁజాలవు. గ్రీష్మ ఋతువునందుదానికి నీటిలో సుఖముకలుగును. యూథపతికి భయమను నది తెలియదు. సింహ వ్యాఘ్రములు దానినిఁజూచి పాఱిపోవును. ఖడ్గమృగము దాని నీడనుజూచిన భయపడును. దాని యొక్క ప్రబల ప్రభావముచేఁజిన్న చిన్న యేనుఁగులు, మృగములు, శశములు, తోడేళ్ళు, ఎనుములు, శూకరములు, జంబుకములు, చమరీ మృగములు, భల్లూకములు, శ్వానములు, మర్కటములు, పశుపక్ష్యాదులు, ఇతర జీవ జంతువులు నిర్భయులై అటు నిటుఁదిరుగుచుండెను.

ఆ యూథపతి మదోన్మత్తయై దారినిఁబోవు చుండెను. పోవుచుండ నడ్డమువచ్చిన పెద్ద పెద్ద వృక్షశాఖలను దొండములతో విఱిచి పాఱవేయుచుండెను. లతలను మదతబెట్టు చుండెను. చెట్లను రాచుకొనుచు, వెదురు పొదలను ద్రొక్కుచు నది పోవుచుండెను. కమల గంధముచే దాని యుత్సాహ మినుమడించెను. దాని గండస్థలమందు మదము స్రవించుచు, దాని కపోలములను దడుపుచు భూమిమీఁదఁబడుచుండును. అ గంధముచేఁ గరిణులింకను నున్మత్తములయ్యెను. అది తన కరిణులు, పుత్ర, పౌత్రీ, పౌహిత్రాదులచేఁ బరివేష్టింపఁబడి వందలకొలది శృంగములతో నుండిన పర్వతములు తిరుగుచున్నట్లుండెను. పిల్లలు తమ చంచలత్వము వలన నటునిటు ముందుగాఁ బరువిడుచుండెను. కరిణులు దాని

వెనుకనే వచ్చుచుండెను. అది అందఱను వెంటఁబెట్టుకొని ద్రుత గతితో సరోవరము వైపునకుఁ బోవుచుండెను. ఆఁకలి దప్పికలచే నాతని ముఖము క్లాంతముగ నుండెను.

అల్పకాలమునకే అది సరోవర సమీపమునకుఁ జేరుకొనెను. స్వచ్ఛముగను, నిర్మలముగను అద్దమువలె మెరయుచున్న నా శీతల సుగంధిత, పద్మకేసర సువాసిత జలములందుఁ బ్రవేశించి నది యథేష్టముగ స్నానమొనర్చెను. కడుపునిండ నీరుఁ ద్రాగెను. దానికి తృప్తియైనతరువాత క్రీడింపవలయుననుకొనెను. ఒక్కొక్కటి పిల్ల యేనుఁగులను దొండములతో నీటిలో విసరివేయుచుండెను. కొన్నిటి మీఁదఁ దొండములతో నీరును జిమ్ముచుండెను. గజేంద్రుఁడు తన తొండములతో నీటినిఁ దీసికొని కరిణుల నన్నిటిని గడుగుచుండెను. తొండముతో నీరును లాగుకొని ఇంకొకదాని నోటిలోఁ బోయు చుండెను తొండముతో నీరులాగుకొని వేఱొకదాని కన్నులలోఁ గొట్టును, కరిణులన్నియును దానికిచుట్టును జేరి తొండములతో జలములను గైకొని స్నానము చేయించును. తన తొండమున నీరు దీసికొని యింకొక దానిపైఁ గ్రుమ్మరించును. తన విచిత్ర క్రీడలచే నందఱను నవ్వించుచుండెను. అన్నియును నవ్వుచుండెను. ఆడుచుండెను. ఆనంద సాగరమున నోలలాడుచుండెను. అన్ని యును ప్రేమచేఁ దమ్ముఁ దాము మఱచిరి. అన్నియును నాత్మ స్మృతినిఁజెంది జలక్రీడలోని యానందమును జూఱఁగొనుచుండెను నవ్వులకుఁబరిణామ మేర్పడునని దానికిఁ దెలియ కుండెను. సుఖ పర్యవసానము దుఃఖమే, ఉత్థానము నకుఁతము పతనము. అనేక

మంది పౌత్రులుగల గృహస్థు భగవన్మాయా మోహితుఁడై వారి కొఱకై చిలిపిపనులు చేయుచు, సర్వదా చింతామగ్నుఁడై యున్నట్లు యూథ పతియగు నేనుఁగు క్షణములో వచ్చు కష్టమును దెలిసి కొనఁజాలక పోయెను. ఆతఁడు కరిణులతో నవ్వుట యందును, వానిపై జలమును జిలుకుటయందును, పిల్లలను నవ్వించుటయందును, దినిపించుట యందును, సంతోష పెట్టుట యందును మగ్నమై యుండెను.

సంయోగ వశమున నా మహాసరోవర మందుండు నొక ద్వీపమును బోలిన విశాల శరీరముగల మొసలివచ్చి కొండవలె నున్న నా యేనుఁగు కాలినఁబట్టుకొనెను. తన్నెవరు పట్టుకొనఁ గలరనియుఁ దన్నెదుర్కొనఁగల వా రెవరనియు నేనుఁగునకు మిక్కిలి గర్వము. స్థలమందు దానికి గర్వముండుట సంభవమే. కాని జలములో దాని గర్వ మణఁగిపోయెను. గజమునుండి తప్పించుకొనుటకు చేతనైన నుపాయము లొనరించెను. దానికి తన బలము, పరివారము; ప్రేమ, ప్రభావము, పురుషార్థము, ప్రతిభాది గుణములమీఁద నెంతో విశ్వాసము ఒక్కొక్కటిగ నేఁటి కన్నిటి పరీక్ష జరిగెను. మొట్ట మొదట నది గ్రాహమును లక్ష్యపెట్టక తన శక్తి నంతను నుపయోగించెను, కాని గ్రాహము అలవికాలేదు. ఏనుఁగు దానినుండి విడిపించు కొనఁజాలక పోయెను. సమీపమున నిలుచుండిన కరిణులును; నేనుఁగు గున్నలును ఘీంకరించుచుండెను. ఏడుచుచుండెను. తన్నుకొనుచుండెను. తమ యూథపతికొఱకు కన్నుల నీరు గార్చుచుండెను; కాని యవి యేడ్చుట వ్యర్థమగు

చుండెను అప్పుడు గజరాజు సాహసము వహించి తన భాషలో నందఱను గనపడు నిట్లనెను :- "ఏడ్చిన నేమి లాభము. ఏదో ప్రయత్నము చేయవలయును. ఒక్కపని చేయుఁడు. ఇచ్చట జలముఁలో నిలుచుండి నేను నాబలము నంతను జూపలేకపోవుచున్నాను. పిల్లల నొక ప్రక్కకుఁ దొలఁగ జేయుఁడు. ఒక యువకుఁడు నా తొండమునకుఁ దొండమును జెలిపెట్టి దానితోఁక నింకొకరు తొండముతో బట్టుకొని, దానితోఁక నింకొక గజము పట్టుకొని యిట్లు గొలుసువలెనుండి, అందఱు నొక్కసారిగా లాగవలయును. నేనును లాగెదను. ఈవిధముగ మన మందఱమును సమ్మిళితశక్తితో బయటకుఁబోయెదము. బయటకుఁజేరిన తరువాత దానినిఁ జంపివేయుదము."

ఇతర నేనుఁగులన్నియును నట్లే యొనర్చెను. అందఱును గలిసి గ్రాహమును లాగఁజూచిరి. కాని యాశ్చర్యపడవలసిన విషయమేమనఁగా నది బయటకు వచ్చుట యట్లుంచి, గ్రాహ మన్నిటిని గంభీర జలములోనికి లాగుకొనిపోయెను. దానితోఁబాటు తాము గూడ నీటిలోనికిఁ బోవుచున్నట్లు తెలిసికొని అవి వెంటనే ప్రాణలోభముచే విడిచిపెట్టెను. ఇప్పు డా గజేంద్రుఁడొంటరివాఁడయ్యెను. తన యూథములోని ఒక్కవ్యక్తియును దనకు సహాయపడఁ జాలక పోయెను. అది మృత్యుఘడియలను లెక్కించుకొనుచుండెను. దాని బుద్ధి కుంఠితమయ్యెను. పురుషార్థము నష్టమయ్యెను. ఉత్సాహము శిథిలమయ్యెను. కర్తవ్యాకర్తవ్య నిర్ణయ మొనర్చుకొనఁజాలక పోయెను. మకరమ్ము జలజంతువు,

ఆ॥ జీవనంబు దనకు జీవనంబై యుంట
నలవుఁ బలము నంతకంత కెక్కె
మకరమొప్పెడస్సె మత్తేభ మల్లఁబు
బహుళ పక్ష శీతభాను పగిది ॥

అది దానికి నిలయము. దానిని దినదినమును బలము పెరుగుచుండెను; కాని యిది స్థలజీవి. దానికి నీరుతప్ప వేఱాహారము లేకుండెను. పైఁగా గ్రాహము చేతిలోఁ బడినది. దీనిబలమును క్షీణమగుచుండెను. ఈవిధముగ నది యా గ్రాహముయుతో యుద్ధము చేయుచుఁ జేయుచు వేయి సంవత్సరములు గడిపెను. అనఁగాఁ జాలకాలము పట్టెను. దేవతలు, దానవులు, ఇతర జీవజంతువులును నీ విపత్తిలోఁగూడ నిట్టి సాహసముండుటనుగాంచి మిక్కిలి విస్మయమును జెందిరి.

తన బలపురుషార్థములింకఁ బనిచేయవని గజరాజునకు నిశ్చయము కాఁగానే ఆతనికిఁ బూర్వజన్మ సంస్కార కారణముచే సద్బుద్ధి యుదయించెను. ఆతఁడిట్లను కొనెను :- "నేను నాశక్తి నంతను వినియోగించితిని. నేను నా సహచరులు, పుత్రులు, పౌత్రులు వీరందఱపై విశ్వాసమును బెట్టుకొంటిని. వారును నన్ను విపత్తుననుండుటను గాంచియు బాఱిపోయిరి. నే నిప్పు డసమర్థుఁడ నైతిని. ఇంతవఱకును నేను బలవంతుఁడ ననుకొంటిని. ఇప్పుడు నిర్బలుఁడనైతిని. నిర్బలులకు రాముఁడే బలమని నేను విని యుంటిని, నేనా రాముని నేల శరణువేడఁగూడదు. నేనేల నాతని

గుణములను గానముచేయఁగూడదు. నేను నాస్తోత్రములతో నేల సంతోషింపఁజేయఁగూడదు. నే నేడ్చి యేడ్చి నే నేల సహాయమును గోరఁగూడదు ?"

పరమహంస చూడామణియగు శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా ! సద్బుద్ధి యుత్పన్నము కాఁగానే గజమున కొక నూతన స్ఫూర్తిలభించెను. ఆతని యుత్సాహమినుమడించెను. ఆతఁడు తన బల పౌరుషముల సహాయమును వీడి, జీవన్మరణాశలందు సమభావముంచి ఆతఁడు దేవాధి దేవుఁడగు భగవానుని భక్తిభావముతో స్తుతించుట కుద్యుక్తుఁడయ్యెను. సమస్తాశలను వీడి తనహరియందే తన సమస్త చిత్త వృత్తులను గేంద్రీకరించెను. ఆతఁడు గద్గద కంఠముతో గన్నుల నశ్రువులు రాల్చుచు, భవభయ హారియగు భగవంతుని స్తుతింపసాగెను.

.....

## గజరాజు యొక్క భగవత్స్తుతి

శ్లో. యః కశ్చనేశో బలినోఽంతకోరగాత్
ప్రచండ వేగాదభి ధావతో భృశమ్ ।
భీతం ప్రపన్నం పరిపాతి యద్భయాత్,
మృత్యుః ప్రధావత్యరణం తమీమహి ॥

(శ్రీభాగ ౮ స్కం. ౨ అ-౩౩ శ్లో॥

ఉ. ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁడెవ్వఁడు మూల
కారణం
బెవ్వఁడనాది మధ్యలయుఁ డెవ్వడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వానినాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

జీవుఁడు తనబలముచే రక్షించుకొన్నంతవఱకు వానికి రక్షణ జరుగదు. అన్నిటిని మఱచి రక్షణ కన్యోపాయములను జూడక అశరణ శరణుని శరణువేఁడినచో, సర్వాత్మ భావముతోఁదన భారమునంతను నాతనిపైఁ ద్రోసివైచినచో నాతఁడు నిర్భయుఁ డగును. సర్వత్ర జీవునకును మృత్యుభయ ముండును. మరణ ధర్మముకలవాఁడును, ఒకానొకదినమున వినాశమవశ్యంభావియై నప్పుడి తరులనెట్లు రక్షింపఁగలఁడు. అమృతత్వప్రాప్తి అజన్ముఁ డును, నఖిలేశుఁడునగు శ్రీహరిని శరణువేడుటయందే కలదు.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా! సర్వవిధములను నిరా శుఁడై గజరాజు తన హృదయమందు శ్రీహరిని ధ్యానించుటకు నిశ్చయించుకొని, యాతఁడు దివ్యస్తోత్రములచే శ్రీహరిని స్తుతించెను."

ఇది విని పరీక్షిన్మహారాజిట్లడిగెను :- "ప్రభూ! ఏనుగెట్లు స్తుతింపఁగలదు. అదిచదువలేదు, వ్రాయలేదు. పశువై అది శుద్ధ

సంస్కృతములో స్తోత్ర మొనర్చుట యసంభవముగఁ గనఁబడు చున్నది."

అంత శ్రీ శుకుఁడిట్లనెను :- "మహారాజా! అసంభవమనున దేదియును లేదు. భగవత్సృష్టిలో నన్నియును సంభవమే. శుక మెంతో శుద్ధమగు మానవవాక్కులతో మాటలాడఁగలదు. శుకము కంటెను గోరువంక అనేకరంగులలో నుండి మాటలాడును. నీవేమి పలికిన దానిని మరల నట్లే పలుకును. ఈయేనుఁగే జన్మమునఁ జదువకున్నను బూర్వజన్మమున నిది భగవదుపాసనము చేసి యుండెను. రాజా! శుభకర్మముల ఫలమెన్నటికిని నశింపదు. అందువలన గజమున కాసమయమున విపత్తునందు బూర్వజన్మ విద్య స్మరణమునకు వచ్చెను. పూర్వజన్మమున భగవంతుని నాతఁ డెట్లు స్తుతించెనో అట్లే భగవత్కృపచే స్తుతింపసాగెను."

అంతఁ బరీక్షిన్మహారాజిట్లడిగెను :- "స్వామీ! అది యిది వఱకేల స్మరణమునకు రాలేదు?"

ఇదివిని శ్రీశుకుఁడిట్లనెను :- "రాజా! మొదట నాతఁడు తన బల పౌరుషముల ప్రభావమదమున నున్మత్తుఁడయ్యెను. పూర్వజన్మ స్మరణము తపమువలనఁగలుగును. వేయి సంవత్సరముల వఱ కేమియును దినక జలములలో నుండుండి ఘోరతపస్సును జేసెను. పైగాఁదన సమస్త బలపురుషార్థములను బ్రభు పాదపద్మములకు సమర్పించెను. సర్వతో భావేనా ఆతఁ డాత్మ సమర్పణ మొనర్చెను. అప్పుడు పూర్వజన్మ స్మృతి కలుగవలయును. అందువలన నాతఁ

దద్భుత స్తోత్రముతో భగవంతుని స్తుతించెను. నిజమైన హృదయముతో భగవంతునిట్టి స్తోత్రముతో స్తుతించినచో వారి దుఃఖ మవశ్యము తీరిపోవును.''

ఇదివిని శౌనకుఁ డిట్లనెను:- "సూతా! ఆదివ్యస్తోత్రమును మీరు నాకు వినిపింపవలయును."

అంత సూతుఁ డిట్లనెను :- ''భాగవతములోని దివ్యస్తోత్రము లన్నిటిని నేనొక్క సారిగాఁ జెప్పఁదలఁచుచున్నాను. కావున నీవీ సమయమున నాయద్భుత స్తోత్రమును శ్రవణము చేయవలయునను లోభమును సంవరణము కావింపుఁడు. తరువాత కథను వినుఁడు. అది నిత్యమును బఠింపవలసిన స్తోత్రము."

ఇదివిని శౌనకుఁ డిట్లనెను :- "అయితే కథనే చెప్పుఁడు. కథ అమృత తుల్యముగ నున్నది."

సూతుఁ డిట్లనెను :- ''మునులారా! గజేంద్రుఁడు తన తొండము లోనికి నాళ సహితమగు నొక కమలమును దీసికొని అత్యంతార్తితో సర్వాంతర్యామియును నఖిలేశుఁడు నగు శ్రీహరిని స్తుతించెను. స్తుతికి అంతమందిట్లనెను :- "ప్రభూ! నేను జీవించుటకై యీస్తుతిని నొనర్చుచున్నానని మీరనుకొనకుఁడు. అదికాదు. స్వామీ! ఈ తమోమయమును నజ్ఞానావృతమైన నీ గజ శరీరమున నాకు సుఖమెక్కడిది! ఈ జన్మతో నాజ్ఞానము మఱుగుపడినది. ఆత్మప్రకాశ హీనుఁడనై నేను పశుజన్మలో నేమిచేయుదును.

సర్వాంతర్యామి ! నేనజ్ఞాన విముక్తుఁడనుగాఁ గోరుచున్నాను. అందు కనియే నేనీవిశ్వమునకుఁ గర్త, భర్త, సంహర్త, సర్వాంతర్యామి యగు నచ్యుతుని స్తుతించుచున్నాను. ఆతఁడు విశ్వరూపుఁడయ్యును విశ్వాతీతుఁడుగ నున్నాఁడు. ఈవిశ్వ మెవని క్రీడకై ఉపకరణ మాత్రమో అజన్ముఁడయి విశ్వాత్ముఁడో అట్టి పరాత్పర ప్రభువును నేను స్మరించుచున్నాను. ఎవనియొక్క మాయచే నావరింపఁబడి అహంకార మమకారములకు వశీభూతుఁడై జీవుఁడు తన యథార్థ స్వరూపము నెఱుఁగుకున్నాఁడో అట్టి అపరిమేయ శక్తుఁడును మహా మహిముఁడునగు మహేశ్వరుని పాదపద్మమునకు నేను పునః పునః ప్రణామము లొనరించుచున్నాను."

శ్రీశుకదేవుఁడిట్లనెను:-"రాజా ! గజేంద్రుఁ డేదో ఒక దేవుని పేర్కు పెట్టి పిలువలేదు. నిర్విశేష భావమున భగవంతుని స్తుతించెను. ఇంద్రుఁడు త్రిలోకేశుఁడని పిలువఁ బడుచున్నాఁడు. అందువలన దేవత లిట్లనిరి:- "విభూ! మీరుపోయి భయగ్రస్తమగు నాగటము నుద్ధరింపుఁడు."

ఇంద్రుఁ డిట్లనెను:-"ఆతఁడొక్క సారియైనను వృత్రహంత వజ్రధారీ, శచీపతి, నాకపతి శతక్రతు మొదలగు నానామములతో నొక్క దానినైనఁ బలుకలేదు. నేను వాని రక్షణ కెట్లు పోఁగలను"

అప్పుడే దేవతలు ప్రజాపతియగు బ్రహ్మకడకు బోయిరి. బ్రహ్మ యిట్లనెను:- "ఆతఁడు కమలాసనుఁడని గాని, చతుర్ముఖుఁ డని బ్రహ్మయనిగాని, విధాతాని గాని పిలువలేదు. అట్టియెడ నేను రక్షణ కెట్లు పోఁగలను ?"

దేవతల కొక కుతూహలము కలిగెను. వారు శివునితోఁ జెప్పిరి. శివుఁ డిట్లనెను:—"నేను మహాదేవుఁడనైనను నాతఁడే దేవునిఁ బిలుచుచున్నాడో తెలియుటలేదు. నేను పోగానే యింకొక దేవుఁడు కూడ వచ్చినచో నప్పుడు చిక్కు సంభవింపఁ గలదు. అతఁడు నిర్విశేష బ్రహ్మను స్తుతించుచున్నాఁడు."

దేవత లందఱును శ్రీహరి కడకు బోయి యాతని స్తుతించిరి. భగవానుఁడు మిక్కిలి వ్యగ్రతతో నున్నట్లు వారు కనుఁగొనిరి. ఆతఁడు వెంటనే గరుత్మంతుని స్మరించెను. గరుత్మంతుఁడు వ్యగ్రుఁడై యెగురుటకు సిద్ధముగ నుండెను. విష్ణువును, వినతానందనుఁడును నీవిధముగ వ్యగ్రతతో నుండుటను గాంచి దేవతల కేమి పలుకుటకును సాహసము కలుగలేదు. వారొక ప్రక్కన నిలుచుండి హరిణీ నందనుఁడును హరిమేధానంద వర్ధనుఁడగు ప్రభువును స్తుతింపసాగిరి. వారిస్తుతులను లక్ష్యపెట్టక. భగవానుఁ డత్యంత శీఘ్రముగ గరుడునిపైనఁ గూర్చుండి బయలుదేరెను. గరుడుఁడు వాయు వేగమును దిరస్కరించి మనోవేగమున నెగెరెను. దేవతలను వెనుక స్తుతులొనర్చుచు వందీగణముల వలెఁ దమతమ విమానముల నెక్కి ప్రభువును ననుగమించు చుండిరి.

## గజ - గ్రాహోద్ధారము

శ్లో॥ తం వీక్ష్య పీడితమజః సహసావతీర్య
సగ్రాహమాశు సరసః కృపయోజ్జహార।
గ్రాహాద్విపాటితముఖరిణా గజేంద్రమ్
సంపశ్యతాం హరిరమూ చదుచ్ఛ్రియాణామ్॥

శ్రీభాగ. ౮ స్కం. ౩ అ. ౩౩ శ్లో॥

వ॥ అజన్ముఁడగు శ్రీహరి గజేంద్రుఁడత్యంత పీడితుఁడై నట్లు తెలిసికొని వెంటనే గరుడుని నుండి దిమికెను. అత్యంతము కృశించియున్న నాకరీంద్రుని మకరితోఁగూడ వెంటనే సరోవరము నుండి బయటకులాగెను. అంత సురులందఱును జూచుచుండ శ్రీహరి తన సుదర్శన చక్రముచే నక్రముఖమును దెగఁగొట్టి గజేంద్రునుద్ధరించెను.

జీవునకు స్వపరభేదములు, తన బలముమీఁద గాని ఇతరుల మీఁదఁగాని ఆశయుండినచో భగవంతుఁడు ప్రత్యక్షముకాఁడు. మానవుఁడనన్యుఁడగుచో భగవంతుఁడు ప్రత్యక్షుఁడగును. శ్వేత ద్వీపమునకుఁ బోయినవారికి భగవద్దర్శనమగును. ఏలయనఁగా భగవానుఁ డచ్చట నిత్యము తన దివ్యరూపమున నివసించును. ఒకా సారి, ఏకత, ద్విత, త్రితయను ముగ్గురుమహర్షులు తమ తపః ప్రభావముచే శ్వేతద్వీపమునకుఁ జేరుకొనిరి. అచ్చటనుండు వారం

దలును చతుర్భుజులుగ నుందురు అందఱ చేతులందును గదా పద్మము లుండును. ఈ ముగ్గురు మహర్షులును నచ్చట నివసించు వారిని దర్శించిరి. కాని శ్వేతద్వీపమునకుఁ బోయినను భగవ ద్దర్శనము కాలేదు. అప్పుడు వారాశ్చర్య చకితులై దీనికి కారణ మడిగిరి. ఏమియును జవాబు రాక పోవునప్పటికి మిక్కిలి చింతించిరి. అప్పుడాకాశవాణి యిట్లు పలికెను:- "నాయీ లోకమునుండి మీరు తిరిగి పొండు. ఈలోకమును ఇచ్చట నివసించువారినిఁ జూచితిరి గదా! మీ తపఃఫలమున కిది చాలును. మీకు నాయందనపాయిని యగు అనన్య భక్తిలేదు. కావున నిఁక దిరిగిపొండు. ఆ తరువాత నారదుఁడు పోయెను. ఆతఁడు పోగానే భగవద్దర్శన మయ్యెను. దాని కాతఁడు కారణమడుగఁగా భగవానుఁడిట్లనెను :- "నీకు నాయందనన్య భావముకలదు. అందువలన నీకు సులభముగ నాదర్శన మైనది. ఆ ఋషులకు నితరేచ్ఛలుకూడ కలవు. అట్లుండి లేని భక్తితో నా ప్రసాదము లభించుట దుర్లభమని నాభావము. అహైతుక, అవ్యభిచారిణి యగు ననన్యభక్తిచే నేను బ్రసన్నుఁడనగుదును"

శ్రీశుకదేవుఁ డిట్లనెను:- "రాజా! గజేంద్రునకు బూర్వజన్మ జ్ఞానము కలిగినది. ఆతనికికుటుంబ, పరివారపుత్ర, పౌత్రులందును చివరకా గజశరీరమందును విరక్తికలిగెను. అతనిమనస్సు శ్యామ సుందరుని చరణములందు లగ్నమైనది. క్రమక్రమముగా నాతని వాసనలు క్షీణించెను. ఇంకే ధనాశయును లేకుండెను. దీని బలము తగ్గగానే మకరియిది నిర్బలమైనదని తెలిసికొని దాని నగాధ

జలములలోనికి లాగుకొనిపోవుచుండెను.అప్పటికిగజేంద్రుని శరీరము మునిఁగి పోయెను. ఒక్క తొండము మాత్రము బయటనుండెను. ఏనుగునకు తొండము మునుఁగ కున్నఁ దాను నది యెంతటి యగాధ జలములలోనికిఁ బోయినను భయముండదు. ఇప్పుడు తొండముకూడ మునుఁగుచుండెను. అసహాయత వృద్ధినిఁ బొంది పరాకాష్ఠనందు కొనెను. ఇఁకఁ తొండము చివర మునుఁగ వలసి యుండెను. ఇఁకఁ బ్రాణములు పోవుచున్నవి భగవన్నామోచ్చారణ మొనర్చినచో సమస్త సాధనలు నెఱవేరినట్లే యని గజరాజను కొనెను. అట్లనుకొని యాతఁడు కమలమునెత్తి నారాయణ నామ ముచ్చరించగానే ఆకాశమున గరుత్మంతుని మీఁదనెక్కి చతుర్భుజుఁడగు శ్రీహరి దర్శన మొసంగెను. అప్పుడు గజేంద్రుని హృదయము పులకరించెను. ఆతఁడిట్లను కొనెను:- భగవంతుఁడింకను ఆకాశమునఁ జాలదూరమున నున్నాడు. గరుత్మంతుఁడు దిగుట ఆలస్యము [illegible]దు. ఈలోగా నేను మునిఁగి పోయెదను ఏలయ [illegible] ఇప్పుడొక క్షణమైనను నాకు మునుఁగుటకు వ్యవధిలేదు గరుడుని మూఁపుపై మాటిమాటికిని మడిమతో శ్రీహరి తన్ను చుండెను. గరుత్మతుఁడింత వేగమున నెగురుటచే నలసి పోయెను. భగవానుఁడచ్చటనుండియే గరుడిని మూపుఁనుండి సరోవరము మీఁద కొక్క దుముకు దుమికి గజేంద్రుని వెనుక కాలినిఁ బట్టుకొని లాగగా మకరము కూడ తీరమునకు వచ్చెను. అచ్చటికి వచ్చిన తరువాతఁ దన సుదర్శన చక్రముచే నక్రము యొక్క కంఠమును నఱికెను. మెడ తెగుటతోడనే కాలుబయటకు విడి వచ్చెను. గజమునకు

బంధనము వీడిపోయెను. "బంధన హారి శ్రీహరికిజై" జయ జయ కారములచే నాకాశము ప్రతిధ్వనించెను. దేవతలు పుష్పవృష్టిని గుఱిపించిరి. దుందుభులు మ్రోగించిరి అప్సరసలు నృత్యము చేయ సాగిరి. గంధర్వులు గానమొనర్చిరి. సర్వత్ర ఆనందోత్సాహము వ్యాపించెను. ఋషులును, మునులును, సిద్ధులును, చారణాదులును వచ్చి భగవానుని ప్రబల పరాక్రమమును గూర్చియు భక్తవత్సల త్వాది గుణములును గూర్చియు, గాన మొనర్చి స్తుతింప సాగిరి.

రాజిట్లడిగెను :- "ప్రభూ ! గజేంద్రుఁడు భగవద్భక్తుఁడు. ఆతని యుద్ధారము జరుగవలయును. కాని భగవ ద్భక్తుని పాద మును పట్టుకొనిన వానిస్థితి యేమగునో నేను తెలిసికొనఁ గోరు చున్నాను. భక్తుని పాదములను బట్టు కొనిన మకరము నరకము నకుఁ బోవునా ?"

ఇది విని శుకదేవుఁడు నవ్వి ఇట్లనెను :- రాజా ! భగవ ద్భక్తుని పాదములు పట్టుకొనిన వానికెన్నటికిని దుర్గతి కలుగదు. ఆతఁడప్పుడే దివ్యరూపమును ధరించి సువర్ణము వలె మెఱయు చున్న విమానమెక్కి వెంటనే నిష్పాపుఁడై గంధర్వ లోకమునకుఁ బోయెను.

అంత మహారాజిట్లనెను :- "ప్రభూ ! ఈమకర మెవరు ? ఏకారణమున దీనికీ జన్మము వచ్చినది. ఇది గంధర్వలోకమున కేలఁ బోయినది ? నేను దీనిపూర్వ జన్మవత్తాంతమును వినగోరు చున్నాను."

ఇది విని శ్రీశుకుఁ డిట్లనెను :- "రాజా ! ఈమకరము పూర్వజన్మమున గంధర్వులలో శ్రేష్ఠుఁడును హూహూయను గంధర్వుడు. హాహా హూహూలు గానములో సర్వశ్రేష్ఠులగు గంధర్వులు ఒకనాడు హూహూ గంధర్వుఁడు గంగయందు తమస్త్రీలతో జలవిహారము చేయుచుండెను. మదమత్తుఁడై ఆతఁడు తన్నుఁ దా మఱచెను. అనేక విధముల నెగతాళి పలుకుచు నాతఁడు స్త్రీలచే నవ్వించుచుండెను.అనేక విధముల నీరు జల్లుచు వారినానంద పరుచు చుండెను. అగంధర్వీణులు కూడ మదోన్మత్తలైఆతనితో నవ్వుచుండిరి. ఆడుచుండిరి. నానావిధములగుఁ గామక్రీడ లొనర్చు చుండెను. సమీపముననే దేవల మహర్షి సంధ్యావందన మొనర్చు చుండెను. ఆ కామి కొక కుతూహలము కలిగెను. నీటిలో మునిఁగి లోపల గుండాపోయి యామహర్షి పాదమునను బట్టుకొనవలయుననుకొనెను అప్పుడాతఁడు గడ్డములు, జడలతోనుండి యులికి పడునని నప్పుడు తనప్రియురాండ్రు కిలకిల నవ్వగలరనియును, దాని వలన మిక్కిలి యానందము కలుగునని యును, మంచి వినోదము జరుగు ననియుభావించి యాతఁడుమునిఁగి నీటి లోపలగుండాపోయి గట్టిగా ముని పాదములను బట్టుకొనెను. ముని సూర్యోపస్థాన మొనర్చు చుండెను. కాళ్లు పట్టుకొనఁగానే అదరిపడెను ఆతఁడులికి పడఁగానే గంధర్వుఁడు బయటకు వచ్చెను తానునునవ్వ మొదలిడెను: ఆతనిగంధర్వీణులును నవ్వసాగిరి.

మునికిచేసిన నీయవజ్ఞతకు ఆతనికి మిక్కిలి కోపము వచ్చెను. అతఁడు వెంటనే శాపమునొసంగెను. "నీవు మొసలివవై

వచ్చి నాపాదమును బట్టుకొంటివి కావున నీవు మకరమయ్యె దవు !"

నవ్వులు నువ్వులయ్యెను. నవ్వు యేడ్పుగా మారెను. గంధర్వునకు తన తప్పు తెలిసెను; కాని యిప్పుడేమి చేయఁ గలఁడు ? బాణమును ధనుస్సునుండి వదలిన తరువాత నది లక్ష్య మును భేదింపక విడువదు. గంధర్వుని ముఖము వాడి పోయెను ఆతఁడు చేతులు జోడించుకొని యిట్లనెను :- "ప్రభూ ! ఇదంత యును నేను వినోదమునకుఁ జేసితిని."

ముని శుష్కహాసమొనర్చి యిట్లనెను :- "సరిసమానులతో వినోదమనునది జరుగును. సంధ్యావందనాదులలో మగ్నుఁడైనవాని తోడను, జ్యేష్ఠునితోడను, అసమయమునందు వారి యిచ్ఛకు విరుద్ధముగ వినోదములు జరుపరాదు. నేనెగతాళికైనను నబద్ధమాడ లేదు కావున నామాటలు మిథ్యలు కావు."

దీనతాస్వరమున గంధర్వుడిట్లనెను :- "స్వామీ ! నా యుద్ధారమున కేదైనను నుపాయమును జెప్పుడు."

ముని క్రోధము శాంతించెను ఈబ్రాహ్మణుల వచనము వజ్రమువలె నుండును. హృదయము నవనీతకోమలము. వీరి క్రోధము నీటిమీఁది గీతవంటిది. రాఁగానే మాయమై పోవును. ముని యాతని వినతికిఁ బ్రసన్నుఁడై యిట్లనెను :- "మంచిది, నీవు గ్రాహమై తీరవలెను. కాని చివరకు నీవొక గజేంద్రుని కాలినిఁ

బట్టుకొందువు. అప్పుడు భగవంతుడు సాక్షాత్తుగా చతుర్భుజరూప మున నీకు దర్శనమొసంగును. అప్పుడు నీవాతని దర్శనముచే నిష్పాపుడవై, తమోగుణ జన్మమును వీడి మరల దన దివ్యరూప మును బొందెదవు."

శ్రీ శుకదేవు డిట్లనెను :- "రాజా! ఆ హూహూ గంధ ర్వుడే చక్రస్పర్శచే బాపవిముక్తుడై ఆశ్చర్యమయ దివ్యశరీరము గల గంధర్వుడయ్యెను. అత డుత్తమశ్లోకుడును, కీర్తిధాము డును, అవినాశియు, కీర్తనీయ గుణాఢ్యుడును జగదీశ్వరుడు నగు వాని పాదపద్మములకు బ్రణామమును గావించి అతని సుయశమును గానము గావించెను. భగవాను డాతని గానమునకు సంతసించి వానికభీష్టవరముల నొసంగెను, ఆతడును బ్రభు బ్రసాదమున దివ్యరూపమును బొంది నిష్పాపుడై తన ధామము నకు బోయెను. రాజా! నేను నీకు మకరముయొక్క పూర్వజన్మ వృత్తాంతమును జెప్పితిని. ఇప్పుడు నీవేమి వినగోరుచున్నావు?"

# గజేంద్రుని పూర్వజన్మ వృత్తాంతము

శ్లో॥ గజేంద్రో భగవత్స్పర్శాద్విముక్తోఽజ్ఞానబంధనాత్ ।
ప్రాప్తోభగవతో రూపం పీతవాసాశ్చతుర్భుజః ॥
సవై పూర్వమభూ ద్రాజా పాండ్యో ద్రవిడ సత్తమః ।
ఇంద్రద్యుమ్న ఇతిఖ్యాతో విష్ణువ్రత పరాయణః ॥

శ్రీభాగ. ౮స్కం. ౪అ. ౬, ౭శ్లో ॥

ఆ॥ వశిత పొందఁ గనుచుఁ దనలోకమున కేఁగి
నవ్వుచు శౌరి గేల నంటి నడప
హస్తిలోక నాథుఁ డజ్ఞాన రహితుఁడై
విష్ణురూపుఁడగుచు వెలుఁగుచుండె ॥

మ। అవనీనాథ గజేంద్రుఁడా మకరితో నాలంబు గావించె ము
ద్రవిళాధీశుఁడతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్ననా
ముండు వై
ష్ణవ ముఖ్యుండు గృహితమౌనని యతిన్ సద్వాత్మ
నారాయణున్
సవిశేషంబుగఁ బూజసేసెను మహాశైలాగ్ర భాగంబునన్ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

శాస్త్రకారు లతిథి ధర్మమును గురించి విస్తృతముగఁ బ్రశం
సించిరి. అతిథిని మానవుఁడనుకొనుట పాపము. అతిథి భగవత్స్వ
రూపుఁడు. భగవద్బుద్ధితోనే అతనిని బూజింప వలయును. గర్వ
ముతోఁ దనతప, స్వైజ, ప్రవచనములందు గల పెద్దతనము కారణ
ముగా నతిథి నవమానించినచో యపరాధమునే నధోగతినిఁ బొందు
దురు. అతిథి యెప్పుడు వచ్చినను సత్కరింపవలయును. జపతప,
పూజా, పారాయణము లన్నియును నతిథికొరకే, మనసేవచే నతిథి
సంతుష్టుఁడైనచో మన సాధనలన్నియును సార్థకములు కాఁగలవు.
ఏదైన మన వ్యవహారమువలన నతిథి కోపబడినచో మనము చేసిన
దంతయును, నిరర్థకమైనదని తెలిసికొనవలయును.

శుక దేవుఁడు పరీక్షిన్మహా రాజుతో నిట్లనెను :- "రాజా!
నేను నీకు మకరముయొక్క పూర్వజన్మ వృత్తాంతమును జెప్పి
తిని, దేవలముని శాపముచే హాహాహూ గంధర్వుఁడు గ్రాహమ
య్యెను. నేఁడు భగవత్స్పర్శ కాఁగానే అతఁడీ యధమ యోని
నిఁద్యజించి దివ్యపురుషుఁడయ్యెను."

అంతరాజిట్లనెను :- "స్వామీ ! మకరముయొక్క పూర్వ
చరిత్రమును మీరు చెప్పితిరి; కాని పరమ భాగవతుఁడు పూర్వ
జన్మమున నెవరోమీరు చెప్పలేదు. స్వామీ ! గజరాజును నేదో
పుణ్యాత్ముఁడును సుకృతియునై యుండ వచ్చును. కాకున్న
మహాత మోమయమగు గజయోని యందిట్టి యనన్య భావన అసం
భవమ్మే."

ఇదివిని శ్రీశుకుఁడిట్లనెను :- "రాజా ! నేను గజేంద్రుని యొక్క పూర్వజన్మ వృత్తాంతమును నీకు జెప్పెదను. దీనిని నీవు సావధానుఁడవై శ్రవణ మొనర్పుము. ఇది పరమ పుణ్యప్రదమై నది యును, యశోభివృద్ధినిఁ గలిగించునదియును భగవద్భక్తి వర్ధకమగు నాఖ్యానము. మహారాజా ! పూర్వకాలమున దక్షిణ భారతమునఁ బాండ్య దేశమును బరిపాలించు నొక యశస్వియగు రాజుండెను. ద్రవిడదేశ మందా నరపతి గొప్ప యశస్వి, తేజస్వి, తపస్వి, విష్ణుభక్తుడు ఆతని పేరింద్రద్యుమ్నుఁడు ఆతఁడు చాల కాలము వఱకు తన ప్రజలను బుత్రులవలెఁ పాలించుచుండెను తన యాయువు తీరిపోవు చున్నదని తెలిసికొని యాతఁడు తన రాజ్యము దన పుత్రునకప్పగించి, తపస్సు చేసికొనుటకు మలయాచల పుణ్య ప్రదేశమునకుఁ బోయెను. అచ్చుటభగవానుఁడు నిత్యనివాస మొనర్చుచుండును. ఆపర్వతము నందఱును బుణ్యప్రద తీర్థముగ భావించు చుందురు. అట్టి పర్వతము మీఁదకుఁబోయి, పృథివీపతి వానప్రస్థాశ్రమమును స్వీకరించి తపస్సు చేయుచుండెను. మలయాచలమందు మనోహర ప్రాంతమందు, మంచిసుస్వాదు సలిల సరిత్తులుండు చోటను, మంచి రుచిగల ఫలములుండుచోటను గూర్చుండి ఘోరతపస్సును జేయుచుండెను. ఆతఁడు గ్రామ్యాహారమును బరిత్యజించెను. కంద, మూల, ఫలములను దిని యాతఁడు తన జీవనమును గడుపు కొనుచుండెను. క్షురకర్మను జేయించుకొనక పోవుటచే నాతనికి జడలు పెరిగిపోయెను. మౌనియై యాతఁడు నిరంతరము జపము చేయుచుండెను.

ఒకదినమున మహారాజు ప్రాతఃకాలీన నిత్యకర్మలను బూర్తి కావించుకొని యేకాంతమునఁ గూర్చుండి, వార్చుప్యమును గావించి, సర్వాంతర్యామియగు శ్రీహరి నారాధించుచుండెను. అదే సమయమునకు దైవయోగముచేఁ దిరుగుచుఁదిరుగుచు సముద్రమును శోషింపఁజేసిన మహాతపస్వియగు నగస్త్యమహాముని తన శిష్యులతో నచ్చటకు వచ్చెను. రాజు మునివచ్చుచున్నాఁడని తెలిసియును నటుఁ జూడలేదు. మహాముని వచ్చుచున్నను నేను భగవదారాధనమును జేయుచున్నానుగదా, లేచుట మంచిదికాదని లేవక మెదలకఁ గూర్చుండెను. మహర్షి యెండలోఁ దిరిగిదిరిగి, యిచ్చటకు వచ్చినచో రాజాతిథ్యమునొసంగి, కందమూలముల నర్పించి, సమ్మానమొనర్పఁగలఁడని భావించివచ్చెను. అదంతయును లేదుసరిగదా రాజు వాక్కుతోనైనను సత్కరింపలేదు. అంతమునికి మిక్కిలి కోపమువచ్చెను, ఆతఁడు క్రోధోద్రిక్తుఁడై రాజునకు శాపమొసంగుచు నిట్లనెను :- "ఓరీమూఢా! నేను వచ్చినను నీవేనుఁగు వలెఁ గూర్చుంటివి కావున నీవు గజమవు కమ్ము" ఇట్లు పలికి ఆగస్త్యుఁ డచ్చట నొక్కనిమిషమైనను నిలువలేదు. తన సహచరులతో వెంటనే అచ్చటనుండి యెచ్చటికో పోయెను.

రాజు ముని శాపమును వినెను. ఆతఁడు క్రోధభరితుఁడై వెడలుచుండుటయును గాంచెను; కాని రాజు వారింపలేదు. శాపవిమోచనము కొఱకు ప్రార్థింపనులేదు. రాజిట్లనుకొనెను :- "హోమముచేయబోయినఁ జేతులు కాలినవన్నట్లు నేనిల్లు వాకిలి, భార్యాబిడ్డలను రాజ్యమును బరిత్యజించి యరణ్యములోని యేకాంత

ముగ భగవదారాధన మొనర్చుటకు వచ్చుటేమి! యీ శాపపర్వ తము విఱుచుకొని నా శిరస్సుపైఁబడుటయేమి? నొసటఁ వ్రాసిన వ్రాతను దుడుపనెవ్వరికిని సాధ్యముకాదు. దీనిలోను మంగళమయ భగవానుని శుభవిధానమేదియో కలదు.''

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా! నీవు మంచి యద్భుత కథను వినిపించితివి. మహాభాగా! ఇందు ఇంద్రద్యుమ్నుని యపరాధ మేమున్నది. భగవదారాధన మొనర్చుచున్నాఁడు. దానికి ముని క్రుద్ధుఁడై ఆతని శపించినాఁడు."

అంతఁబరీక్షిన్మహారాజిట్లు పలికెను:- ''స్వామీ! మీరు సర్వ జ్ఞులరు. ఎవరెవరికి సుఖ దుఃఖము లొసంగగలరు? శాపానుగ్రహము లొసంగుట కెవరికి సామర్థ్యమున్నది! స్వామీ! సమస్తప్రాణులును దమతమ కర్మ సూత్రముచే బంధింపఁబడినారు. ప్రారబ్ధమెట్లను భవింప వలసియుండునో అట్టిబుద్ధియే పుట్టును. రాజునకట్టి దుర దృష్టముండినది. అగస్త్యమహాముని నిమిత్త మాత్రుఁడయ్యెను. ముని తన యాశ్రమమునకు వచ్చినాఁడనియు, భజనకు మించినది అతిథిసత్కారమనియుఁదెలిసికొని మునికి స్వాగత సత్కారము లొనర్పవలసియుండును. పొరపాటుననే కానిండు, అతనివలన గొప్పయపరాధము జరిగినది. ఎట్లు జరుగవలసియున్నదో అట్టి బుద్ధియే పుట్టఁగలదు.

అంత శౌనకుఁడిట్లడిగెను:- ''సూతా! ఇనాళ్ళనుండి చేసిన జప, పూజా, పాఠారాధనములు వ్యర్థములైనవికదా! ఏనుఁగు జన్మమున నేమి సాధనచేయ వీలగును?"

అంతశ్రీఘ్రముగ సూతుఁడిట్లనెను:- "కాదుస్వామీ! శుభకార్యమెన్నటికిని వ్యర్థముకాదు. భగవదుపాసనము మోఘమైనది. భగవత్ప్రాప్తి సులభమైనదికాదు. అనేక జన్మములు ఘోరతపస్సు చేయఁగా భగవత్ప్రాప్తి కలుగును. కోటిజన్మముల పుణ్యప్రభావముచేఁ బురుషునకుఁ బ్రభుపాదపద్మములందు భక్తికలుగును. ఇంద్రద్యుమ్నమహారాజు తన భగవద్భక్తి కారణమున నాజన్మముననే భగవత్ప్రాప్తినిఁబొందెడు వాఁడే, కాని జన్మాంతర దుష్కృతముదయింపఁగా నాతఁడు కొంతకాలము తమోమయమగు గజముగ నుండవలసి వచ్చినది. పశుజన్మ ప్రాప్తించినను అతనికి జ్ఞానమక్షుణ్ణముగ నుండెను. అందుకనియే అతఁడునుండియును నిట్టిదివ్యస్తుతినిఁ గావించెను స్మరణమాత్రముచేతనే స్వయముగ సాక్షాచ్ఛ్రీహరి చతుర్భుజరూపమున నాతని సమ్ముఖమునఁ బ్రత్యక్షమై ఘోర సంకటమునుండి కాపాడుటే ఆతనియారాధనమునకు ఫలము భగవంతుని త్రైలోక్యవందిత మనోహరముఖమును జూచుచుఁజూచుచు, వాక్కుతో నాతనిసుమధుర నామములను గీర్తనచేయుచుఁ జేయుచు నాగజశరీరమును ద్యజించెను.

ఆతఁడు గజ శరీరమును విడువఁగానే నాతఁడు చతుర్భుజ రూపమును ధరించెను. చతుర్భుజములతో శంఖ చక్ర గదా పద్మములు శోభిల్లుచుండెను. పీతాంబరమును ధరించి భగవానునకు నిత్య పార్షదుఁడయ్యెను తక్షణ మాతఁడు భగవత్సారూప్యమును బొందెను. ఇది మనుష్య జన్మములో గూడ దుర్లభము. అట్టిది యాతఁడు తన పూర్వజన్మము నందొనర్చిన యారాధనా ప్రభావముచేఁ బశువుగనుండియుఁ బొందెను.

శుక దేవుఁడు పరీక్షిన్మహారాజుతోనిట్లనెను:-"రాజా! నేను చతుర్థ మన్వంతరావతారమును శ్రీహరి యొక్క పరమ పావన చరిత్రమును నీకుఁజెప్పితిని. గజ గ్రాహముల రెంటిని నుద్ధరించి వైకుంఠ పతియగు శ్రీహరి గరుడవాహనా రూఢుఁడై తన భవనము నకుఁబోయెను. ఆతని వెనుక గంధర్వులు గానము చేయుచుఁబోవు చుండిరి. ఋషులును, మునులును, నిత్యపార్షదులును నాతని స్తుతించుచుఁ బోవుచుండిరి."

మహారాజా! ఈ గజేంద్రమోక్షణ కథ, శ్రీహరి చరిత్ర పరమ ధన్యమైనది. యశమును వృద్ధి గావించును. సమస్తకోరికలను నెఱవేర్చును. దీనిని శ్రద్ధా భక్తులతో నెవరు వినెదరో, వినిపించెదరో వారికి సమస్త మనోరథములు నెరవేరును. వారికి శ్రీహరి చరణము లందహైతుక భక్తి కలుగును. కావున శుభకాంక్షకలవారు దీనినిఁ బఠింప వలయును.

. . . . .

## గజ-గ్రాహ చరిత్ర సమాప్తి

శ్లో॥ ఏతన్మహారాజ తవేరితో మయా
కృష్ణానుభావో గజరాజమోక్షణమ్।
స్వర్గ్యం యశస్యం కలి కల్మ షాపహమ్
దుస్స్వప్న నాశం కురువర్య శృణ్వతామ్॥

-శ్రీ భాగ. ౮ స్కం. ౪ అ. ౧౫ శ్లో.

సీ॥ నరనాథ నీకును నాచేత వివరింపఁ
బడిన యీ కృష్ణాను భావమైన
గజరాజు మోక్షణ కథ వినువారికి
యశము లిచ్చును గల్మషాపహంబు
దుస్స్వప్న నాశంబు దుఃఖ సంహారంబుఁ
బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన
విప్రులకును బహు విభవ మమరు

తే॥ సంపదలు గల్గుఁ బీడలు శాంతిఁబొందు
సుఖము సిద్ధించు వర్ధిల్లు శోభనములు
మోక్షమఱచేతి దై యుండు మదము సేరు
ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె॥

శ్రీ మదాంధ్ర భాగవతము

శ్రీహరి యెచ్చట అవతరించి క్రీడలొనర్చునో ఆ స్థలము పవిత్రమైనదగును. అచ్చటి ధూళి పావనముకాఁగలదు. అచ్చటి వృక్షములు, గుల్మలతాదులు, సరోవరములు, పర్వతములు, వన గిరి గహ్వరములు సమస్త స్థానములు పుణ్యప్రదములగును. భగవంతునితో సంసర్గము గలిగిన వ్యక్తులందరును ప్రాతఃస్మరణీయులగుదురు. జీవుఁడు భగవత్సాక్షాత్కారము లేకయే అటు నిటు వ్యర్థముగఁ బరిభ్రమించుచుండును భగవద్దర్శనమైనాఁడు కృతకృత్యుఁడగును.

శ్రీ శుకదేవుఁడిట్లుడిగెను :- "రాజా! ఈ విధముగ భగవానుఁడు గజగ్రాహముల రెండింటిని నుద్ధరించెను. వారిద్దరును దివ్యధామమును బొంది కృతార్థులైరి."

అంత శౌనకుఁడిట్లుడిగెను :- "సూతా! ఇది వఱలో గజగ్రాహములను గరుడుఁడు భక్షించినట్లును, వీరిద్దరన్న దమ్ములనియును మీరు చెప్పియుంటిరి. ఇప్పుడు గ్రాహము హూహూ గంధర్వుఁడనియు, గజము ద్రవిడ దేశపు రాజగు నింద్రద్యుమ్నుఁడనియు చెప్పుచున్నారు. ఇందులో నేది సత్యము?"

అంత శీఘ్రముగ సూతుఁడిట్లనెను :- ''స్వామీ! రెండును సత్యములే. ఒక కల్పములో గజ గ్రాహములను గరుడుఁడు తిని యుండవచ్చును. నేనీ కల్పములోఁజతుర్థ మన్వంతర కథను జెప్పుచున్నాను. ఈ మన్వంతరమున హరిణీ నందనుఁడగు శ్రీహరి యుద్ధరించెను. గరుడుఁడు గజ కచ్ఛపములను భక్షణ మొనర్చిన కథయును మిక్కిలి రోచకమైనది అచ్చట పోరాడినది గ్రాహము కాదు కచ్ఛపము.''

ఇది విని శౌనకుఁడిట్లనెను :- "సూతా! దానిని గూడ చెప్పుము. గరుడ, గరుడధ్వజచరిత్రలు రెండును సమానములే."

ఇది విని నవ్వుచు సూతుఁడిట్లనెను :- ''మునులారా! ఈ కథ చాల పెద్దది. దానిని నేను సంక్షేపముగఁ జెప్పెదను. మీరందఱేకాగ్రచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.

గరుడారుణుల తల్లియగు వినతయు, సర్పముల తల్లియగు కద్రువయు నక్కచెల్లెండ్రు, వారిద్దరును కశ్యపుని భార్యలగుటచే సవతులు. ఒకదినము నుచ్చైఃశ్రవముయొక్క తోకవిషయములో వారిద్దరికిని వాదవివాదములు జరిగెను. తోఁక తెల్లదని వినతయును, నల్లనిది యని కద్రువయు ననెను ఇదెంతవఱకు వచ్చినదనగా విషయ మసత్యమగుచో రెండవవారికి జీవితాంతము వఱకును దాసిగా నుండునట్లు నిర్ణయము చేసికొనిరి. వాస్తవమున నుచ్చైఃశ్రవము యొక్క తోఁక తెల్లగానున్నది కద్రువ తన పుత్రులగు నాగులతో నాతోఁకకుకట్టుకొనుడనెను. అందువలన వారు చుట్టుకొనుటచే నల్లగానుండెను. ఇట్లు మోసముచేఁ కద్రువ వినతను తన దాసిగాఁ జేసికొనెను. వినతకు గరుత్మంతుఁడు పుట్టఁగనే యీసంగతినంత యును వినెను. నాగులనిట్లడిగెను :- "మీకేమి పనిని జేసిన మాకు దాసత్వవిముక్తికలుగఁ గలదు ?"

నాగులిట్లనెను :- "నీవు మాకు స్వర్గమునుండి యమృత మును దెచ్చియిచ్చినచో నీకును, మీతల్లికిని దాసత్వవిముక్తి గలుగఁ గలదు." గరుత్మంతునకు బ్రపంచమున నసంభవమనునదిలేదు. ఆతఁ డమృతమును దెచ్చుటకు బయలుదేరెను. పోవునపు డాతఁడు తన తల్లి నిట్లడిగెను :- "అమ్మా ! నేనెంతో దూరమునకును న్నిం ద్ర లోకమునకుఁ బోవలయును. అధికముగ నాఁకలియే యు చున్నది. నేనేమి తినవలెను ?"

తల్లి యిట్లనెను :- "నాయనా ! ఇచ్చట భూమిపై నీ పొట్ట నిండుట యసంభవము. నీవొకపనినిచేయుము సముద్ర మధ్య

మునఁ జాలమంది నిషాదులు నివసించుచుందురు. వారు గొప్ప హింసకులు, క్రూరులు, నిర్దయులు, నీవు వీరినందఱను భక్షణము చేసి పొమ్ము. కాని పొరపాటుననైన బ్రాహ్మణు నెవనినిఁ దిన వలదు.''

గరుత్మంతుఁడు మంచిదని మాతకుఁ బ్రణామమును గావించి ముందుగా నాద్వీపమునకుఁ జేరుకొనెను. అచ్చటి నివసించు ననార్యులగు మ్లేచ్ఛులు సుందరులేగాని హృదయములు కలుషిత మైనవి. వారు నిరంతరము హింసాతత్పరులు. గరుడుఁడు వారినిఁ దినుటకారంభించెను. సర్వత్ర పాఱిపోవు చుండిరి. ఆకబళములో నాతని పురోహితుఁడును గరుడుని కంఠములోనికిఁబోయెను.గరుడుని కంఠము మండఁజొచ్చెను. అప్పుడాతనికి తల్లి చెప్పిన మాట జ్ఞాపక మునకు వచ్చెను. ఆతఁడు వెంటనే ఆతనిని, నాతని నిషాద పత్నినిఁ గ్రక్కెను. ఈవిధముగ నాతడు వేలకొలది మందినిఁ దినెను కాని అతనికి పూర్తి ఫలాహారము కాలేదు. అర్థాకలితో నాతఁడెగిరెను. దారిలో సుమేరు పర్వతముపైఁ దన తండ్రి యగు గశ్యపుని కలిసికొనెను. తండ్రి పాదములకు గరుడుఁడు ప్రణ మిల్లెను. తన పుత్రుని గాంచి ముని మిక్కిలి సంతోషించి యిట్ల నెను :- వత్సా ! అందఱును బాగున్నారా ? మర్త్యలోకమున కేమియును గష్టములు లేవుకదా !''

గరుత్మంతుఁ డిట్లనెను :- "తండ్రీ ! కష్టమేమియును లేదు గాని 'కష్టాత్కష్టతరీక్షుధా' యనునట్లు క్షుధ బాధించుచున్నది.

మర్త్యలోకమున నాకు గడుపునిండుటలేదు. ఇప్పుడును నాకాఁకలి వేయుచున్నది. దేనిని దినిన నాకాఁకలి శాంతించునో అట్టి ఆహారమును నాకుఁజెప్పుడు."

ఇదివిని కశ్యపుఁడు కొంచెముసేపు ధ్యానమొనరించి యిట్లనెను :- "నీకు యోగ్యమైన దొక్క ఆహారముకలదు. ఇచ్చటికి సమీపముననే దేవతల యొక్క సరోవరము కలదు. దానిలో నొకపెద్దవారణేంద్రముకలదు. జలజంతువగు గచ్ఛపమును గలదు. వారిద్దరును బోరాడుకొను చుందురు. ఇప్పటికి వేయి సంవత్సరములు గడచుచున్నది. నీవారెంటినిఁదిని నీయాఁకలినిఁదీర్చుకొనుము."

అంతగరుడుఁ డిట్లనెను :- "స్వామీ! తండ్రీ! ఒక్క గజమును, గచ్ఛపమును దినుటచే నాపొట్ట యెట్లునిండఁగలదు. అవి యెంత పెద్దవి ?"

కశ్యపుండాశ్చర్యముద్రతో నిట్లనెను :- "నాయనా! నీవు దాని పొడుగువెడల్పుల నడుగవలదు. ఏనుగు ఇరువది నాలుగు క్రోసుల వెడల్పు, నలుబదియెనిమిది క్రోసుల యెత్తు, తాఁబేలు పంద్రెండు క్రోసుల యెత్తు నలుబది క్రోసుల చుట్టుకొలత, కూర్మమొక పెద్ద ద్వీపము, కుంజర మొక పెద్ద పర్వతము, ఆరెంటినిఁ దినినచో నీకు పూర్తిగఁ దృప్తికలుగునని నా నమ్మకము."

ఆనందమును బ్రకటించుచు గరుడుఁ డిట్లనెను :- "తండ్రీ! దీనితో నాకడుపునిండఁగలదు. మంచిది, నేను శలవు తీసికొందును."

అని పలికి ఆతఁడా క్షణముననే యెగిరి సరోవరము వైపునకుఁ బోయెను."

ఇదివిని శౌనకుఁడిట్లనెను :- "సూతా! ఒక్కొక్కప్పుడు నీవు మాబుద్ధులు పనిచేయఁజాలనంతగ నసంబద్ధములను జెప్పు చుందువు. నలుబదియెనిమిది క్రోసుల యేనుఁగును నలుబది క్రోసుల చుట్టుకొలత కలిగిన కచ్ఛపముండునా? ఇంతగొప్పజీవి యుండుట నసంభవము. పైఁగా గరుడుని కడుపు పాతాళ వివరమాయేమి యింతటి పెద్దజంతువు పొట్టలోఁబట్టుటకు.''

అంత సూతుఁడిట్లనెను :- "స్వామీ! పరిమిత బుద్ధికల వారును, అహంకారముచేఁ దామే పండితులమనుకొనువారును నిట్టి పల్కులు పలికిన బాగుండును గాని; మీకిట్టి శంక కలుగుట శోభిం పదు. ప్రభూ! ఈ సృష్టిలో వివిధ జీవులు కలవు. అనేక ప్రకా రములగు సముద్రములు, ద్వీపములు, వర్షములుకలవు. మానవు లకు జంబూద్వీపములోని నవ వర్షములలో భారతవర్షము మాత్రమే కనఁబడుచున్నది; ఈ క్షుద్రజీవి దీనినే ప్రపంచమనుచున్నాఁడు. సప్తసముద్రములలో నొక లవణ సముద్రముమాత్రమే కనఁబడు చున్నది. మిగిలిన యాఱు సముద్రములను గనఁబడుటటులుంచి వాని నూహించుటకైనను వీలులేకున్నది. జలజంతువులలో నిప్పటి కిని తిమింగిలమను జేప అన్నిటికంటెఁ బెద్దదిగ నున్నది. అది వచ్చినచో నదియొక్క ద్వీపమగును. అది క్రోసుల కొలఁది యుండును. ఈ చిన్నఖండమందే యింతటిపెద్ద జంతువులుండిన

దీనికంటెఁ బది పదునైదు రెట్లధికముగ నుండిన ఖండములలో నెంత పెద్దజీవ జంతువులున్నవో. స్వామీ! మానవుండు తన బుద్ధితోడనే ఆలోచించును. కొండలందుండు వారు పర్వతముల మీదనున్న బండలను దొలఁగించి రెండు రెండు గజములు, మూడు మూఁడు గజముల మడుల నేర్పఱచుకొని దానిలో నాటెదరు. గంగాయమునా మైదానమందు వేలకొలఁది యకరము లుండునని వారూహింపఁజాలరు. విశ్వసింపరు. ఏలయనఁగా వారి మనస్సులలో నా రెండుమూఁడు గజముల మడులేయున్నవి. ఇఁక గరుత్మంతుఁడు తిను విషయము మిగిలియున్నది. గరుడుఁడు సాధారణ జీవికాఁడు. ఇంద్రుని గూడ వేధించినవాఁడు. అసంఖ్యాకములగు బ్రహ్మాండములు ఉదరములోఁగలిగిన శ్రీహరిని వహించు వాహనమాతఁడు. వేలకొలఁది నిషాదులను దినిన నాతనికి అల్పాహారముగనైనను సరిపోలేదు. అట్టియెడ నీవారణ కచ్ఛపములదినుట యేమంతపనియో యూహింపవలయును. ఒక మానవుఁడు పది శేర్ల లడ్డులుతినఁగలుగుచున్నాఁడు. భీమసేనుఁడు మఱుఁగుంబావు ఫలహారమొనర్చెడువాఁడట కాని పదిశేర్లు లడ్డిప్పుడైనను నొక్కచోటఁ గూర్చుండి తినగలగు వారున్నారు. స్వామీ! ఎవఁడెంతలావుగ నుండునో వాఁడంతయాహారమును దీసికొనును దీనికాశ్చర్యములను జెందవలసిన పనిలేదు."

సవ్వి శౌనకుఁడిట్లనెను :- "మంచిది, స్వామీ! మీమాటయే నిజము లెండు తరువాత కథను జెప్పుఁడు."

సూతుఁడిట్లనెను:- "మంచిది, స్వామీ! పోవునపుడు గరుడుఁడు తనతండ్రి యగు కశ్యపునితో నిట్లనెను :- "స్వామీ! ఈ యిద్దరెవరు? ఎందులకుఁ బోరాడుచుండిరి? వీనినిఁ దినుటచేఁ బాప మంటదా?"

అంత కశ్యపుఁ డిట్లనెను :- "నాయనా! ఈ యిద్దరును బూర్వజన్మమున విభావసు, సుప్రతీకులను బ్రాహ్మణ సోదరులు. పెద్దఁవాడగు విభావసు మిక్కిలి క్రోధి. ఈతని తండ్రి ధనవంతుఁడు. చిన్నవాఁడగు సుప్రతీకునకు వీనితో నుండుట కిష్టము లేదు. క్రోధితోనుండుట కెవరిష్ట పడుదురు? ఆతఁడు తనయన్నను మాటిమాటికిని ధనమును బంచుమని యడిగెను. అన్న తిరస్కరించుచుఁ గాదను చుండెను. సుప్రతీకుఁ డొప్పుకొన కుండెను."

అంతఁ గోధోద్రేకుఁడై అన్నయగు విభావసునితో నిట్లనెను- "ఓరీ! చూడుము. నీవు పిత్రార్జితము కొఱకు పోరాడుచున్నావు. నేను నిన్ను వారించు చున్నను నీవు వినుటలేదు. కావున వారణ మవుకమ్ము."

సుప్రతీకుఁడును దక్కువ వాడుకాఁడు ఆతఁడును ముని పుత్రుఁడే. ఆతఁడిట్లు శపించెను :- "నీవును ధనమును దాచుకొను చున్నావు. కావునఁ గూర్మమవు కమ్ము."

కశ్యపుఁ డిట్లనెను :- "వత్సా! గరుడా! ఆముని పుత్రు లిరువురును గజకచ్ఛపములైరి. పూర్వజన్మ వైరమును స్మరించు

కొని, క్రోధభరితులై వారిద్దరును నిరంతరము పోట్లాడుకొను చుండిరి. వారియుద్ధము సర్వదా నడుచుచుండెను. భగవానుఁడు నీవృత్తియే జీవులను జంపి తినుటగా నేర్పఱచినాఁడు. నీయాహార మిదియే. క్రోధులైయుండి జీవుల కపకార మొనర్చు వారినిఁ జంపుట దోషము కాకపోఁగా బుణ్యమే. వీరిద్దరు మూలమున సరోవర మందలి జీవ జంతువులన్నియును దుఃఖమును జెందుచున్నవి. నీవీ రెంటినిజంపి నీయాకలినిఁ దీర్చుకొనుము."

సూతు డిట్లనెను :- "మునులారా! తండ్రియాజ్ఞను బొంది గరుడుఁడు పోయి క్షణములోనే సరోవర సమీపమునకుఁ జేరు కొనెను. ఒక యుదుటున నాతఁడు గజకచ్ఛపముల రెంటినిఁ దన కాలిగోళ్ళతో గ్రుచ్చి పట్టుకొని యెగిరిపోయెను. ఆతనికి రెండు చేతులలోను రెండు గ్రాసములు కలవు. ఇప్పుడాతనికీ రెంటిని నెక్కడ నుంచుకొని తినుటయను జింత పట్టుకొనెను." భూమి గడగడ వణఁకు చుండెను. వృక్షశాఖ లూగియూగి తమమీఁద గూర్చుండవలదని కాదనుచుండెను." అందఱును భయభీతులగుటను గాంచి సుమేరు పర్వతము మీఁద నొక విశాల వటవృక్షముండెను. దాని శాఖలు నూరమడ పొడవుండెను. అదియిట్లనెను :- "గరుడా! నీవు నాశాఖమీదఁ గూర్చుండి భోజనము చేయుము."

గరుత్మంతుఁడు మంచిదని ఒకమంచి దృఢమగు శాఖమీఁదఁ గూర్చుండు నప్పటికి, ఆశాఖ, గరుడ, గజ, కచ్ఛపముల బరువు నది తట్టుకొనఁ జాలక కొమ్మ పెళపెళ విరిగివడెను. ఇప్పుడు

గరుత్మంతుఁడు గొప్పధర్మ సంకటమునఁ బడెను. ఆ కొమ్మ మీఁద నఱువది వేలమంది వాలఖిల్యమహామునులు తల్క్రిందులుగఁ దపస్సును జేయుచుండిరి. వారి శరీరములంగుష్ఠ ప్రమాణములు. గరుత్మంతుఁ డిట్లనుకొనెను :- "ఈ కొమ్మ నేలపైఁ బడినచో నీ మునులు పచ్చడి పచ్చడి కాగలరు" ఇట్లనుకొని యాతఁడా కొమ్మను బడనీయక, ఒక చేతితో నలువది క్రోసుల యెత్తుగల గజమును, వేరొక చేత నలుబది యెనిమిది క్రోసుల వెడల్పుగల కచ్ఛపమును, ముక్కుతో నాలుగువందల క్రోసుల పొడుగుగల వటశాఖను బట్టుకొని యెగిరెను. ఇప్పుడు గరుడుఁ డాకలి దప్పులను గూడ మరచిపోయెను. ఇప్పుడీ యఱువది వేలమంది వాలఖిల్యుల నెట్లు రక్షించుటా యను చింత పట్టుకొనెను. ఎచ్చటనుంచినను వీరునలిగిపోఁగలరు" అని యాలోచించుకొని పరమతేజస్వియును, మహాపరాక్రమవంతుఁడును, అద్భుతబలశాలియును, మనోవేగముతో సమానముగ నెగురఁగల వాఁడును, సుమేరు శిఖరమువలె విశాలబలకాయుఁడు నగు గరుడుఁడెగురుచు నెగురుచు మరలఁ దన తండ్రికడకుఁబోయెను తన యోగబలముచేఁ గశ్యపుఁ డంతయు నెఱిగెను. ఆతడు వాలఖిల్యమునులను దనపుత్రుఁడగు గరుడునకు సాయ మొనరింపుఁడనియు, నాతని ధర్మసంకటము నుండి రక్షింపు డని విన్నవించెను.

వాలఖిల్య మహర్షులా కశ్యపుని ప్రార్థనము నంగీకరించి, వారా కొమ్మను వదలి హిమాలయ పర్వతమునకుఁ దపమునకుఁ బోయిరి. అంత గరుడుఁడు పితృాజ్ఞచే నే జీవులును నివసింపని

మంచుచేఁ గప్పఁబడిన నొక కొండపై నాశాఖ నుంచివైచెను. అచ్చటనే కూర్చుండి గరుడుఁడు మిక్కిలి యానందముతో నా యిద్దరను దిని నిశ్చితంగ నమృతమును దేఁబోయెను.

సూతుఁడిట్లనెను.–"మునులారా! ఇది కల్పాంతర కథ. దీనికిని గజగ్రాహకథకును సంబంధమేమియును లేదు. ఇది గజకచ్ఛపుల కథ. హరిణినందనుఁడగు హరిహరమేధున కవతరించి గజగ్రాహముల నుద్ధరించినాఁడు. గజకచ్ఛపములను దిని యాతని వాహనమగు వైనతేయుఁ డుద్ధరించినాఁడు."

ఈ గజేంద్రమోక్షణ కథ సమస్తపాపములను నాశమొనర్చును. ఎవరీ కథానంసర్గముచే గజగ్రాహములను, గ్రహమున్న సరస్సును, దాని తీరముననున్న వృక్షములను. పర్వత, ద్రుమ, లతా, గిరిసరిత్తులను, భగవద్ధామములును విభూతులు నగు క్షీరసాగర, శ్వేతద్వీప, శ్రీవత్స కౌస్తుభమణి, వనమాల, కామోదకీ గద, సుదర్శనచక్రము, పాంచజన్యశంఖము, గరుడ, లక్ష్మి, నారద, శివ, ప్రహ్లాద, మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, రామ, కృష్ణాద్యవతారములను, సూర్య, చంద్రాగ్ని ప్రణవ, సత్య, అవ్యక్త, గో, బ్రాహ్మణ, ధర్మ, కీర్త్యాది ధర్మపత్నులను, గంగా, యమునా, సరస్వతీ, భద్రాది పుణ్యసరిత్తులను, నైరావత, ధ్రువ, సప్తర్ష్యాదిమహర్షులను, నల, యుధిష్ఠిరాది పుణ్యశ్లోక పురుషులను నెవరు ప్రాతఃకాలమున లేచి స్మరించెదరో వారికి మరణకాలమున భగవత్స్మరణము కలుగునని భగవంతుఁ డాజ్ఞాపించినాఁడు."

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా ! నేను చతుర్థ మన్వంతరమున జరిగినహరి యవతారమును గురించి నీకుఁ జెప్పితిని. ఇప్పుడిఁక నైదవ, ఆఱవ మన్వంతరములకథను వినుము."

.....

## పంచమ షష్ఠమ మన్వంతరావతారములు

శ్లో॥ తత్రాపి దేవః సంభూత్యాం వైరాజ స్యాభవత్సుతః ।
అజితో నామ భగవానంశేన జగతః పతిః ॥
పయోధిం యేననిర్మథ్య సురాణాం సాధితా సుధా ।
భ్రమమాణోఽంభసి ధృతః కూర్మరూపేణ మందరః

శ్రీభాగ. ౮. ౫అ-౯-౧౦ శ్లో॥

సీ॥ అందు విభుఁడు సంభూతికి వైరాజు
నకుఁ బుట్టి యజితుండు నాఁగ నొప్పె

ఆ॥ నతఁడకాఁడె కూర్మమై మందరాద్రిని
నుదధి జలములోన నుండి మోచె
నతఁడ చువ్వె దివిజులర్థింప నమృతాబ్ధిఁ
ద్రచ్చియిచ్చె నాసుధా రసంబు"

శ్రీమదాంధ్ర భాగవతము.

సాధారణ జనము రహస్యమును దెలిసికొనఁ జాలనట్లు భగవల్లీల లాశ్చర్య జనకములుగను, దివ్యములుగను నుండును. భగవంతుఁ డనుగ్రహించ నంతవఱకు శ్రీహరి యవతార రహస్యము నెవరును దెలియఁ జాలరు.

పరీక్షిన్మహారాజు శుకదేవునితోఁ నిట్లనెను :- ప్రభూ ! చతుర్థ మన్వంతర కథను మీరు చెప్పినారు. ఇప్పుడా తరువాత మన్వంతరములలో నేయే యవతారము లెత్తెనో, వానిలో భగవానుఁ డేయే విశిష్ట కార్యము లొనర్చెనో మీరు నాకుఁ జెప్పవలయును.

శ్రీశుకదేవు. డిట్లనెను :- రాజా చతుర్థ మన్వంతరాధిపతి యగు నుత్తమునకు సోదరుఁడగు దామసుఁడుకలఁడు. ఆతనికి రైవతుఁడను నొక సోదరుడుండెను. ఆరైవతుఁడు తన పుణ్య ప్రభావముచే మన్వంతరాధిపతియయ్యెను. అందువలన దానికి రైవత మన్వంతరమను ఖ్యాతివచ్చెను. ఆతనికర్జునుఁడు, బలి, వింధ్యాధి పుత్రులుదయించిరి. వారు రాజులై భూమినిఁ బరిపాలించిరి. ఆమన్వంతరములో నింద్రుని పేరు విభువు భూతరయాదులు దేవతాగణము, హిరణ్యరేతుఁడు, వేదశిరుఁడు, ఊర్ధ్వబాహువు మొదలగువారు సప్తర్షులైరి. ఆమన్వంతరమందు భగవానుఁడు శుభ్ర మునికి వికుంఠయను పత్నియం దవతరించెను. అందువలన నాతఁడు వైకుంఠుఁడను ప్రసిద్ధినిజెందెను.

పరీక్షిన్మహారాజిట్లనెను :- స్వామీ ! వైకుంఠుఁ డేయే కార్యము లొనర్చినాఁడు? _

శుకదేవుఁడిట్లనెను :- రాజా! ఈవైకుంఠుఁడే రమాదేవి ప్రార్థనమున నీమె సంతోషము కొఱకు సర్వోత్తమమగు వైకుంఠ లోకమును నిర్మించెను. సమస్తలోకములును వందన మొనర్చు లోకము నాతఁడు సృజించెను.

అంత శౌనకుఁడిట్లు ప్రశ్నించెను :- సూతా! వైకుంఠలోక మనాది గదా! దీని రచనముయొక్క అభిప్రాయమేమి? అది యెన్నఁడును లేకపోవునదికాదు. అది నిత్యము. అట్టియెడ వైకుంఠ మును భగవంతుఁడు రచించుటేమిటి?

అంత సూతుఁడిట్లనెను :- మహానుభావా! వైకుంఠము నిత్య మైనదే. దానిలో మహావిష్ణు వహర్నిశలుండి లోకాతీత దివ్యక్రీడ లొనర్చుచుండెను. అచ్చటి లీలల నూహించుట మానవ బుద్ధి కతీత మైనది. ఈవైకుంఠమును భగవానుఁ డావైకుంఠమునకు, ప్రతి మూర్తిగా నొనర్చెను. ఏలయనఁగా దివ్యవైకుంఠములోని లీలాస్వా దనమెట్లు జరుగునో చూపించవలయునని అట్లొనర్చినాఁడు. ఆ దివ్యతలోను, నిత్యతలోను వ్యాఖ్యాతమేమియు నుండదు. కేవలము భక్తాను గ్రహార్థములోక వల్లీల నొనర్చుటకు భగవానుఁ డీవైకుంఠ మును గల్పించినాఁడు. జయ విజయులకు శాపమీ వైకుంఠములోనే జరిగినది. హిరణ్యకశిపుఁడు తన తమ్ముని జంపినాఁడని పగ తీర్చుకొనుటకై యీవైకుంఠమునకే పోయెను. దానికి శ్రీహరి భయ పడి యాతని హృదయమునఁ బ్రవేశించెను. స్వామీ! ఇదంతయును భగవానుని వినోదము మాత్రమే కాకున్న నాతనికి భయమేమిటి?

ఆతని పార్షదులకు శాపమీయఁగల వారెవరు ! ఇదంతయును నాతని భక్తులపైఁ గృపయే. ఈ కౌతుక మొనర్పకున్న నాతని భక్తులకు మనోరంజనమెట్లు కలుగఁ గలదు ? ఎవరి చరిత్రలను విని వారు నవ్వుచు, నేడ్చుచుఁ బ్రేమ మగ్నులయ్యెదరు. వైకుంఠ భగవానుని లీలాదిగ్దర్శనము జయవిజయ శాపప్రసంగమున వర్ణింపబడినది. ఇప్పుడిఁక నాఱవ మన్వంతర కథను వినుఁడు"

శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! ఆఱవ మన్వంతరమున కధిపతి చక్షుషుని కుమారుఁడు చాక్షుషుఁడు. ఆతనికిఁ బురు, పురుష, సుద్యుమ్నాదులు పుత్రులైరి. ఆతని వంశజులీ పృథివికి రాజులై శాసించిరి. ఆమన్వంతరమున కింద్రుఁడు మంత్రద్రుముఁడు. ఆప్యాదులు దేవతాగణము, హవిష్మంతుఁడు, వీరకాదులు సప్తర్షులైరి. ఈ మన్వంతరమందు భగవానుఁడు వైరాజుని పత్నియగు సంభూతి గర్భమున నవతరించి 'అజితుఁడ'ను పేరవిఖ్యాతుఁడయ్యెను."

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను :- "ప్రభూ ! యీయజిత భగవానుఁడే విశేష కార్యము నొనర్చినాఁడు."

నవ్వి శుకమహర్షి యిట్లనెను :- "రాజా ! బహురూపములను ధరించు నీ భగవానుని లీలల విషయమడుగకుము. ఈతఁడు చెప్పుటకు వీలుకాని లీలల నొనర్చెను. రవిక, చీరె, బులాకి మొదలగునవి ధరించి మగవాఁడాడుది యయ్యెను.

అంత రాజాశ్చర్యముతో నిట్లనెను :- :- "స్వామీ ! పురాణ పురుషుఁడగుఁ బ్రభువు మగవాఁ డాడుదిగ నేల యైనాఁడు ?"

అంత శుకుఁడు నవ్వుచు నిట్లనెను :- "రాజా! ఈతనికొక రూపముండినఁ జెప్పవచ్చును. ఈతఁడు పురుషుఁడు కాఁడు, స్త్రీయునుగాఁడు, నపుంసకుఁడునుగాఁడు, పశువుగాఁడు, పక్షి కాఁడు, మనుష్యుఁడు కాఁడు, దేవతయును కాఁడు. ఎట్టివాఁడో చెప్పుటకు వీలులేదు. ఇట్లే కొన్ని విపరీతములు కలవు :

పరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ! చీరెలు రవికెలు ధరించుట కాతఁడే లీలల నొనర్పఁదలఁచినాఁడు ?"

శ్రీశుకుఁ డిట్లనెను:- "రాజా! ఈతఁడు దేవతల కమృతము నొసంగుటకును, లక్ష్మిదేవి నవతరింపఁజేయుటకును సముద్ర మంథనమును గావించెను. ఇది యొక కుతూహల పూర్ణమగులీల. ఇందొక్క యవతారముతోఁ బనిజరుగలేదు. నాలుగు నాలుగవతారము లొక్కసారిగా ధరింపవలసి వచ్చెను. స్త్రీయగుట అట్లుండుము. కూర్మమైనాఁడు. వైద్యుఁడైనాఁడు.

అత్యంతాశ్చర్యముతోఁ బరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ! ఒక్కసారిగా నాలుగవతారములా ? అయితే యీ సముద్రమంథన లీల చాల యద్భుతముగ నుండియుండును. కృపతో దీనిని విస్తారముగ నాకుఁజెప్పుఁడు. భగవానుఁడేలఁగూర్మమైనాఁడు ? సముద్ర మంథనమేలఁ జేయవలసి వచ్చినది. సముద్రమెట్లు మథింపఁబడినది ? ఎవరెవరు మథించిరి ? అమృతమును భగవానుఁడు దేవతలకే యేల నొసంగెను ? లక్ష్మిదేవి యెచ్చటికిఁ బోయినది ? భగవానుఁడు స్త్రీ కావలసిన అవసరమేమున్నది ?"

అంత శుకదేవుఁ డిట్లనెను :- "మహారాజా ! దీనికి సంక్షేప సమాధాన మేమనఁగా భగవానున కేది యిష్టమైన నారూపము వచ్చును. స్థలముననుండి జలములలో నుండిన నెట్లుండునో చూత మని కచ్ఛపమై యుండవచ్చును. మాటిమాటికినిఁ బురుషుఁడై లక్ష్మి దేవియొక్క కసరులనువిని స్త్రీయైన నెట్లుండునో చూతమనుకొనెను దీనిలోనెంతో మోహకత కలదు. దెలిసిన వన్నియునుగలవు. తెలిసి తెలిసి తెలియనట్లుగఁ గ్రీడలొనర్చుచుండును. ఇదియే ఆతని భగవ తత్వము, నీ వడిగిన సముద్రమంథన వృత్తాంతమును నేను సంక్షే పముగఁ బ్రత్యుత్తర మొసంగెదను. లక్ష్మి యెచ్చటికి పోయినదో, లక్ష్మిదేవి కొఱకేల సముద్రము మథింపఁబడినదో ముందుగా దీనికిఁ బ్రత్యుత్తర మొసంగెదను. ఈప్రసంగమందు భగవానుఁడు నాల్గవతా రములు అజిత, కచ్ఛవ, మోహినీ, ధన్వంతరి కథలు రాఁగలవు. దీనిని నీవు సావధానుఁడవై శ్రవణ మొసర్చుము.

## ఇంద్రాపరాధమున త్రిలోకములు శ్రీహీనములగుట

శ్లో॥ యదా దుర్వాసనః శాపాత్సేంద్రా లోకాస్త్రయో నృప ।
నిఃశ్రీకాశ్చాభవంస్తత్ర నేశురిజ్యాదయః క్రియాః ॥
తతో బ్రహ్మ సభాం జగ్ముర్మేరోర్మూర్ధని సర్వశః ।
సర్వం విజ్ఞాపయాఞ్చక్రుః ప్రణతాః పరమేష్ఠి నే ॥

శ్రీభాగ. ౮ స్కం. ౫ అ. ౧౬-౧౮ శ్లో.

క॥ దుర్వాసు శాపవశమున
నిర్వీర్యత జగములెల్ల నిశ్శ్రీకములై
పర్వతరిపుతోఁగూడ స
పర్వములయి యుండె హతసుపర్వావళులై॥

క॥ సురపతి వరుణాదులతో
సురముఖ్యులు గొందఱరిగి సురశైలముపై
సురనుతుఁడగు నజుఁగనియా
సుర దుష్కృతిఁ జెప్పి రపుడు సొలయుచు నతులై॥

శ్రీమదాంధ్ర భాగవతము

ప్రపంచములో ధనమదము, ఐశ్వర్యమదము, జాతిమదము, రూపమదము, యౌవనమదము, అధికారమదము మొదలైనవెన్నియో

మదములుకలవు. వీనిలో ధనైశ్వర్యమదములన్నిటికంటెఁ జెడ్డవి. ఐశ్వర్యమదమున మానవుఁడెవరిని లెక్కఁచేయఁడు. అందఱ నవ మానించును. తానే సర్వశ్రేష్ఠుఁడనుకొనును. ఈమదమత్యధిక మైనప్పుడది రోగరూపమై సమాజమును బీడించుచుండును. దీని కొక్కటేమందు.

శా॥ సంపన్నుండొరుఁగాన లేఁడు తనువుఀ సంసారము
న్నమ్మి హిం
సింపఀజూచు దరిద్రుఁడెత్తుపడి హింసింపం డన్యుల
సంపన్నాంధున కంజనంబు వినుమా దారిద్ర్యమూ
హింపగఀ ॥

శ్రీమదాంధ్ర భాగవతము

ఐశ్వర్యమదమత్తుఁడై, మదాంధుడైన వాని గ్రుడ్డికన్నులకు దరిద్రమనునంజనమే పరమౌషధము. మానవుఁడు దారిద్ర్యదుఃఖము ననుభవింపనిది దీనదుఃఖుల కష్టములను దెలిసికొనుటలో నేవిధ మగు సమర్థతయు నుండదు. పురుషార్థముచేఁ బోఁగొట్టుకొనిన లక్ష్మిని మరల బొందుటలో నాతని మహత్వము గోచరించును.

పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుని సముద్రమంథనమును గూర్చి ప్రశ్నించుచు నింద్రునితోసహా త్రిలోకములు శ్రీహీనము లేలనయ్యె నని ప్రశ్నింపఁగా శ్రీశుకుఁడిట్లనెను :- "రాజా! ఇలా వృత వర్షమున సుమేరువను దివ్యపర్వతము కలదు. దానిని దేవ తలును, ఋషులును మునులునుదప్ప మానవులలో నింకెవరును

జూడఁజాలరు అచ్చట దేవతలయొక్క దివ్యాతిదివ్యోపవనములందు సురసుందరులు సర్వదా క్రీడించుచుందురు. అచ్చట భూమి సువర్ణ మయమైనది. అత్యంత సుందర, స్వచ్ఛ, శీతల సలిలములు గల సరోవరములనేకములు కలవు. వానిలో వివిధ కమలములు వికసించి యుండును. వానిగంధము యోజనముల కొలఁది పోవుచుండును. అచ్చటివనోపవన పర్వత ప్రాంతములు శోభయొక్క సాకారస్వరూపములు. వాయువు మనోనుకూలముగ వీచుచుండును. అచ్చట ఋతువు లిచ్ఛానుసారముగ జరుగుచుండును. శ్రమ, క్లాంతి, నిద్ర, తంద్ర, జడత, స్వేదము, రోగము, శోకము మొదలైనవియును వ్యాధులును నచ్చట ననుభవమునకురావు. అచ్చట నందఱును దేవతలవలె విహరించుచుందురు. సుఖముగ నందరును దమ కామవాసనలను బూర్ణము కావించుకొనుచుందురు. సిద్ధ, గంధర్వ, కింపురుష, కిన్నర, గుహ్యక, విద్యాధర, యక్ష, నాగాద్యనేకోపదేవజాతులుకలవు. వీరందఱిలో గంధర్వవిద్యాధరు లతి సుందరులుగ నుందురు. వారిస్త్రీలు నిత్యమును నవయౌవనులుగ నుందురు. వారికెన్నటికిని వృద్ధావస్థలేదు. వారిశరీరముల నుండి స్వేదము, కఫము మొదలగుమలములు వెలువడవు. వారి శరీరమునుండి సదా పద్మగంధము వెలువడుచుండును. వారి కెన్నడును కామక్రీడలందుఁ దృప్తిలేదు. వారెల్లప్పుడును యౌవన మదమున నున్మత్తలై, సంగీతములు పాడుచు నటులిటుఁబక్షులవలెఁ

దిరుగుచుందురు. వనోద్యానములందును, సరస్తటములందును స్వేచ్ఛాను సారముగ విహరించుచుందురు.

ఒకనొక దినమున నొక విద్యాధరకన్య సరోవరతటమం దేకాకిగా నిలుచుండియుండెను. ఆమె తన సౌందర్య కాంతులచే నా వన్యప్రదేశమును బ్రకాశింపఁ జేయుచుండెను. చేతులలోఁగమ నీయ కమలముల యొక్క సుగంధితమాలను ధరించి కామదేవుని బాసిన రతీదేవియా యను నట్లుండెను. ఆమె చేతిలో దివ్యపుష్ప మాలకలదు. ఆ పుష్పగంధలోభముచే నెన్నో భృంగములామెను జుట్టుకొని యెగురుచుండెను. వికసితకమలమను భ్రమచే భ్రమరము లామె ముఖకమల మందు వ్రాలనుత్సహించుచుండెను. ఆమె వానిని గ్రీడార్థముగఁద్రోలుచుండెను. యోజనముల కొలఁది వ్యాపించు నట్లామె చేతిలోని మాలా గంధముండెను. దైవయోగమున నాగంధ ముచే నాకర్షింపఁబడి దుర్వాసమహర్షి అచ్చటకుఁజేరుకొనెను. ఆమె వర్ణము సువర్ణమువలెనుండెను. రక్తకంచుకముపైన నామె నీలపు చీరెను ధరించియుండెను. ఆమె చేతులలోఁ గమలముల మాలను గైకొని యేకాగ్ర చిత్తముతో జలము వైపునకుఁజూచుచుండెను. ఆమె సజీవ సాకార శ్రీగాఁగనఁబడు చుండెను. ముని యామెను గాంచెను గాని, ఆమె మునినిజూడలేదు. ఆమె ధ్యానమునఁ దన్మ యమై యుండెను. ఆయన వద్య సౌందర్యమును గాంచి ముని మంత్రముగ్ధునివలెఁబ్రయాసము లేకయే ఆమెవైపునకు నడచెను. ఆతని చిత్తములోఁ గొంచెముగ జంచలత్వమును గలిగెను, ఇంతలో నామె ధ్యానమును భంగమయ్యెను. వెనుదిరిగి చూడఁగానామెకు

దుర్వాస మహర్షి కనఁబడెను. దుర్వాస మహర్షినిఁ జూడఁగనే ఆమె నిర్ఘాంతపోయి, భయకారణమున నామె యానందమంతయును విలీన మయ్యెను. భయభీయ మృగమువలె నామె మునివైపునఁ జూడక గడగడఁగంపింపఁజొచ్చెను. ఆ బాల తన్నుఁగాంచి మిక్కిలి భయ పడినదని ముని గ్రహించెను. ఆతఁడామె భయమును బోఁగొట్టు టకై యిట్లనెను :- "సుందరీ! నీవీ మాలను చక్కఁగాఁ గ్రుచ్చితివి. దీని గంధ మతి మనోహరముగ నున్నది. నీవీ మాలను నా కొసం గెదవా ?"

ముని యొక్క యీ సరళవాక్కులను వినఁగానే బాలకు భయము కొంచెము తగ్గెను. మునికి శ్రద్ధాభక్తులతో మాలను సమ ర్పించి, మునిచరణములపైఁబడి మోఁకరించి ప్రణామముగావించి వెంటనే అచ్చటినుండి వెడలిపోయెను. ముని కొంచెముసేపటివఱ కామె వైపుననే చూచుచుండెను. అంతనాతఁడు ప్రకృతిస్థుడై తన చిత్తవృత్తి నటనుండి తొలగించెను. విద్యాధరి యొసంగిన మాల నాతఁడు తన జడలలోఁదురుముకొని, అవధూతవృత్తిచే నచ్చటి నుండి వెడలిపోయెను.

మునివరుఁడానందమగ్నుఁడై యున్మత్తునివలెఁ బోవుచుండు నంతలో నెదురుగా నైరావతము నెక్కి యింద్రుఁడటనుండి వచ్చు టను గాంచెను. ఆతని శిరస్సున నమృత స్రోతయగు శ్వేత ఛత్రముండెను. అప్సరసలును, గంధర్వులును నాతని గుణములను గాన మొనర్చుచుండిరి. త్రైలోక్య శ్రీ సంపన్నుండగు నింద్రుఁ డైరావతమునఁ గూర్చుండియుండెను. దుర్వాసుఁడు దేవేంద్రునిఁ

గాంచి యాతని సన్మానించుటకై తన జడలనుండి యా మాలను దీసి వానిపైకి విసరెను. దేవేంద్రుఁడాతని వైపు శ్రద్ధగాఁజూడలేదు. ఆతఁడిట్లనుకొనెను :- "చాలమంది ఋషులును, మునులును నా ముంగల నిలుచుండి నన్ను స్తుతించుచుందురు. పూలమాలలను వేయుచుందురు. నేను దేవతలకును, ఋషులకును, మునులకును, సమస్త ప్రాణులకును ప్రభువును. నన్ను దర్శించుటయును, గానుక లొసంగుటయును, సన్మానించుటయును, నందఱకును కర్తవ్యము" అని యిట్లనుకొని యాతడా మాలకేమియును మహత్వ మొసంగ లేదు. చేతితోఁ దీసికొని ఐరావతము యొక్క శిరస్సుపై నుంచెను.

ఏనుఁగులయొక్క స్వభావ మేమనఁగా నేదైనఁ దలమీఁద నుంచినచో దానిని దొండముతోఁ దీసికొనును. ఐరావతమును నామా లను దొండముతోఁ దీసికొని పాదములతో ద్రొక్కివైచెను. అది పశువుగదా! ఈ మాలలో నొక మధుర సుఖదస్మృతి పూర్ణమగు నితిహాసమిమిడియున్నదని పాపము దానికేమి తెలియును ?"

దుర్వాసుఁడు దుర్వాసుఁడే. ఆతఁడీ యింద్రుని యీ యవి నయమును, నుపేక్షను నెట్లు సహింపఁగలఁడు ? క్రోధోద్దీప్తుఁడై ఆతఁడు శాపమునొసంగెను :- "ఇంద్రా ! నీవు నీ శ్రీనిఁజూచుకొని మిక్కిలి గర్వించుచున్నావు. హొమ్ము, నేఁటితో నీసిరి నశించుఁగాక! నీ యీ త్రైలోక్యసంపద నశించుగాక !"

ఇది వినఁగానే యింద్రుని సమస్తమదము చూర్ణమయ్యెను. శీఘ్రముగ నైరావతమునుండి దుమికి దుర్వాస మహర్షి చరణము లపైఁబడెను."

తన చరణములపై శచీపతి దేవేంద్రుఁడు పడుటను గాంచి హృష్టహాస మొనర్చుచు నవ్వుచు ముని యిట్లనెను :- "శచీపతీ ! చూడుము. ఇచ్చటనున్నది బెల్లముకాదు, చీమలు పీకుకొని తినుటకు, ఇది యన్య మునులహృదయము కాదు. కాళ్ళమీఁదఁ బడఁగానే కరిగిపోవుటకు, నీవది చేయుము, ఇదిచేయుము, పాదముల మీఁదఁ బడుము, ముక్కును నేలకు రాచుకొనుము. నా నోటినుండి వచ్చినదేదో వచ్చినది. అది వజ్రలేపమని నీవు తెలిసికొనుము. నావాక్కు శిలాక్షరము. నీవైశ్వర్యమదమందు మదోన్మత్తుఁడవైతివి. నీకిదే సర్వోత్తమమగు నౌషధము. పొమ్ము. చేసినదాని ననుభవింపుము."

ఇట్లు పలికి, ఆతని ప్రత్యుత్తరమును నిరీక్షింపకయే ముని వెడలిపోయెను. శ్రీహీనుఁడైన యింద్రుఁడు స్వర్గమునకుఁ దిరిగి వచ్చెను. అచ్చట నాతనికన్నియును నిస్తేజముగఁ గనఁబడెను. స్వర్గములోని యప్సరసలు కాంతిహీనులై, కురూపలై నిస్తేజలై కనఁబడిరి. దేనినిఁ గాంచినను నది శ్రీ, తేజైశ్వర్య, ప్రభా, కాంతి హీనములై తోఁచుచుండెను. ఇంద్రుని యానందమంతయును నశించెను. ఆతఁడు సదా చింతితుఁడగుచుండెను.

అసురులవలన శుక్రాచార్యునకు సమస్తవృత్తాంతము తెలిసెను. ఈసుఖద సమాచారమును వినగానే వారికి రోమరోమము పులకరించెను, వారి యానందమునకు మేఱలేకుండెను. వెంటనే యా యసురులు సేనాసమేతులై స్వర్గముపైకి దండెత్తిరి, శ్రీహీనులగు

## సురలతో బ్రహ్మహరిచరణ సన్నిధిని

శ్లో॥ ఇత్యా భాష్య సురాన్వేధాః సహదే వైరరిందమ।
అజితస్య పదం సాక్షాజ్జగామ తమసః పరమ్॥
తత్రా దృష్ట స్వరూపాయ శ్రుత పూర్వాయ వైవిభో।
స్తుతిమ బ్రూద్దైవీభిర్గీర్భి స్త్వవహితేంద్రియః॥

శ్రీ భాగ. ౮ స్కం. ౫ అ. ౨౬, ౨౫ శ్లో॥

క॥ వరదునిఁ బరము జగద్గురుఁ
గరుణా పరతంత్రు మనము గనుఁ గొనదుఃఖ
జ్వరములు సెడునని సురలకు
సరసిజ జని చెప్పి యజితు సదనంబునకున్॥

వ. తానును దేవతా సమూహంబును నతిరయంబున జని వినయంబునఁ గానంబడని యవ్విభు నుద్దేశించి దైవికంబులగు వచనంబుల నియతేంద్రియుండై యిట్లని స్తుతియించె."

-శ్రీ మదాంధ్ర భాగవతము.

తనదర్పముచేఁ దలయెత్తుకొని యెవ్వరిని లక్ష్యపెట్టకుండిన నాఁడు మానవుఁడు శ్రీహీనుఁడగును. ఆతఁడే మరల వినీతుఁడైనచో సమస్త సద్గుణములు వచ్చివానిని వరించును. దేవ, బ్రాహ్మణ, శ్రేష్ఠ, జ్యేష్ఠులకే శిరస్సు వంగదో అట్టిదానికి పాపప్రాయశ్చిత్తము దుర్దశకలుగుటయే.

ఒకకథ కలదు. ఒకానొక ధనికుఁడు చాలామంది తన సేవకులతో నౌకమీఁద నదిని దాటుచుండెను. ఆనౌక మీఁదనే తలను బోడిచేసుకొని, కాషాయ వస్త్రములను ధరించిన సన్న్యాసియును గూర్చుండెను. సన్న్యాసి వర్ణము గౌరవర్ణము శిరస్సు విశాలము. బోడిచేసిన ఆతని శిరస్సు అద్దమువలె మెఱయుచుండెను. ఆతఁడు మెదలక తలవంచుకొని కూర్చుండియుండెను. ఒకతుచ్ఛుఁడు ధనికుని నానందింపఁ జేయుటకై వివిధకార్యము లొనర్చుచుండెను. అందఱను నవ్వించుటకై ఆతఁడు తనచెప్పును దీసికొని సన్న్యాసి శిరస్సునందు మెల్లఁగాఁ గొట్టుచుండెను. దీనినిఁగాంచి అందఱును నవ్వుచుండిరి. 

ఆ ధనికునికిది నచ్చలేదు. ఆతఁడా తుచ్ఛుని గసరి ఆ మహాత్మునివైపునకు ధ్యానముతోఁ జూచెను. అట్లుధ్యానముతో జూడఁగా నాతఁడాతనిని గుర్తించి, పాదములపైఁ బ్రణామము కావించి యిట్లనెను:-"స్వామీ! మీరీతుచ్ఛుని దౌష్ట్యమునకు క్షమింపవలయును నేనుమిమ్ము గుర్తించితిని. మీరు ఫలానిదేశపురాజులు ఒకసారి నేను మీదేశమునకు వ్యాపారార్థము వచ్చితిని. మీరు నాకు మిక్కిలి సహాయ మొనరించితిరి." 

ఇదివిని మహాత్ముఁ డిట్లనెను:-"శ్రేష్ఠిగారూ! దీనిలోఁ బెద్దగా భావించుటకేమున్నది? ఈతఁడు నాకుపకారమునే చేసినాఁడు. ఈ రస్సు సింహాసనము మీఁదఁగూర్చుండినప్పుడెవరికిని వంచదు. ఎవ్వరికిని నతమస్తకుఁడు కానప్పుడు చెప్పుదెబ్బలు తినుటయే ప్రాయశ్చిత్తము. ఈతఁడు నాపాపములకుఁ బ్రాయశ్చిత్త మొనర్చి

నాఁడు. సంపన్నాంధన కంజనంబు వినుమాదారిద్ర్యమూ హింపగన్ ఇప్పుడు నేను సాధు సజ్జనులకు నతమస్తకుఁడనై, ప్రాణిమాత్రునకుఁ బ్రణామ మొనరింపుచు భగవత్స్తుతి యొనర్చుచు నాపాపములనుఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనుచున్నాను.

శ్రీశుక దేవుఁడిట్లనెను:-"రాజా! శ్రీ హీనులైన దేవగణము పరస్పరము కలిసికొనియుఁ దమ కుద్ధారమెట్లో నిర్ణయించుకొనఁ జాలక పోఁగా వారందఱును గలిసి సుమేరు శిఖరముననున్న బ్రహ్మ సభకుఁబోయిరి బ్రహ్మకు ముఖ్య నివాసస్థానము బ్రహ్మలోకము. కానీ దేవతలయొక్కయు త్రిలోకవాసుల ప్రార్థనముల వలనను, ప్రజలయొక్క సుఖదుఃఖములను వినుటకై ధ్రువలోకమునకుఁ గ్రిందనున్న సుమేరు శిఖరము మీఁదఁ దనసభలోనికి వచ్చి కూర్చుండును అచ్చటనుండియే దేవతలయొక్క సుఖదుఃఖములను వినును. దేవతలు బ్రహ్మసభకుఁబోయి, ముందుగా బ్రహ్మపాదములకు సాష్టాంగ వందనమును గావించి మొదటినుండి చివరవరకు తమ వృత్తాంతమును జెప్పుకొనిరి.

ఇంద్ర, వరుణ, కుబేరాది దేవగణమంతయును గాంతి హీనులై, నిస్సత్త్వులై తేజోరహితులైరి. అందువలన వారికిదుర్దశయు దుఃఖమును గలిగినట్లు బ్రహ్మ తెలిసికొనెను. దేవతలరాజ్యమును, ధనైశ్వర్యములను నసురులందఱును లాగుకొనిరి. సురలకు పరాభవమును నసురులకు వృద్ధియును గలుగుచుండెను దేవతలటుని టుఁదిరుగుచుండిరి. అప్పుడాబ్రహ్మ యేకాగ్ర చిత్తుఁడై పరమపురు

షండగు శ్రీమన్నారాయణుని ధ్యానించి అందఱను సంబోధించుచు నిట్లనెను:-"దేవతలారా! మీకు నావలనఁ గావలసిన పనియేమి? నేను మీకేమి ప్రియకార్యమొనర్పఁగలయును?

దేవతలిట్లనిరి:- "స్వామీ! మేము గొప్పవిపత్తులోఁబడి యున్నాము. మేమీ దుఃఖమునుండి బయటపడుట కింకొక యుపాయ మేమియునులేదు. మీరు త్రిలోకాధిపతులరు. బ్రహ్మాండాధీశ్వరులు. నిగ్రహానుగ్రహ సమర్థులరు. మేము మీశరణుజొచ్చితిమి కావున మమ్మీవిపత్తునుండి కాపాడుఁడు."

ఇదివిని నవ్వుచు బ్రహ్మ గంభీర వాక్కులతో నిట్లనెను:- "దేవతలారా! మీరు భ్రమవశమున నన్ను జగత్కర్తగను, బ్రహ్మాండస్వామిగను భావించుచున్నారు. నేను సృష్టికర్తగ నెన్నఁబడుచున్నాను. శివుఁడు సంహారకర్తగ భావింపఁబడుచున్నాఁడు. మీరెవరినిఁ త్రిలోకముల కధీశ్వరునిఁగ భావించుచున్నారో ఎంత వఱకు చెప్పఁగలను? అసురరాక్షస, మనుష్య, తిర్యగ్వృక్ష స్వేదజాది జీవులకు ప్రభువైన వానికంశజులే, కావున నాయన లారా! నన్ను శరణువేడుటచే నేమి ప్రయోజనము కలదు? మన మందరమును గలిసి యాతని శరణమునకుఁ బోవుదము."

దేవతలిట్లనిరి:- "స్వామీ! శ్రీహరి సమదర్శి. ఆతనికి మేమెంతో అసురులంతే, స్వర్గముపై నసురాధిపత్యముండిన శ్రీహరి కేమిబాధ? ఆతనికిచ్ఛలేకున్నచో దైత్యులు మనలను జయింపఁ గలరా?"

ఇదివిని బ్రహ్మయిట్లనెను:-"నాయనలారా! మీరు చెప్పునది యథార్థమే. అతని దృష్టిలో నెవఁడును జెడ్డవాఁడును లేఁడు, ఉపేక్షణీయుఁడును లేఁడు. అయినను నాతఁడు జగదుత్పత్తి స్థితి, లయముల కొఱకై సమయానుసారముగఁ గ్రమముగా రజోగుణమును, సత్వగుణమును, తమోగుణమును స్వీకరించును. సృష్టింప వలసివచ్చినచో నాతఁడు నాయందును నాయాంశముచేఁ బ్రజాపతులకును, మనువులకును, ఋషులకును సృజనశక్తినిఁ బ్రసాదించును. సృజించిన దానిని రక్షింపవలసివచ్చినచో మనుపుత్రుల యందును, రాజులయందును, దేవతలయందును దనశక్తిని వృద్ధి గావించుచు స్వయముగ నవతార రూపమున నవతరించుచుండును. ప్రళయ మొనర్ప వలసినప్పుడు రుద్రరూపమును ధరించును. యక్ష, రాక్షస, భూత, ప్రేత, పిశాచ, జ్వర, రోగ, అనావృష్ట్యాది రూపములచే నీరసించిన సృష్టిని సంహరించును ఆవశ్యకతాను సారముగ నభిమానముచే సురబలమును, నొకప్పుడసురబలమును నభివృద్ధి గావించును."

దేవత లిట్లనిరి :- "స్వామీ! ఇప్పుడసురుల కనుకూలమగు కాలము. భగవానుఁడువారికే తనబలమును బ్రసాదించినాఁడు.అందు వలననే వారి కభ్యుదయము, మనకుపరాభవము కలిగినది. త్రైలోక్య లక్ష్మి మనలను విడిపోయినది. అసురలను వరించినది. ఇప్పుడు మన మాటను భగవానుఁడు వినను గూడ వినఁడు.

అంత బ్రహ్మ యిట్లనెను :- "నాయనలారా! అన్నిటికినిఁ గాలమనునది యున్నది. కాల స్వరూపుఁడగు శ్రీహరి అసమ

యమున నేకార్యమును జేయుఁడు. మీకు మీ ధనైశ్వర్యము లందత్యధిక గర్వము కలదు. గర్వహారియగు గోవిందుఁడు మీ గర్వము నణంచుటకై మీకు బరాజయము కలిగించినాఁడు. కాకున్న నీసమయమున నసురులు వృద్ధిపొందవలసిన సమయముకాదు. ఇది ప్రాణుల కభ్యుదయమగు కాలము. సత్వగుణమును స్వీకరించుఁ బ్రభువు సృష్టిని రక్షించుటయందుఁ దత్పరతవహించి యున్నాఁడు ఇది ఆతఁడు పాలింప వలసిన యవసరము. మీరు మీయపరాధము నకై భగవంతుని క్షమింప వేఁడుఁడు ఆతఁడవశ్య మేదో ఒక విజయోపాయమును జెప్పఁగలఁడు."

దేవతలిట్లనిరి :- "స్వామీ ! మీయాజ్ఞ ననుసరించెదము. మేము మీకధీనులము. మమ్ములను మీరేది చేయమనిన నవిచార ముగఁ జేసెదము."

అంతబ్రహ్మ యిట్లనెను :- "మనమందఱమును గలిసి యాపరాత్పర ప్రభువును, సంపూర్ణ జగద్గురుఁడగు నా శ్రీహరిని శరణు వేఁడుదము. మనము సర్వాత్మ భావముచే నాతనిశరణు వేఁడుచో నాతఁడవశ్యము మనల నుద్ధరింపఁ గలఁడు మనల నీసంకటమునుండి రక్షింపఁ గలఁడు. ఏలయనఁగా నాతఁడు దేవతా శుభ చింతకుఁడు, సుహృదుఁడు. మనలను దన శరణాగతులగ భావించి, అవశ్యము మనకుఁ గల్యాణమొనర్పఁ గలఁడు."

శ్రీ శుక దేవుఁడిట్లనెను :- "రాజా ! బ్రహ్మయొక్కయీ యభిప్రాయము మందఱకును రుచించెను. అందఱును నాతని

యభిప్రాయమును సహర్షముగ సమర్థించిరి. కావున వారి నందఱను వెంటఁబెట్టుకొని లోకపితామహుఁడగు బ్రహ్మ అజితుని దివ్యసత్యయ పరమధామమగు క్షీరసాగర సమీపమునకుఁ బోయిరి. అచ్చటికిఁ బోయినను నజితేంద్రియులకును విషయలోలుపులకును భగవద్దర్శనము కాదు. కావున నందఱును సావధానులై, సమస్తేంద్రియములను జయించి యాసర్వ వ్యాపకుఁడగు శ్రీహరిని దివ్య స్తోత్రములచే స్తుతించిరి."

సూతుఁడిట్లనెను :- "మునులారా! భగవంతుని విశ్వ విరాడ్వర్ణముగల నాబ్రహ్మస్తుతి చాలా యద్భుతమైనది. దానిని నేను యథాస్థానమున నుల్లేఖించేదను. ఇప్పుడుఁ మీరందఱును దరువాత కథను వినుఁడు."

అంతశౌనకుఁడిట్లనెను :- "మంచిది, సూతా! నీవు కథను జెప్పవలెయే యిది. బ్రహ్మస్తుతిని విని భగవంతుఁడు కఱిగినాఁడా లేదా? దేవతలకు తనదుర్లభ దర్శనము నొసంగెనా లేదా?"

అంత గద్గద కంఠముతో సూతుఁడిట్లనెను:- "స్వామిదయా సాగరుఁడు పరమ కారుణికుఁడు. కపటముగ స్తుతించినను నాతఁడు ప్రసన్నుఁడగును. అట్టివాడు వేద గర్భుఁడగు బ్రహ్మ యింద్రియములను జయించి సమాహిత చిత్తముతో భగవంతుని ననుగ్రహింపఁడా? కావున నాతనికి దర్శనమై తీరవలయును భగవానుఁ డెట్లు ప్రకట మైనదియును, ప్రకటమై దేవతల కాతఁడెట్లు మేలొనరించి నదియును, మీకు జెప్పెదను. మీరు సమాహిత చిత్తులరై యీప్రసంగమును వినుఁడు."

# సురలకు భగవంతుని సమ్మతి

శ్లో॥ హంత బ్రహ్మన్నహో శంభో హే దేవా మమ భాషితమ్ ॥
శృణుతావహితాః సర్వే శ్రేయో వః స్యాద్యథా సురాః ॥
యాత దానవదైతేయైస్తావ తావత్సంధిర్విధీయతామ్ ।
కాలేనాను గృహీతైస్తైర్యావద్వోభవ ఆత్మనః ॥

శ్రీభాగ ౮ స్కం, ౬ అ. ౧౮, ౧౯ శ్లో ॥

క॥ ఓనలువ యోసురేశ్వర
యోనిటలతటాక్ష యోసురోత్తములారా
దానవుల తోడ నిప్పుడు
మానుగఁ బోరామి గలిగి మనుటే యొప్పున్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

శ్రీరాముడు సీతోద్ధారమును, రావణ వధయును వానర భల్లూకముల సహాయమున నొనర్చెనని మీరెఱుఁగుదురు. ఎవని యొక్క భ్రుకుటీవిలాసమున నసంఖ్యాకములగు బ్రహ్మాండము లుత్పన్నమగుచు లీనమగుచుండునో అట్టి వానికన్యసహాయమేల ? ఎవడు సర్వజ్ఞుఁడును, సర్వేశ్వరుఁడునై యున్నాడో, ఎవనిసత్తా లేక ఒక్క ఆకైనఁ గదలదో అట్టివాని ఆదిశక్తియును జగదంబయు నగు జానకిని రక్షించుటకే ఋక్ష వానరులు కావలెనా? కాని ఆతఁడు కౌతుకప్రియుఁడు. ఆతఁడు లీలనొనర్ప నిచ్ఛించినప్పు

డిట్టివి చేయుచుండును. ఏడ్చుచునేడ్చుచు సుగ్రీవునికడకుఁబోయి, నాప్రియయొక్క జాడ కనుగొనుమని శరణుజొచ్చితిననెను. ఆతనికిసందేహము జనింపఁగాఁ దాఁనాతని బలమును పరీక్షించెను. నల్దిక్కుల నుండి వానరభల్లూకములను ప్రోవు జేయు వఱకును నేడ్చుచు సీతావిరహమునఁగన్నులనీరు గార్చుచు, సుగ్రీవుని కొఱకు ప్రతీక్షించుచు గుహలలోనివసించుచుండెను. ఈ నరనాట్య మంతయును భగవానుఁడు భక్తులనిమిత్తము చేయుచుండును. ఇదే విధముగ దేవతాకారమును స్వయముగ భగవంతుఁడు తన సంకల్పః మాత్రముచేత నేచేయఁగలఁడు కాని కుతూహలము కొఱకు సముద్రమంథనము కొఱకై అందఱను ప్రేరేపించెను.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా! దేవతలుపూర్ణభక్తిభావముతో నార్తులై అచ్యుతుని శ్రద్ధాపూర్వకముగ స్తుతింపఁగా భక్తవత్సలుడగు భగవానుఁడు వారిననుగ్రహించుటకై అచ్చటనే ప్రకటనమయ్యెను, ఆసమయమున నాతని తేజము సహస్రసూర్యులతో సమానముగనుండెను. ఆతఁడు తనకాంతులచే దశదిశలను దేదీప్యమానముగ నొనరించెను. భగవంతుని యీ యద్భుత తేజమువలన వారికిఁగన్నులు మిరుమిట్లుకొలిప వారు భగవద్దర్శన మొనర్చుటయట్లుంచి, దిక్కులను పృథివ్యప్తేజోవాయుఃఆకాశములను దమ్ముఁ జూఁడజాలకుండిరి.

అంతఁపరీక్షిన్మహారాజిట్లనెను :- "అయితే స్వామీ? దేవతలందఱును గ్రుడ్డివారైరా?"

నవ్వి శుకమహర్షి యిట్లనెను :- "రాజా! గ్రుడ్డివారుకాలేదు కాని అధికప్రకాశమగుటచే నందఱకన్నులలోని జ్యోతి యామహా జ్యోతిలో విలీనమైనది కేవలము దేవాధిదేవుడగు మహాదేవుఁడును బ్రహ్మయును నాతనిరూపమును దర్శించిరి. ఆసమయమున భగవంతునిశోభ అవర్ణనీయముగ నుండెను. అలంకారముతో నున్న శ్యామసుందరుడు చీకటిమ్రానువలె శోభించుచుండెను. మరకతమణివలెను, వర్ష కాలీనదుర్వారము పలెను. అతసీపుష్పమువలెను, నీలకమలమును బురదించుచు, మయూర కంఠమును దిరస్కరించుచు, వజల ధరమువలె, నీలాంజన శిఖరసన్నిభుఁడైయున్న నాతనిని విశాల శుద్ధశ్రీవిగ్రహము తనవైపునకు హఠాత్తుగ నాకర్షించెను. పూర్ణచంద్రునివలె వికసించిన ముఖముపైఁగమల కేసరములవలె నత్యంత స్నిగ్ధలావణ్యయుక్త అరుణనైనములు తమ శీతల రశ్మిల ద్వారా శరణాగతులకుసాంత్వన ప్రదాన మొనర్చుచుండెను. త్రైలోక్యపావనమును, జగదానందకర మునకు భగవానుని సుందర శరీరము పరమపావనమగు పీతాంబరముచే నావరింపబడియుండెను. ఒక పీతాంబరమును గట్టుకొనియుండెను. మఱి యొక పీతాంబరమును భుజము మీద గాలికెగురుచు వ్రేలాడుచుండెను మేలిమి బంగారువలె మెఱయుచు చుండిన నాతని పీత వస్త్రము భగవంతుని నీలవర్ణ శరీరముపై మేఘమండలముపైని మెఱుగు దీఁగవలె మెఱయు చుండెను ఆతని అంగప్రత్యాంగము లన్నియునుసుందరములు, బలమైనవి, సుఖకరమైనవి. సంపూర్ణ

శోభసంయుక్తములు. ఆతని సుమధురమనోహరముఖమున నయనములు, భ్రుకుటి అపాంగము, పక్ష్మకపాలములు, గండస్థలము ఒకదానికంటె నొకటి చిత్తాకర్షముగను, ఆనందముగనుండెను. ఉంగరములు తిరిగిన నల్లని ముంగురులపై మనోహరమకుటము తళ తళ మెఱయుచుండెను. కర్ణముల కమనీయ కుండలముల కాంతిచే గపోలములశోభ అత్యంతసుఖకరముగనుండెను. జానులంబిత విశాల భుజములందు కుండల కేయూరములును, బాజుబందులును నత్యంత శోభనొసంగుచుండెను. వక్షస్థలమందుకౌస్తుభమణి అటునిటు క్షణక్షణమును గదులుచుండెను. అది యచ్చటనుండిన లక్ష్మి చంచలయని దోఁచుచుండెను. రంగువిరంగులు కల వనమాల తనశోభను దశదిశలును నిరంతరము వెదఁజల్లుచుండెను. కటియందుగ ఖణక్వణ ధ్వనులొనర్చు మొలత్రాడు తన చాకచక్యముచేఁ బీతాంబరము లోపల దాగి నితంబ ప్రతిబింబమును వ్యక్తము చేయుటకు వ్యగ్రత జూపునట్లుండెను. సుందరములును, విశాలములునగు చతుర్బాహువులయందు శంఖచక్ర గదాపద్మములు శోభించుచుండెను. భగవంతుని యిట్టి త్రైలోక్య వందిత రూపమునుగాంచి మిగిలిన దేవతలందఱును స్పృహలేకయుండిరి కాని దేవాధిదేవుఁడును మహాదేవుఁడును బ్రహ్మయును భూమిపైఁబడి సాష్టాంగ ప్రణామము కావించెను. అన్ని దిక్కులనుండియుఁ జతుర్ముఖములతో నభవుఁడిట్లు స్తుతించెను.

"ప్రభూ ! నీవు జన్మస్థితిలయాదివికారములు లేనివాఁడవు, అజుఁడవు, అవ్యక్తుఁడవు, భూముఁడవు, పురాణపురుషుడవు, అనా

ధివి, అనంతుఁడవు, నిర్విశేషుఁడవు, నిరంజనుఁడవు, నిరాకారుఁ డవు, నిష్కలుఁడవు, నిరీహుఁడవు, నిర్లేపుఁడవు. ఇన్ని చెప్పనేటికి ? ఈజగత్తంతయును నీవే. నీవులేనిదేదియును లేదు. దేవతాగణము దుఃఖితలై నీచరణశరణమునకు వచ్చిరి. వీరిదుఃఖము పోవునుపాయమును జెప్పుఁడు. దారితప్పిన వీరికి సన్మార్గమును జూపింపుఁడు. మమ్ములను మీసేవకులుగను, శరణాగతులుగను భావించి స్వీకరింపుడు. అగ్నినుండి వెలువడిన మిణుఁగురులవలె దేవగణమగు మేమందఱమును నీకంశరూపులము. మీరులేక మేమేమియును జేయఁజాలము. కావుననేమి యొనర్చిన మాకు మేలు కలుగఁగలదో, ఈసమయమున మాకందఱకును గర్తవ్యమేమో దాని నాదేశింపుఁడు. ఉపదేశింపుఁడు."

శ్రీ శుకుఁ డిట్లనెను :- "రాజా ! జితేంద్రియులై సమాహిత చిత్తముతో దేవతలు భగవంతు నీవిధముగా స్తుతింపఁగా భగవంతుఁడు వారికి మేఘ గంభీర భాషణముల సముద్రమంథనమును గురించి చెప్పెను. భగవంతుఁడు తలఁచుకొనినఁ దానొంటరిగానే సమస్తమును జేయుటకు సమర్థుఁడైనను నాతఁడు కొంత సరసలీలఁ జేయవలసియుండెను. అందువలన నాతఁడు దేవతలకు దనయభిప్రాయమును జెప్పుచు భగవంతుఁడిట్లనెను :- "విరించీ ! నీవు నా మాటను వినుము. శంకరా ! నీవును జెవులను విప్పుకొని వినుము. నీవర్క ధత్తూర పత్రములను దినియుందువు. నేనొక యుపాయమును జెప్పెదను. దానిలో నీసహాయము కావలసియుండును. దేవతలారా ! మీరును దత్తచిత్తులరై శ్రవణము చేయుఁడు. నేను జెప్పె

నది మీకుమేలు గలుగఁజేయును. ఆ మార్గమునఁ దప్ప బోవుట కింకొక మార్గములేదు."

అందఱు నొక్కసారిగాఁ జేతులను జోడించుకొని యిట్లనెను :- "ప్రభూ ! మీరాజ్ఞాపింపుఁడు. మీయాదేశమేదైనను దానిని హృదయపూర్వకముగఁ బాలించెదము."

అంత భగవానుఁడిట్లనెను :- "అయితే, ఒక్కపనినిఁ జేయుఁడు. ఇప్పుడే మీరుపోయి అసురులతో సంధిచేసికొనుఁడు."

దేవతలు నిరాశా స్వరమున నిట్లనిరి :- "స్వామీ ! అసురులతో సంధి యెట్లు పొసఁగఁగలదు ! కలయిక సమానులతో జరుగును. విజయమును బొందినవారును, బలవంతులును బరాజితులతోడను నిర్బలులతోడను బ్రతిష్ఠా పూర్వకమగు సంధినెట్లు చేసికొనఁగలరు ? స్వామీ ! స్వభావము దుస్త్యజమైనది పిల్లికిని నెలుకకును స్వాభావికవైరముండును. సర్పమునకు ముంగిసకును సంధి పొసఁగునా? అసురులు మమ్ములను స్వభావమున ద్వేషించుచుందురు వారితో సంధి జరుగుట అసంభవము."

భగవానుఁడిట్లనెను :- నేనెల్లప్పుడునుసంధి చేసుకొను మనుటలేదు. మీరు కొంతకాలము మాత్రము వారితోఁ బ్రేమగానుండుఁడనియే నాయభిప్రాయము.

దేవతలిట్లనిరి :- స్వామీ ! ఇట్టి అస్థాయి సంధివలన నేమిలాభము కలదు.

భగవానుఁడిట్లనెను :- ఇప్పుడు సమయము మీకు విపరీత మైనపుడు మానావమానములను చాటింపరాదు. ఏవిధముగనైనను సాధింపవలయును. కాలానుసారముగఁ గార్యము లొనర్చువాఁడే బుద్ధిమంతుఁడు. సమయమును జాటింపనివాఁడే మూర్ఖుఁడు. మూర్ఖుఁడు కాలమునకు విరుద్ధముగఁ గార్యము నొనర్చును. అవమానమును ముందుంచుకొని, మానమును వెనుకనుంచుకొనిఁ బుద్ధిమంతుఁ డగువాఁడు తన కార్యమును సాధించుకొనును. తన స్వార్థము కొఱకు గాడిద కైనను బాబు కావలసి యుండును."

దేవతలిట్లనిరి :- "స్వామీ ! దుష్టులతో స్నేహము చివరకు హాని చేయునది కాఁగలదు.''

భగవానుఁడిట్లనెను:- నాయనలారా ! నేను జీవితాంతము వఱకు మిత్రత్వమును నెఱపవలయునని చెప్పుటలేదు. ఈసమయమునఁ గాలము వారి కనుకూలముగనున్నది. కావునఁ బైకి వారితో గలసియుండుఁడు, లోపలలోపల జాగ్రత్తగా నుండుఁడు. సమయమును జూచి కొట్టవచ్చును. మరల పోరాటము వచ్చినపడు వారి నణఁచి స్వర్గముపై నధికారమును జలాయించవచ్చును.

అంత శౌనకుఁడు సూతు నిట్లడిగెను:- సూతా ! భగవానుఁడు కపట, మోసమును నేర్పినాఁడే."

అంత నవ్వి సూతుఁడిట్లనెను:- స్వామీ ! ఎచ్చటిది కపట మోసములు? ప్రపంచమంతయును నిట్టి యవక తవకలే జరుగు

చున్నవి. ధర్మము వేఱు, రాజనీతి ఒక్కొక్కప్పుడు దానికి వ్యతిరేకముగఁ గూడ నుండును. భగవానుఁడు లీల కొఱకేయే యుక్తులు, కపట మోసములు, చెప్పినాఁడో వానిని నేను ముందు చెప్పఁ గలను."

....

## స్వార్థ సిద్ధికొఱకు శత్రువుతో సంధియొనర్ప వలెను

శ్లో॥ అరయోఽపిహి సంధేయాః సతి కార్యార్థ గౌరవే।
అహిమూషక వద్దే వాహ్యర్థస్య పదవీం గతేః॥

-శ్రీ భాగ. ౮ స్కం. ౬అ. ౨౦ శ్లో॥

క॥ ఎప్పుడు దనకును సత్త్వము
సొప్పడు నందాఁక రిపులఁ జూచియుఁ దనమైఁ
గప్పికొని యుండవలయును
నొప్పుగ నహిమూషకమున కొదిగిన భంగిన్॥

-శ్రీ మదాంధ్రభాగవతము.

ధార్మిక నియమములు సాధారణముగ నందఱకు నొక్కటిగ నేయుండును. మానవమాత్రునకు ముప్పది లక్షణములు గల ధర్మము చెప్పఁబడినది. కాని విశేష విశేషా వసరములందు

విశేషవిశేష వ్యక్తులకు కొన్ని విశేష ధర్మము లుండును. అదే విధముగ రాజనీతియందు సమయాను సారముగ నొక్కొక్కప్పుడు చూచుటకు ధర్మవిరుద్ధములుగఁగనఁ బడువ్యవహారము లొనర్ప వలసియుండును. వాస్తవమున రాజనీతి యందొక విశిష్ట స్వార్థమును సమ్ముఖమున నుంచుకొని వ్యవహార మొనర్పఁ బడును. శత్రువును మోసముచే జయించుటయును దోషముకాదు. తనస్వార్థమేయుపాయ ముచే సిద్ధించునో రాజనీతియందదే ధర్మముగ నెన్నఁబడును. భగవంతుఁడు వాంఛాకల్పతరువు. ఆయనకడకు ధర్మేచ్ఛచే నెవరు పోయెదరో వారికి ధర్మోపదేశ మొసంగును. కామభావముతోఁ బోయినచోఁ గామనా పూర్తియొనర్చును. అర్థార్థియై పోయినచో నర్థప్రదాన మొనర్చును. మోక్షేచ్ఛచే నెవరు పోయిదరో వారిని సంసార సాగరమునుండి శాశ్వతముగ ముక్తుల నొనర్చును. బలార్థికి బలము నొసంగును. ఛలము కావలయును వారలకు ఛలమునే నేర్పును. ఆతని కడ నేవస్తువునకును గొదువలేదు. ఆతని శరణమునకుఁ బోయిన వారికిచ్ఛలు పూర్తియై తీరును. చివర కాతఁడు మోక్షమున కధికారియగును.

శ్రీ శుకదేవుఁ డిట్లనెను:- "రాజా! దేవతలతో సంధిచేసి కొనుఁడని భగవానుఁడు తన యభిప్రాయమును జెప్పఁగా వారితోఁ గలియుట కఠినమని దేవతలది వినియు విననట్లుండి పెడచెవినిఁ బెట్టిరి. అప్పుడు భగవానుఁడు వారికి నచ్చఁజెప్పుచు నిట్లనెను:- "నాయనలారా! తమ కార్యగౌరవమును జూచికొని అవమానము మీఁద మనస్సునుంచరాదు. తగ్గిపోవుటలోనే పనిజరుగుచోఁ దగ్గియే

పోవలయును. శత్రువును ప్రేమించుటచేతనే పనినెఱవేరునట్లుండిన వానిని ప్రేమింపవలయును, చూడుఁడు. సర్పము తనపనిని నెరవేర్చుకొనుటకై యెలుకతో స్నేహ మొనర్చినది.

అంత దేవతలాశ్చర్యముతో నిట్లడిగిరి:- "ప్రభూ! సర్పమునకును ఎలుకకును స్వాభావిక వైరము కదా! సర్పము మూషకమునెట్లు ప్రేమించినది? ఆకథను మీరు మాకు జెప్పవలయును."

భగవానుఁడిట్లనెను:- "వైరముండిన నేమి? సర్పము దాని పనినది నెఱవేర్చుకొనవలయునుగదా! మంచిది వినుఁడు నేను మీకీ కథను జెప్పెదను."

ఒకానొక ధనికుని యింట గుడ్డల పెట్టె ఒకటియుండెను. దానిలో నొకానొక బలిసిన యెలుక దూరి గుడ్డల నన్నిటిని గొట్టివేయుచుండెను. ఇంతలోనే ఒక పెద్ద కాలసర్పము ఆకలిని జెంది ఆహారాన్వేషణమున దానిలోఁ బ్రవేశించెను. దైవయోగమున నాసమయముననే అచ్చటికి యజమాని వచ్చెను. అతఁడా పెట్టెను మూసి తాళము వైచిపోయెను. ఇప్పుడెలుకయును సర్పమును బెట్టెలో బంధింపఁ బడెను. సర్పమాఁకలి జెందియుండెను. అది తలఁచుకొనిన నెలుకను దిని తన యాఁకలిఁ దీర్చుకొనెడిదే; కాని అది యిట్లనుకొనెను:- "నేను తొందరపడి యిప్పుడే యీయెలుకను దిని వైచినచో నాకడుపు నిండిన నిండవచ్చును గాని నేనిచ్చటనే చావవలసివచ్చును. ఏదో విధముగ దీని నుండి బయటపడవలెను, కడుపునింపు నుపాయమును జూచుకొనవలయును.

ఇట్లాలోచించుకొని యెలుకతో నిట్లనెను:- "మూషక చక్రవర్తీ! ఏమి విశేషములు? నీవింత యుద్విగ్నుడివై యుంటివేల? చిత్తము స్వస్థమేనా?"

భయపడుచు భయపడుచు నెలుక యిట్లనెను:- "స్వస్థత యెక్కడిది మహారాజా; నాఅంత్య ఘడియలను లెక్కించుకొను చున్నాను."

సర్పమత్యంత మమత్వముతో నిట్లనెను:- "ఏల? ఏమిటా విషయము? నీవు విపత్తుచే భయభీత వైతివా?"

ఎలుక యిట్లనెను :- లేదుస్వామీ ! నేనీ పెట్టెలో బంధింప బడినందులకు భయపడుట లేదు. నాకు భయము నీవలననేనన్నె ప్పుడు మ్రింగివేయుదురో అనుభయమే ?

ఇది విని సహాను భూతి స్వరమున సర్పమిట్లనెను :- ఏమి ? నీవట్లుమాటలాడు చున్నావు ? వైరభావమెల్లప్పుడుండునా ? అది అప్పుడిప్పుడుండును. ఈసమయమున మన మిద్దరమును విపత్తుననున్నాము. మనలో మనము స్నేహముగా నుండవ లయును."

ఎలుక యిట్లనెను :- అయ్యా ! నిర్బలులకును బలవంతుల కును మైత్రి యెట్లు కుదురగలదు. గోవు గడ్డిమీద మిత్రత్వమును నెఱపినచో నాకలిచే జావవలసినదే, మిత్రత సమానులలో నుండును."

సర్పమిట్లనెను :- ఇప్పుడు నీవును నేనును సమానమగు విపత్తులోఁ బడియుంటిమి. కావున నీవు నన్ను నీమిత్రునిఁగాఁజేసి కొనుము. ఇద్దరమును బ్రయత్న మొనర్చి యీపెట్టెనుండి బయటఁ బడెదము."

ఎలుకకుఁ గావలసిన దిదియే. ఆమూర్ఖుఁడు సర్పముతో మిత్రత్వమును నెఱపెను. ఎలుక తన దంతములతో బెట్టెను గొఱికి ఒక రంధ్రము నొనర్చెను. ఇఁక బయట పడుటకు మార్గము దొఱికినదని తెలిసికొని వెంటనే సర్ప మొక్కసారి దుమికి లపక్కున నెలుకను మ్రింగి వైచెను. బయటఁ బడుటకు రంధ్రమును జేయించుకొనెను. తన యాఁకలిని నార్పుకొనెను. దీనినే కూటనీతి యందురు. సమయము పడినప్పుడు శత్రువునకు లొంగి పోవలెను. మరల సమయము చిక్కినప్పుడు వాని నణఁచవలయును."

భగవానుఁడు దేవతలతో నిట్లనెను :- "నాయనలారా! ఈ సమయము దైత్యదానవుల కనుకూలము. మీకు బ్రతికూలము. కావున ననుకూల సమయము వచ్చువఱకు, మీ కభ్యుదయ దినములు వచ్చువఱకు తగ్గిపోయి దైత్యులకు వశపడుఁడు. వారు బలవంతులు. మీరిద్దరును సముద్రమును మథించి అమృతము నుత్పన్నము కావింపుఁడు. అమృతోత్పాదనమైన తరువాత వారికి కొమ్ములు చూపింపవలెను. ఎలుకకువలె వారివలనఁ బనిచేయించుకొని స్వర్గచ్యుతులను గావింపవలయును."

ఇది విని శౌనకుఁడిట్లనెను :- "సూతా! భగవానుఁడు దేవతలకు మిథ్యాచరణమును నేర్పుచున్నాఁడు ఇది విశ్వాస ఘాతము కాదా ?"

ఇది వినఁగానే సూతుఁడు నవ్వి యిట్లనెను :- స్వామీ రాజనీతిలో నెవరెవరిని విశ్వసించెదరు ? అందఱును స్వార్థమునకు వశీభూతులరై వ్యవహరించుచుందురు. ప్రపంచములోఁ గల సంబంధము లన్నియును స్వార్థముచే, సాత్త్వికప్రకృతి కలిగిన నిస్సంగులగు సాధువులను, మహాత్ములను, విరక్తులను, భగవద్భక్తులను, బ్రాహ్మణులను, సన్న్యాసులను వదలివేయును. వీరిపని ధర్మాచరణ మొనర్చుటయే, కాని యెవరు రాత్రిందివములు స్వార్థముతో నుండవలసి వచ్చెదరో, అడుగడుగునకును. స్వార్థులతోడనే పనివడునో తన స్వార్థమును గూడ విడువఁజాలనివారెవరు కలరో అట్టివారిట్టి కూటనీతితోఁబనులు చేయించుకొనవలసివచ్చును. స్వార్థత్యాగమును గావించిన వారెవరో వారే విశుద్ధ ధర్మాచరణమును గావింపఁగలరు. స్వార్థమును సాధించుకొనఁదలచిన వారందఱును జేసినట్లే కూటనీతితోఁదమ స్వార్థములను రక్షించుకొనవలసి యుండును. చేతులను గాళ్ళను రక్షించుకొనుచు ముండ్లను దొలిగించుకొనుటయే సాధారణ నియమము. తెలిసి తెలిసి యెవరితోడను నిట్టి కూట నీతి వ్యవహారము కావింపరాదు, కాని వివశుఁడైనప్పుడే చేయవలయును. ఈ స్వార్థ పూర్ణమగు జగత్తున నిట్టే పనులను నిర్వహించుకొనయును. ఒక్కొక్కప్పుడు నిర్బలుఁడగు శత్రువునకుఁ గూడ లొంగిపోవలసియుండును. కప్ప సర్పమునకు భోజనము; కాని అవస

రము వచ్చినప్పుడు సర్పము కప్పకు వాహనము కావలసి వచ్చి
నది. బలవంతుఁడైనను బ్రాహ్మణుఁడు తన భార్యకు లొంగవలసి
వచ్చినది. సమయము రాగాఁనే యిద్దరును దమ స్వార్థములను
సాధించుకొనిరి."

అంత శౌనకుఁడిట్లనెను :- "సూతా! కప్పకు సర్పమేల
వాహనమైనది ? బ్రాహ్మణుఁడేల లొంగియుండవలసి వచ్చినది ?
ఈ విషయములను మాకుఁజెప్పవలయును. ఈ విషయమునఁగల
కథను మాకుఁజెప్పవలయును."

శౌనకుని వాక్యములను విని సూతుఁడిట్లనెను :- "మును
లారా! ఈ కథ అత్యంత ప్రాచీనమైనది. నేను దానినిఁ జెప్పు
చున్నాను. దానిని మీరు శ్రద్ధగా వినవలయును."

ఒక దినమున గంగాతీరమున నొక దండీ సన్న్యాసి ఒక
సర్పమును గాంచెను. దానిమీఁద నొక కప్పయెక్కి ఆనందముతో
నెగురుచుండెను. సర్పము దానినిఁదినుట లేదు. క్రిందకుఁ దలను
బెట్టికొని మెదలకుండి అంతయును సహించుచుండెను. ఇది చూడఁ
గానే దండి సన్న్యాసికి మిక్కిలి యాశ్చర్యము కలిగెను. ఆతఁడు
యిట్లనుకొనెను :- "ఆహా! కాలమెంత విపరీతముగా మారినదో
చూడుడు. కప్ప పామునకు భోజనము. అదియే నేఁడు సర్పము
మీఁదకెక్కినది. సర్పము దానికి వాహనమైనది. సర్పముస్వాముల
వారి మనోగత భావమును గ్రహించి, అచ్చట నుండియే యిట్లనెను.

"స్వామీ! మీరు నవ్వకుఁడు. నేను గప్పకు వాహనము గాను. ఘృతమున బ్రాహ్మణుఁడంధుఁడైనట్లు నేను గాలమునకుఁ గట్టు పడితిని."

యిది విని స్వామి యిట్లడిగెను :- "సర్పరాజమా నీ వే యవసరము కొఱకు చూచుచున్నావు. ఘృతముచే బ్రాహ్మణుఁ డెట్లంధుఁడయ్యెను? నీ కుచితమని తోఁచిన నాకీ కథను జెప్పుము."

సర్పమిట్లనెను ;- "స్వామీ! తన బలా బలమును జూచు కొని ఒక్కొక్కప్పుడు మానవుఁడు బలవంతుఁడయ్యు నిర్బలుని వలె నాచరింపవలసి యుండును. కన్నులున్నను నంధుఁడు కావలసి యుండును. రాఁగానే తన బలమును బ్రదర్శించి ప్రతిపక్షి నోడింప వలయును. ఈ విషయమున నొక ప్రాచీన కథ యున్నది వినుఁడు."

ఒకా నొక బ్రాహ్మణుఁడుండెను. బాగుగాఁజదువను వ్రాయఁ గల పండితుఁడు. పాఠశాలలో నుపాధ్యాయుఁడు. ఆతనికి సంతాన మేమియునులేదు. వృద్ధావస్థలో భార్య మరణించినది. శోకముచే నాతని బుద్ధి భ్రష్టమైపోయి, ఒక యువతిని ద్వితీయ వివాహ మాడెను. వృద్ధునిభార్య యెట్లుండవలయునో అట్లే యుండెను నామె స్వభావము. పండితుఁడనిన నామెకు నచ్చలేదు. ఆమె శారీ రకముగ హృష్ట పుష్టముగ నుండెను. పండితుని శరీరమును బాగుగా నుండెను. మొదటి భార్య ఆతనికి బాగుగాఁదిండి బెట్టుచుండెడిది; కాని యీామె వచ్చినప్పటినుండి పండితునకు పెరుగునేతులకు స్వస్తి

చెప్పెను. ఆమె యిష్టమువచ్చినట్లు తిని తిరుగుచు నిష్టము వచ్చిన పనులు చేయుచుండెడిది. ఇంటిలోని సామగ్రిని మెల్లమెల్లఁదన సోదరునికిఁ బంపుచుండెడిది. పండితునకు మిక్కిలి చింత కలిగెను. ఆతఁడు చాలా దుర్బలుఁడై పోయెను. ఆతఁడేమియును మాటలాడకుండెను. ఏదైన ననినచో నొకటికి నాలుగనును. ఆతఁడు మిక్కిలి చింతించుచుండెను.

ఆతని కొక యువక మిత్రుఁడుండెను. తన దుఃఖము నాతనికి జెప్పుకొనెను. మిత్రుఁడిట్లనెను :- పండిత వర్యా ! ఇట్లు పని జరుగదు. మానవుఁడు భయమునకు భయపడుచుండును. భయము బలవంతుని వలనఁ గలుగును. నీవు ఇష్టమువచ్చినట్లు నేతినిఁ దినుము బలవంతుఁడవు కాఁగానే దానిని సింధంతాం పితరః చేయ వచ్చును."

పండితుఁడు ఖేదముతో నిట్లనెను :- అయ్యా నీవు చెప్పినది బాగుగనే యున్నది. కాని తినుట యెచ్చటనుండి తెచ్చి ? తాళము దానిదగ్గఱేకదా ఉన్నది. ఇంటికి యజమానురాలై కూర్చున్నాదది. అది నాకు అడుగున మిగిలినవి మాడినవి పెట్టుచుండును. నేను దాని మీఁదనే బ్రతుక వలసి యుండును. అది యిష్టము వచ్చినట్లన్నియును దినుచుండును. నాముఖమున పాసినకూడు పడ వేయుచున్నది.

ఇది విని యువకుఁ డిట్లనెను :- అయితే, సరియే, నేను నీకొక యుపాయమును చెప్పెదను. నీవామె కడకుఁబోయి నాకు

చూపు తగ్గినదని చెప్పుము. ఇప్పుడు నవరాత్రులు, అష్టమీ దినమున వ్రతమొనరించి, నవమీ సాయంకాలమున దుర్గాదేవిని భక్తి భావముతోఁ బూజయొనర్పవలయును. అప్పుడామెను నాకన్నులు బాగుపడవలయునని యిట్లు ప్రార్థించుము :- "దేవీ! నేను నీకు విశేష పూజ చేయుదును. కన్యకలకుఁ బెట్టుకొందును. ఇట్లు ప్రార్థించినచో నవశ్య మాకాశవాణి పలుకఁ గలదు."

పండితుఁ డిట్లనెను :- ఇట్లొనర్చుటచే లాభమేమి ?

ఆ యువకుఁ డిట్లనెను :- లాభమును నీవు ప్రత్యక్షముగఁ జూడఁగలవు. నానాథుని కన్నులు పోవుఁగాక! యని వరము కోరుకొనును. అప్పుడేమి జరుగునో చూడవచ్చును.

పండితుఁ డిట్లనెను :- "సరియే, అట్లే చేయుదును. మరునాఁ డాతఁడు పోయి తనభార్యతో నిట్లనెను :- "విన్నావటే! నాకన్నుల చూపు తగ్గినది."

ఇదివిని ఆమెలోలోన నానందమును జెందుచుఁ బైకి సహానుభూతినిఁ జూపుచు నిట్లనెను :- "చూపెందులకు తగ్గినది ? ఇంకను నీకంత పెద్దవయస్సులేదే దీనికేదైనఁ జికిత్సను జేయించుకొనుఁడు."

పండితుఁ డిట్లనెను :- "ఔషధములతో నీరోగము బాగుపడదు నీవుతలంచుకొనిన బాగుపడఁగలదు."

ఆమె శీఘ్రముగఁ దన మనోగత భావములను దాచుకొని యిట్లనెను :- "చెప్పుఁడు, చెప్పుఁడు. ఏమిచేసిన రోగము పోఁగలదో నేనదే చేసెదను. నాకు సర్వమును మీరేకదా !"

పండితుఁడిట్లనెను :- "రేపష్టమి, నీవు పగలంతయు వ్రతము నాచరింపుము. నవమీనాఁడు సాయంకాలమున మిక్కిలి భక్తిభావముతో దుర్గాదేవిని పూజించి, వరము లడుగుము. ముడుపులను గట్టుకొనుము. కన్యకలకుఁబెట్టెద ననుము. అప్పుడాకాశవాణి పలుకును. దేవి యేది చెప్పిన దానినిఁ జేసెనచో నామనోవాంఛ తీరఁ గలదు."

పండితుని భార్య యిట్లనెను :- "మంచిది, నేనవశ్యమీ యుపాయ మొనరించెదను."

మఱునాఁడష్టమి రాఁగానే ఆమె పగలంతయును నిరాహార వ్రత మొనరించెను. దుర్గాదేవిని మ్రొక్కుకొనెను. నవమీ దినమునఁ గూడ నేమియును దినలేదు. పూజ సామగ్రినంతను గైకొని సూర్యాస్తమానము కాఁగానే దేవీ మందిరమునకుఁ బోయెను. కొందఱు స్త్రీలింకను బూజిఁచుచుండిరి. వారందఱును వెడలిపోఁగానే యామె ఒంటరిగ మిగిలిపోయెను. ఆమె మిక్కిలి భక్తిభావముతో దేవినిఁ బూజించెను. స్నాన, చందన, పుష్ప ధూప, దీప, నైవేద్య, సూత్ర, ఇక్షుఫల, అన్యఫలములు, అపూపములు తాంబూల, దక్షిణాదులను సమర్పించి ఆమె హారతి, ప్రదక్షిణల నొసర్చి రెండు చేతులను జోడించుకొని యిట్లనెను :- "దేవీ ! నాపతికి రెండుకన్ను

లును బోవలయును. అట్లు జరిగినచో నీకువిశేష పూజలొనర్చె దను. కన్యకలకుఁబెట్టెదను.''

పండితునకుపాయమును జెప్పిన యామిత్రుఁడిదివఱకే మంది రమునకుఁ బైభాగమున నెవ్వరికినిఁ గనఁబడనిచోట రహస్యముగఁ గూర్చుండెను. పైన చాందినీ కట్టఁబడి యుండెను. రాత్రిపూట కనఁ బడుటకు వీలులేదు. అతఁడుపైనుండి యిట్లనెను :- "నీమనో వాంఛనెఱవేరఁగలదు. నేఁటినుండి నీవు నీభర్తకు పదితులముల బాదముపప్పులో నుండి తీసిన పాలను మూడు పావుశేర్ల పాలలోఁ గలిపి పావుశేరు నేతిని, పదునొకండు మిరియాలను, పదితులములు పటికబెల్లమును గలిపి నిత్యమును నిచ్చుచుండుము. ఇట్లు నూరు దినములు చేయవలయును. నూరుదినములిట్లు చేయుటచేఁ గన్నులు పోఁగలవు. ఈ విషయము నెవరికిఁ జెప్పఁగూడదు. అట్లుచెప్పిన నీకన్నులు పోఁగలవు."

ఆయాకాశవాణిని విని పండితుఁనిభార్య మిక్కిలి యానంద మును జెంది ఆమె వెంటనే అచ్చటనుండి రాఁగానే సమస్త వస్తు వులను దెప్పించి సిద్ధమొనర్చి భర్తకొసంగెను. భర్త యిట్లనెను :- "ఇదేమి?"

ఆమె యిట్లనెను:- "నేయి, కలకండ, బాదాము, మిరియాలు, పాలు.'' పండితుడిట్లనెను :- "వలదు, వలదు. నే నీ వస్తువులను దినను. వీనిచేఁ గన్నులుపోఁగలవు.''

పండితుని భార్యకింకను విశ్వాసము కలిగెను. అందువలన నామె యిట్లనెను :- "ఇది దేవియొసంగిన యాజ్ఞ. మీరవశ్యము తినవలయును. ఇట్లు నూరుదినములు దీనిని సేవింపవలయును."

పండితుఁడు సరళముగ నిట్లనెను :- "మంచిది, నీవు నా భార్యవు. నాకనిష్టమును గలిగింపవు, దేవ్యాజ్ఞ ననుసరించియే చేయుము." అని పలికి యాతఁడు సమస్తమును ద్రాగివైచెను. ఇచ్చట పండితుఁడు సీమరేగుపండువలె నెఱ్ఱ, బడుచుండెను. కన్నులకు నూతనదృష్టి, శరీరమున నవస్ఫూర్తి అంగములందు నవజీవన సంచారము కలుగుచున్నట్లుండెను. ఇట్లున్నను నాతఁడు తన భావములను దాచుచుఁగాలము కొఱకు ప్రతీక్షించుచుఁ జూడగల్గియున్నను నంధునివలె నుండెను.

ఇప్పుడు కొన్ని దినములకుఁ బండితుఁడు కన్నులను మూసికొనెను. చేతులతోఁదడువుకొనుచు నడుచుచుండెను. భార్య యెచ్చటఁ గూర్చుండఁబెట్టిన నచ్చటఁగూర్చుండును. ఎచ్చటికిఁ దీసుకొనిపోయిన నచ్చటికిఁ బోవును. భార్యకుఁ మిక్కిలి యానందము కలిగెను. ఆమె నేతినెక్కువగ వేయుచుండెను. ఇప్పుడామె తనయిష్టము వచ్చినట్లాడసాగెను. వస్తువులన్నిటినిఁ దనపుట్టినింటికిఁ జేర్చుచుండెను. పండితుఁడు చూచుచుండియును నంధుఁడై యుండెను. ఇదివఱకు పండితుని నిరాదరించుటకు జంకుచుండెడిది. ఇప్పుడు ప్రత్యక్షముగ నిరాదరించుచుండెను. పండితుఁడు నీరడిగినచోఁనీకు నీరెవరిచ్చుచుందురనుచుండును."

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! మఱునాఁడా యువకుఁ డిట్లడిగెను :- పండితవర్యా ! చెప్పుము. ఎట్లున్నది ?"

పండితుఁడు సంతోషమును బ్రకటించుచు నిట్లనెను :- "ఎట్లుండుట యేమిటయ్యా! బాణము లక్ష్యమునకుఁ దగిలినది. నూరు దినములకు నేను వృద్ధుఁడను యువకుఁడ నయ్యెదను. నీ యౌషధ సేవనముచే."

యువకుఁడు పండితుని చెవిలో నిట్లు చెప్పెను:- "అయ్యా! ఒక్క పనినిఁ జేయుఁడు. పదిపదునైదు దినములైన తరువాత నా కింకను గనఁబడుట లేదనుచుండుము. ఆపైఁ బదిదినములలో నాకు బొత్తుగాఁ గనఁబడుట లేదనుము. ఆమె చెయ్యి పట్టుకొని పోవుచుండుము."

పండితుఁడు వానిని గురువుగా నొనర్చుకొనెను. అతఁడు గృహిణీకరణమంత్రమును జెప్పినాఁడు కదా ! ఆతని సలహా ప్రకారము భార్యతో నిట్లనెను :- "నీవు నాకేమి తిననొసంగుచున్నావు. దీనిచే నాచూపు దినదినమును దగ్గిపోవుచున్నది." ఇదివిని యామె మిక్కిలి ప్రసన్నురాలయ్యెడిది. ఘృత మాత్రను బెంచుచుండెను. సూతుఁ డిట్లనెను:- "మునులారా! గృహస్తున కెన్ని బాధలున్నవో మీకు దెలియదు, ఒకవేళ దైవికముగ గృహిణి సతీ, సాధ్వి, అనుకూలవతి దొఱకినచో గృహస్థాశ్రమమందు కొంచెము సుఖాభాష కనఁబడును. కాని స్వామి ! ఇట్టి సహధర్మచారిణి వేయికొకరికి నేభాగ్యశాలికో లభించును. అడుగడుగునకును ఘోరాపునధి సాధార

ణముగ దొరకుచునే యుండును. ఇట్లయ్యును మానవుఁడీ మాయా జాలమును విడువఁ జాలకున్నాఁడు. అందరను దొందరపడి దానిలోఁ బడిపోవుచుందురు. రాత్రింబవళ్ళు మంచిచెడ్డలనుచునే యుండును. స్వామీ ! సాధారణ స్త్రీలు పతినవమాన మొనర్చినఁ దమకు గౌరవ మని భావించుచుందురు. తన సహవాసకత్తెలతోఁ గూర్చుండి మిక్కిలి గర్వముతోఁ దనభర్తవచ్చి అన్నము పెట్టుమన్నాఁడనియు అక్కడ నున్నది పెట్టుకొని తినుఁడన్నట్లును తనను భోజనము తయారు చేయుమనఁగా నీవే చేసుకొనుము: నాకిప్పుడు తీరదని చెప్పితినని చెప్పుచుండును. తన గర్వమునంతను వారిముందు ప్రదర్శించుచుండును. మఱఁదుల నామె క్రీగంటనైవను జూడదు. ఒకవేళ వారు పప్పులో నుప్పెక్కువైనది, కూరలోకారము ఎక్కువైనదని యేదైన లోపము నెంచినచో నిట్లనును :- "చూడుఁడు వీరిపోకడలు !" అని పరిసార్లామాటను, మరల నిట్లనును :- నాయనలారా ! అట్లు నావలనఁ గాదయ్యా ! మీకు ఛప్పన్నాఱు విందు వంటలను జేసిపెట్టుట కెవరికైన వంట కత్తెను దెచ్చుకొనుఁడు. బాబూ" అని యిట్లెన్నో వాగుచుండును.

ఇది విని నవ్వుచు శౌనకుఁ డిట్లనెను :- "సూతా ! అది అట్లుండనిమ్ము. ఈ గృహస్థుల జంజాలమంతయు మాకుఁ జెప్పెద వేమి ? నీవు ఘృతముచే నంధుఁడైన బ్రాహ్మణుని కథను జెప్పుచున్నావు. దానిని త్వరగాఁ బూర్తిచేసి సముద్ర మంథన కథను జెప్పుము."

సూతుఁడును నవ్వి యిట్లనెను :- "ఋషులారా! గృహస్థ జంజాలమునుండి బయటఁపడిన మీరే ధన్యులు. స్వామీ! మీరట్లు దానిలోఁ బడియుండిన మీరిట్లు దినమంతయును గథలను వినఁ జాలరు. మంచిది, నేను బూర్తి కావించెదను. తొంబది తొమ్మిది దినములు కాగాఁనే పండితుఁడు తన గ్రుడ్డితనమును వీడి, భార్య చేయిబట్టుకొని యిట్లనెను :- "ఇంతవరకు నేనంధుఁడను. అందు వలన నీ పోకిరితనములు సాగినవి. ఇప్పుడు నా కన్నులందు నవ జ్యోతి సంచార మొనర్చుచున్నది. ఇఁక నీ యాటలు సాగవు." చేయిపట్టుకొనఁగానే పండితున కత్యధిక ఫలము వచ్చినదని ఆమె గ్రహించెను. ఆమె భయపడెను. తాళము బీగములను బండితుఁడు తన వశము గావించుకొని దానికి తిండి మాత్రము పెట్టుచుండెను. ఆ దినమునుండి అది బాగుపడినది. కావున మునులారా! బల వంతుఁడగువరకు సమస్తమును సహించుచుఁ గాలమును బ్రతీక్షించు చుండవలయును. అందువలన భగవంతుఁడు దేవతలకు అసురులతో సంధి చేసికొన వలసినదనియు తరువాతఁ దమ స్వార్థమును నెర వేర్చుకొనిన మీఁదట బలవంతులరై వారినిఁ గొట్టి పారఁద్రోల వలయుననెను."

అంత శౌనకుఁ డిట్లడిగెను :- "తరువాత భగవానుని సల హాను విని దేవతలేమి చేసిరి? దేవాసురులకు సంధిచేయ నాతఁడు వెడలినాఁడా?"

అంత సూతుఁ డిట్లనెను :- "పరీక్షిన్మహారాజునకుఁగగా మా గురుదేవుఁడు సముద్ర మథన కథనెట్లు చెప్పినదియును

అసురులతో సంధి యొనర్చుటకు దేవతలెట్లు పోయినదియు, నేను ముందు చెప్పెదను సావధానులరై శ్రవణ మొనర్పుడు."

.....

## దేవాసురలకు సంధి

శ్లో॥ తతో దేవాసురాః కృత్వా సంవిదంకృత సౌహృదాః ।
ఉద్యమం పరమం చక్రు రమృతార్థే పరంతప ॥

శ్రీభాగ. ౮ స్కం. ౬ అ. ౩౨ శ్లో॥

వ. సురాసుర యూథంబులు బలారాతి బలిప్రముఖంబులై పరమోద్యోగంబున సుధా సంపాదనాయత్తచిత్తులై యైకమత్యంబు నొంది యమంద గమనంబున మందరంబునకుం జనిరి.

శ్రీమదాంధ్రభాగవతము.

'జిహ్వకొక రుచి పుఱ్ఱెకొక బుద్ధి' యను సామెత కలదు. ఎన్నితలలు కలవో అన్నిమతములు. అందఱ ఆకారము లొక్కటిగ లేవు. అందఱ వాక్కులు భిన్నములే. అందఱ హస్తాక్షరము లొక్కటిగ నుండవు. ఇంతెందులకు బొటనవ్రేలి ముద్రలు, కాలిలోని రేఖలన్నియును భిన్నములే. ఒకే రజోవీర్యములచేతను

నాకేఉదరమున బుట్టిన నన్నదమ్ములకును, అప్పచెల్లెండ్రకును నాకాశ పాతాళముల కున్నంత భేదము కలదు. ఒకరి స్వార్థ మింకొకరి స్వార్థమున కాబద్ధముకాదు. అందఱును వేఱువేఱుగనే యుందురు. ఒకరొకరు మాటలాడుకొనకున్నను స్వార్థమీ విభిన్నత యందేకత్వమును గావించినది. ఒకే స్వార్థమునఁ కలవారు విభిన్న విచారములు కలవారైనప్పటికిని స్వార్థవశమునఁ కలియుచుందురు. వ్యాపారములందు భిన్నభిన్న సంప్రదాయములవారును, భిన్నభిన్న మతములవారును గలిసి వ్యాపార మొనర్చుచుందురు. రాజుదగ్గఱ భిన్నభిన్న మతములలోని సేవకులొకే స్వార్థకారణమున నేకత్రిత కార్యము నొనర్చుచుందురు. నలుగురిలో భిన్నభిన్న మతములు, భిన్నభిన్న విచారములు, భిన్నభిన్న రుచులు గల మనుష్యులుం దురు. కాని యందఱకును దొంగతనమే స్వార్థమగుటచే దళముగనై దొంగతనము చేయుదురు. బందిపోటు చేయుదురు. దోచుకొందురు. దోచుకొన్న వస్తువులను నియమానుసారముగఁ బంచుకొందురు. ప్రపంచములో స్వార్థముమీఁద ప్రేమకలదు. శాఠ్యమిశ్రిత సౌహార్ద్రముకలదు. అనిత్యభోగములందు నిత్యత్వ బుద్ధికలవారును, అసత్పదార్థములను సత్పదార్థముగ భావించువారును స్వార్థరహిత ప్రేమనుగూర్చి యూహించనైన నూహింపఁజాలరు.

శుకదేవుఁడిట్లనెను :- "రాజా! భగవంతుఁడు దేవతలను దైత్యులతో సంధిచేసికొనుమని సమ్మతి నీయఁగా దేవతలిట్లడిగిరి :- "స్వామీ! వారితో సంధిచేసికొని యేమి కార్యమొనర్పవలయును?"

అప్పుడజితభగవానుఁడిట్లనెను :- "దైత్యులు మిక్కిలి బల వంతులు. మీరిద్దరును గలిసి యీ క్షీరసాగరమునుండి అమృతో త్పాదన యత్న మొనర్పుఁడు."

దేవతలిట్లనిరి :- "ప్రభూ! అమృతమువలన నేమిజరుగును?"

భగవానుడిట్లనెను :- జరుగునదేమున్నది ? ఇప్పుడు మీరు చూచుచునేయున్నారుగదా. అసుర పక్షమునఁ జచ్చినవారిని శుక్రా చార్యుఁడు తన మృతసంజీవని విద్యచే బ్రతికించెను. మీవైపున నావిద్యను నేర్చినవారెవరును లేరు. మీగురువగు బృహస్పతికిని నావిద్య తెలియదు. అందువలన మీవైపునఁ జాలమంది దేవతలు మరణించిరి. అమృతోత్పాదనమగుచో దానినిఁ ద్రాగిన మీరమరులు కాఁగలరు. అప్పుడు మీరెంత యుద్ధమొనర్చినను జావఁబోరు. మీరందఱును మరణధర్మముగల దేవత లమరులయ్యెదరు."

దేవతలుల్లాసముతో నిట్లడిగిరి :- "స్వామీ! ఆ యమృత ముత్పన్నమగుటెట్లు ? సముద్రమగాధమైనది. దానిలో నమృత మెచ్చట దాగియున్నది ?"

భగవానుఁడిట్లనెను :- "నాయనలారా! అట్టి అమృతము కనఁబడదు. ఘృతము క్షీరములలోఁ గణకణమునఁ గలదు. దానిని యుక్తిచేఁ గవ్వముతో మథించునెడల ఘృతము వెలువడును. ముందుగాఁ బాలలోఁ దోడుపెట్టవలయును. అది పేరుకొని పెరు గగును. కవ్వమునకుఁద్రాడును గట్టి నిరంతరము దానిని మథింప

వలయును. మథింపఁగా మథింపఁగాఁ బైకిఘృతము తేలును. మజ్జిగ వేఱుగనుండును."

దేవతలిట్లడిగిరి :- "అయితే స్వామీ! తోడుపెట్టుట కిచ్చట నేవస్తువును వేయవలయును. కవ్వమేదియో, త్రాడేదియో తెలియ వలెను దానిని మథించుటెట్టులో ?"

భగవానుఁడిట్లనెను :- "ఒక్కపనిచేయుఁడు. ఎన్నిమంచి మంచి అమృతస్రావవస్తువులు కలవో, ఎన్నిలతలుకలవో, ఎన్ని గడ్డిదినుసులుకలవో, నలమూలికలుకలవో వానినన్నిటినిఁ బెల్లగించు కొని తెచ్చి సముద్రమునఁ బడవేయుఁడు. సర్వశ్రేష్ఠమగు మందరా చలమును గవ్వముగ నొనర్పుఁడు వాసునిఁ గవ్వపుత్రాడుగఁ జేసి కొని మీరును దైత్యులును గలిసి మథింపుఁడు."

దేవతలిట్లనిరి :- "స్వామీ! మావలన నిదియంతయు నెట్లు జరుగఁగలదు ? ఇంతటి బలము మాకడ నెక్కడిది ?"

భగవానుఁ డాశ్వాసన మొనర్చుచు నిట్లనెను :- "దేవత లారా! ఏమయ్యా ? ఇంతటిక్లీబులేమి ? హృదయ దుర్బలత్వమును గ్లిబతను వీడి ఉత్సాహముతో నీకార్యము నొనర్పుఁడు. మీపక్షమున నున్నాను నన్ను మఱవక నావెంటనుండి మీరు మథించినచో మీ కేమియును గష్టము గలుగదు."

దేవతలిట్లనిరి :- "స్వామీ! ఇది సత్యమే మీరు మాపక్ష ముననుండిన మాకు కష్టములేలఁ గలుగును. కాని స్వామీ! అసు

రులు మనతోఁబాటు పరిశ్రమ యొనర్చుచో వారికిని నమృతము లభింపఁగలదు."

భగవానుఁ డిట్లనెను :- "నన్ను మఱచి కర్మలెవరు చేయుదురో వారికి కేవలము కర్మలశ్రమమే లభించును. వ్యర్థముగఁ దాను జ్ఞానిననుకొని గర్వముతోఁ గర్మలొనర్చుచోఁ గష్టముమీఁద నున్నతపదవినిఁబొందియును జివరకుఁ బైకియెక్కియును మరలఁ బతనమగును. ఏలయనఁగా నాతఁడు నాపాదముల నాశ్రయింపలేదు. నన్ను స్మరించుచు. నాసేవగా భావించుచుఁ, గర్తవ్య బుద్ధిచే నెవఁడు కర్మల నొనరించునో, అట్లు కర్మలొనర్చి వానిఫలమును నాకెవఁడు సమర్పణ మొనర్చునో వానికి గర్మజన్య శ్రమముండదు. మహాఫలమున కధికారియునగును మీతోఁబాటుగా నసురులును సమానముగఁ బరిశ్రమ మొనర్చెదరు. కాని అమృతము యొక్క మధుర రసము మీకే లభింపఁగలదు. దైత్యులకు కేవలము క్లేశము మాత్రము మిగులును. కావున నిప్పుడు మీరేదోవిధమున వారిని బుజ్జగించి సముద్రమంథనము కొఱకనుకూలురుగఁ జేసికొనుఁడు."

దేవతలిట్లనిరి :- "స్వామీ! ఆ దుష్టులు మిక్కిలి హఠులు. వారిది తలక్రిందుల తత్త్వము. ఏ మాటమీఁద నిలిచెదరో దానిని వీడరు."

భగవానుఁ డిట్లనెను :- "అట్లే నిలువనిమ్ము. మనము మనపనిని నెరవేర్చుకొనవలయును. ఈ సమయమున వారేది చెప్పిన దానిని సమర్థింపవలయును. ఏమియును సందేహింపక వారి

మాటల కన్నిటికిని నౌననవలయును. సురులారా! ఇదియే నీతి, శాంతిచే నేచిక్కులును లేక పనులు నెరవేరినటుల క్రోధమునను, పోరాటములవలనను నెరవేరవు."

దేవత లిట్లనిరి :- "స్వామీ! మథించినను దానినుండి అమృతోత్పాదనము కాకున్నచో? అమృతోత్పాదనము కాక యిక నితర వస్తువులు వెలువడిన నింకేమి చేయవలయును?"

భగవానుఁ డిట్లనెను :- "అమృత ముత్పన్నమగు వరకును మథించుచునే యుండవలయును. నిరాశులు కారాదు. మునుముందుగా నీయోషధులయొక్కయు సముద్రము యొక్కయు వికారరూపమున విషము బయటఁబడును ఆ విషయమును గాంచి భయపడరాదు. ముందు విషముపుట్టిన దేమియని హతోత్సాహులు కారాదు."

దేవత లిట్లడిగిరి :- "ప్రభూ! విషము పుట్టిన తరువాత నమృతముగాక యింకేమైనఁ బుట్టినను?"

భగవానుఁ డిట్లనెను:- "అమృతము, విషముకాక మిక్కిలి సుందరమయిన వస్తువులు ఒకదానికంటె నొకటి మించిన అద్భుత రత్నములు బయలుదేరఁగలవు. వానినిఁ గాంచి జారిపోకుఁడు. వానినిఁగొనుటకు లోభపడకుఁడు. వానినిఁ బ్రాప్తించుటకై కోపగించి యుద్ధాదులొనర్పరాదు."

శ్రీశుక దేవుఁ డిట్లనెను :- "రాజా! ఈవిధముగ భగవానుడసురులకు నచ్చఁజెప్పి, వారికి కూటనీతి యుక్తులను జెప్పి వెంటనే

అంతర్ధానమయ్యెను. అందరు భగవంతుని అవ్యక్త సచ్చిదానంద రూపమునకుఁ బ్రణామము కావించిరి. అంత బ్రహ్మ యిట్లనెను.

"దేవతలారా! నేనును బోయెదను. నా కొరకు మీరిద్ద రొక్కఁటిగఁగండు. పెద్దవారిట్టి కార్యములందుఁ బాల్గొనుట ఉచితము కాదు." అని పలికి బ్రహ్మ తన లోకమునకుఁ బోయెను. శివుఁడు నిట్లనెను:- "మంచిది. నాయనలారా! ఇప్పుడు నాకును ననుమతి నొసంగుఁడు. నేను మీ వెంటనే యున్నాను. అవసరమైనప్పుడు పిలువుఁడు." అని పలికి ఆతఁడును గైలాసమునకుఁ బోయెను.

ఇప్పుడు దేవతలు బాగుగా నలంకరించుకొని అసుర రాజ సభకుఁబోయిరి. అచ్చటికిఁబోయి చూడఁగాఁ త్రైలోక్య సింహాసన మునఁ బ్రహ్లాదుని పౌత్రుఁడును, పరమ ధార్మికుఁడును, దాతయును నగు బలిచక్రవర్తి కూర్చుండి యుండెను. ఆతఁడు పూర్ణశోభా సంపన్నుఁడు, రాజ్యశ్రీ ఆతనిని వరించినది. సింహాసనముమీఁద నాతఁ డింద్రునివలె శోభించుచుండెను. నలువైపులను శంబర, అరిష్టనేమి మొదలగు గొప్పబుద్ధిమంతులగు నసురులు కూర్చుండి ఆతని నుపాసించుచుండిరి. సభా భవన రక్షణము కొరకు ద్వార పాలకులును, సైనికులును నిలుచుండియుండిరి. చాలమంది సేనా నాయకులు బలి సభయందు గూర్చుండియుండిరి. దేవత లొక్కఁ సారిగాఁ దమవైపునకు వచ్చుటను గాంచి సమస్తసైనికులస్త్ర శస్త్ర ములను సంబాళించుకొని యుద్ధముకొరకు సిద్ధమైరి. ప్రధాన సేనా నాయకులందరను సువ్యవస్థితులై నిలుచుండవలసినదని యాజ్ఞా

వించెను. అన్య సేనా నాయకులు సంబాళించుకొని ప్రహార మొన ర్చుటకుఁ తత్పరులైరి.

దేవతలు శస్త్ర విహీనులగుటను, యుద్ధప్రయత్న మిసుమంతైన లేకుండుటనుగాంచి బలి ప్రధాన సేనా నాయకునితో నిట్లనెను :- "మీరంద ఱెవరితో యుద్ధము చేయఁదలఁచు చున్నారు ?"

సేనా నాయకుఁడిట్లనెను :- "అన్నదాతా ! మనపురాణ శత్రువులగు దేవతలందఱును గలిసి మనకడకు వచ్చుచున్నారు. వారిని మనము పట్టుకొనవలయునా ? పాఱఁద్రోలవలయునా ?"

నవ్వి బలి యిట్లనెను :- "యుద్ధ మొనర్ప వచ్చినచో వారితోఁ బోరాడవలయును. కనఁబడుటలేదా ? దేవతలు వట్టి చేతులతో వచ్చుచున్నారు. వారివద్ద నస్త్ర శస్త్రము లేమియునులేవు. యుద్ధోపయోగములగు నన్యోప కరణములునులేవు ఇట్టి స్థితిలో యుద్ధ మొనర్ప నముత్సుకులగుట యనుచితము. వీరేదో విశేష ప్రయోజనము కొఱకు మైత్రీ భావముతో వచ్చుచున్నట్లు గోచరించు చున్నది. ఇట్టి స్థితిలో నేను వీరిని హృదయపూర్వకముగ స్వాగత మొసంగెదను. ప్రధాన ప్రధానులగు గర్మచారులందఱును ముందుగాఁబోయి వారిని సత్కార పూర్వకముగ నా సమీపమునకుఁ గొనిరండు."

బలియొక్క యీ యాజ్ఞను విని ప్రధానమంత్రియును, ప్రధాన సేనా నాయకులును, అన్యాన్య సచివులును సురల సమీ

పమునకుఁబోయి వారి నాదర సత్కారపూర్వకముగ బలి సమీపము నకుఁ గొనివచ్చిరి. బలి లేచి వారి నాదరించి, కూర్చుండుట కందఱకును యోగ్యములగు నాసనముల నొసంగెను. బలిచక్రవర్తి వారికి పాద్యార్ఘ్యముల నొసంగి, అందఱను బూజించి, వచ్చిన కారణ మడిగెను."

బలి యడుగఁగా నింద్రుఁడిట్లనెను :- "మహాభాగా ! మేము నీ దగ్గఱకొక విశేషకార్య వశమున వచ్చితిమి. మాదొక ప్రస్తావ మున్నది. మీరు దాని నంగీకరించినచోఁ జెప్పెదను.''

నవ్వి బలి యిట్లనెను :- "విననిదే దాని నంగీకరించుటెట్లు? ఆ ప్రస్తావమేమో చెప్పుఁడు. దానిని విని నేను నా మంత్రులతో నాలోచించెదను. అందఱ సమ్మతినిఁ గనుగొని మరల మీకు నివేదించెను.''

ఇంద్రుఁడిట్లనెను :- "సురాసురలమగు మన మిరువురమును సోదరులము. మన కిద్దరకును దండ్రి యొక్కఁడే. ఒక్కవీర్యము ననే మనమందఱమును బుట్టితిమి. తల్లులు వేఱగుటచే మన స్వభావములలోను గార్యములందును గొంచెము భేదము వచ్చినది. అయినను సోదరులము సోదరులమే మాకు మీకు పోరాటము శాశ్వతముగ నాగిపోవలయునని మా యాశయము.''

అసురులిట్లనిరి :- "అసంభవమగు ప్రస్తావము నెత్తుట వ్యర్థము... మాకును మీకును బోరాట మెన్నటికిని నాగదు.''

ఇంద్రుఁడిట్లనెను :- "మంచిది, పోరాటము సమాప్తము కాక పోనిండు. పోరాడుకొనుచుందము. కాని యిద్దరకు నేవిధమగు హానియుఁను గలుగరాదు. పోరాడుకొన్నను మనము చావఁగూడదు. యుద్ధేచ్ఛ నెఱవేరవలయును. హాని కలుగరాదు. పామును జావ వలయును బడితె విఱుగరాదు."

బలియిట్లడిగెను :- "దీనికేమి యుపాయము?"

ఇంద్రుఁడిట్లనెను :- "ఈక్షీరసాగరములో నమృతమున్నది. సురాసురలమగు మనమందఱమును గలిసి మందరాచలమును కవ్వముగా నొనర్చి వాసుకిచే దీనిమథింపవలయును మథింపఁగా మథింపఁగా దీనినుండి అమృతము రాఁగలదు. దానిని మనము త్రావి అమరుల మగుదుము. ఇందులో మనకిద్దరకును స్వార్థము కలదు."

అసురులకీవిషయము బాగుగ నచ్చెను. వారు ఆహాఁ ఊహుఁయనుచు దెబ్బలాటలే ఉత్తమ కార్యముగ భావించుచుందురు. ఇట్టికార్యములనిన వారికి మిక్కిలి రుచి. అసురులిట్లనుకొనిరి :- "ఈ దేవతలను గ్రుడ్లగూబలనొనర్చెదము. వీరిచేఁ బరిశ్రమమును యథేష్టముగఁ జేయించుకొందము. అమృతోత్పాదనము కాఁగానే దానినంతను మనమే త్రాగి వేయవచ్చును. ఈ దుర్బలులు మనల నేమి చేయఁగలరు ?"

సూతుఁడిట్లనెను :- మునులారా ! అసురుల మనస్సులలోని కిది వఱకే పాపము ప్రవేశించినది.

అంత శౌనకుఁడిట్లనెను :- మహాభాగా! సూతా! పాపము దేవతల మనస్సులలోనుగలదు. వారసురులను మోసగించుటకే గదా వచ్చినది.

అంత సూతుఁడిట్లనెను :- స్వామీ! ఇది సత్యము. దేవతలును నసురులను వంచన చేయఁదలఁచిరి. కాని అది స్వతః కాదు భగవదాజ్ఞచే, భగవదాజ్ఞగా భావించి కార్యము లొనర్చుచో దాని పరిణామము ననుభవింప వలసిన పనియుండదు. వారు భగవదాజ్ఞను బరిపాలించుచున్నారు. ఈ యసురులు తామే సర్వమని భావించి దేవతలను మోసగింప దలఁచిరి. వారికి తమ బలము మీదఁనే విశ్వాసము. దేవతలకు భగవంతుని మీఁదనే విశ్వాసము. భగవంతునిపై నాధారపడిన వారికెన్నటికిని నకల్యాణము కలుగదు."

శౌనకుఁ డిట్లనెను :- సరియే, తరువాత కథను జెప్పుము.

సూతుఁ డిట్లనెను :- స్వామీ! ఇంకేమున్నది ? ఇప్పు డిద్దరకును బరస్పర సంధి కుదిరెను. ఒకరు రెండవవాని యభిప్రాయమును స్వీకరించిరి. ఇద్దరును గలిసి అమృత ప్రాప్తి కొరకు మహాప్రయత్నము లొనర్పసాగిరి. సర్వ ప్రథమముగ నందరును గలిసి మందరా చలమును బెల్లఁగించుకొని వచ్చుటకుఁ బోయిరి.

# కవ్వముగా మందరాచలము

శ్లో॥ తతస్తే మందర గిరిమోజసోత్పాట్య దుర్మదాః।
నదంత ఉదధిం నిన్యుః శక్తాః పరిఘవాహవః॥

శ్రీభాగ. ౮ స్కం. ౬ అ. ౩౩ శ్లో

సీ॥ వాసవ వర్ధకి వాఁడిగాఁ జఱచిన
కుద్దాల ముఖములఁ గొంత త్రవ్వి
ముసలాగ్రములు చొన్పి మొదలి పాఁతగిలించి
దీర్ఘ పాశంబులఁ ద్రిండు సుట్టి
పెకలించి బాహులఁ బీడించి కదలించి
పెల్లార్చి తమతమ పేరువాడి
పెఱికిమీఁదికినెత్తి పృథుల హస్తంబులఁ
దలల భుజంబులఁ దరలకుండ

తే॥ నాని మెల్లన కుఱుతప్పటడుగులిడుచు
భారమధికంబు మఱవక పట్టుడనుచు
మందరనగంబుఁదెచ్చి రమందగతిని
దేవదైత్యులు జలరాశి తెరువు వట్టి

శ్రీమదాంధ్ర భాగవతము

బాలకునకుత్సాహమును బెంపొందించుటకు వానితో వివిధ ములగు నుత్సాహ వర్ధక వచనములను బలికి నడుచుటకుఁ దల్లి దండ్రులు ప్రేరేపించెదరు. వాని యుత్సాహమును బొంది యాతఁడు తల్లిదండ్రుల వ్రేలినిఁబట్టుకొనకయే తన బలముమీఁదనే ఊగుచు నూగుచు నడుచుటకుఁ బ్రయత్నించును. కొంత దూరముపోఁగానే తన భారమును సహింపఁజాలక పడిపోవును. పడి గాయపడుటచే నేడ్వనారంభించును. అప్పుడు తలిదండ్రులు పరువిడిపోయి వానిని లేవఁదీసి, చంక కెత్తుకొని గంతవ్యస్థానమునకుఁ జేర్చుదురు దాని వలన నాతఁడు హతోత్సాహుఁడు కాకుండుటకును, తన ప్రయత్న మందు ప్రవృత్తుఁడగుటకును దోడ్పడును.

శుకదేవుఁ డిట్లనెను ;- "రాజా! శచీపతియగు దేవేంద్రుఁ డసురులతో నమృత లాభమును గురించి చెప్పఁగా నప్పుడు వారం దరును సముద్ర మంథనమునకు సహర్షముగ సమ్మతించిరి. ఇప్పుడు సురాసురులు మును ముందుగా మందరాచలమును దెచ్చుటకుఁ బోయిరి, అందరును బలవంతులే. అందరును నుత్సాహవంతులే. అందరు దమ పురుషార్థమదమున మదోన్మత్తులైరి. అందరును నొక్కసారిగాఁ గోలహల మొనర్చి, కలిసికట్టుగా సహస్రయోజన నములుకల మందర పర్వతమును వ్రేళ్ళతోఁ బెకలించిరి, పెగలించి దాని నెత్తుకొని దేసికొనిపోయిరి. కొంత దూర ముత్సాహముగఁ బోయిరి. కాని యాపర్వతము భారమైన దగుటచే దేవాసురులిద్ద రును నాభారమును సహింపఁజాలకపోయిరి. అందరును ధైర్యములు విడిరి. ఉత్సాహము మందగించెను. కాళ్ళు తడబడెను. నోటిమాట

రాకుండెను. ఇప్పుడొక్క యడుగైనను బెట్టఁజాలకుండిరి. మధ్య లోనే దానినిఁ బడవైచిరి. చాలమంది దానిక్రింద పడియైరి. కొందరకు వారి యంగములు దానిక్రిందఁబడిపోయెను. చాలమంది పచ్చడైరి. కొందర శరీరములకు గాయములు తగిలెను. ఇరుపక్షముల వారును నేడ్చుచు నిట్లనిరి :- "ఈ యమృతము తగులఁబడిపోను, ఈ యమరత్వము మంటఁగలిసిపోను, కుడిచి కూర్చుండువారమెట్టి సంకటములోఁ బడితిమబ్బా! మనమీ పర్వతమునే యెత్తజాలకుండిన మంథనమెట్లు జరుగఁగలదు, సముద్ర మథనమైనది. ఇఁక నిండ్లకు పోదము పదండి! అమృత మెవరికిఁ గావలయును?"

ఆరంభములోనే వీరుత్సాహహీనులైనారని యంతర్యామి యగు భగవానుఁడు తెలిసికొని వారందరకు నుత్సాహమును గలిగించుటకై వెంటనే అచ్చట ప్రకటమయ్యెను. భగవానుని దర్శనము కాఁగానే దేవతలకు మిక్కిలి యానందము కలిగెను.

భగవానుఁ డిట్లడిగెను :- "ఏమి ? మీరేమి చేయుచున్నారయ్యా!"

అంత దేవేంద్రుఁ డిట్లనెను :- "స్వామీ! ఏమి చేయుచున్నాము. దేవాసురలమన్నదమ్ములము. మేమందరమును గలిసి సముద్రమును మథించి అమృతోత్పాదనము కావింపవలయునని మా కోరిక. దానికి కవ్వముగా నీమందరాచలమును గొనివచ్చుచున్నాము. మార్గమున శ్రమకలుగుటచే దారిలోమేము పడిపోయితిమి."

భగవానుఁడిది విని నవ్వి యిట్లనెను :- "మీరు కశ్యప సంతానమయ్యు నీబరువు నెత్తఁజాలక పోవుచున్నారే. తొలఁగుఁడు. దీనినెచ్చట నుంచవలయునో చెప్పుఁడు. నేనొంటరిగాఁ దీనికొని పోయెదను ఎచ్చటికి గొనిపోవలయును ?"

దేవతలిట్లనిరి :- స్వామీ! క్షీరసాగరతటమునకుఁ గొని పోవలయును. ఇది వినఁగానే భగవానుఁడు నవ్వుచు లీలగా నా పర్వతమును గొడుగువలె నెడమచేతితో నెత్తి గరుడునిపైనఁబెట్టెను దానిక్రిందఁబడి కుంటివారై, క్షతవిక్షత గాత్రులైన వారినిఁదన అమృతవర్షిణి దృష్టిచేఁ బూర్వరీతిని స్వస్థులుగా నొనర్చెను. భగ వానుఁడు తాను గరుడునిపై నెక్కెను. మందరా చలమును బెట్టు కొనెను. గరుడునకు నలుబది క్రోసులయైన యేనుఁగును, నలుబది యెనిమిది క్రోసుల తాఁబేలును ఫలహారముగ నైనవి. ఆతనికి సహస్ర యోజనముల మందరాచలమేమి లెక్క. ఆతని కది దూదితో సమానము. క్షణములోనెగిరి క్షీరసాగర సమీపమునకు వచ్చెను. అచ్చటికిఁజేరి తన రెక్కలతో నా పర్వతమును దించి జలములలో నుంచెను. అంత దేవతలతో నిక సముద్రమును మథించుఁడనెను.

దేవాసురలిట్లనిరి :- "అయ్యా! అప్పుడే మథించుటెట్లు ? మథించుటకు రజ్జువుకావలయును. త్రాడులేక కేవలము కవ్వముతో మథింపవీలులేదు. నాగరాజగు వాసుకి వచ్చినచో నాతనినిఁజుట్టి మథించెదము."

భగవానుఁ డిట్లనెను :- "పోయి త్వరగా నాతనినిఁ బిలుచు కొనిరండు."

దేవత లిట్లనిరి :- "పిలుచుకొని వచ్చుటెట్లు ? ఒక పిల్లి కూర్చుండినచో లక్షప్రయత్నము లొనర్చినను నెలుక లచ్చటికి బోవు. మీయీ వాహనము సర్పమునకు శత్రువు. దీనికి గొంచె మాఁకలియైనచో నొక్కగుటకలో వాసుకిని మ్రింగివేయఁగలఁడు. అప్పుడు మాకు సముద్ర మంథనమును గాదు అమృతమునురాదు. నాగరాజు ప్రాణములు వ్యర్థముగఁబోఁగలవు. కావున గరుత్మంతుఁ డున్నంతవరకు నాగరాజు రాఁడు."

ఇదివిని భగవానుఁడు నవ్వుచు గరుడునితో నిట్లనెను :- "మంచిది; గరుడా ! నీవుకొంతకాలము తిరిగిరమ్ము."

గరుడుఁడు విసుగుకొని యిట్లనెను :- "స్వామీ ! అంత దూరమునుండి నేను మందరాచలమును నిచ్చటికిఁ దేవలెనా? నాకును నమృతము లభింపవలెను."

భగవానుఁడు నవ్వుచు నిట్లనెను :- "పొమ్ముఁ, పొమ్ము త్వరగాఁ బొమ్ము. పిల్ల తనపుచేష్టలు చేయకుము. నీకమృతముతో బనియేమున్నది ? నీవు విషమును గూడ అమృతముగాఁ చేసికొనఁ గలవు. ఈయాట సాగనిమ్ము. మధ్యలో గడబిడ చేయకుము."

గరుత్మంతుఁ డిట్లనెను :- "మంచిది, స్వామీ ! వెళ్ళివచ్చె దను. మీరిపిల్ల లాటలనాడుఁడు. మీకేమి బుద్ధిపుట్టిన దానినిఁ జేయు

చుందురు. గొప్ప గొప్ప పన్నాగములు పన్నుచుందురు." ఇట్లు పలికి గరుత్మంతుఁ డచ్చటినుండి రివ్వు రివ్వున ఱెక్కలు విసురుచు, సామవేద ఘోషము నొనర్చుచు నెగిరిపోయెను.

భగవానుఁ డిట్లనెను :- "ఓయీ ! ఇఁక నాలస్యము చేయరాదు. "శుభస్య శీఘ్రమ్" పొందు, నాగరాజు వాసుకి దగ్గఱకుఁ బోయి యాతనిని బుజ్జగించి తీసుకొని రండు."

భగవదాజ్ఞచే దేవతలును దైత్యులును గలిసి వాసుకి కడకు బోయి యిట్లనిరి :- "నాగరాజా! మాకొక గొప్ప కార్యమున్నది. మేము సముద్రమును మథించి అమృతోత్పాదనమును గావింపవలసియున్నది. నీవు మాకు సహాయము కావింపవలయును."

నాగరాజగు వాసుకి యిట్లనెను :- "నేనేమి సహాయము చేయగలను ? మీరెంతో బలవంతులు. నాకు మథించుటచేతగాదు."

దేవత లిట్లనిరి :- "మేము నీచేత మథింపఁ జేయము. మేము నిన్ను తఱ్ఱాడుగాఁ జేసికొని మందరాచలమునకుఁ జుట్టి మథించెదము."

శుష్కహాస మొనర్చి వాసుకి యిట్లనెను:- "ఇది బాగున్నది. దానిలోనుండి వచ్చు నమృతమును ద్రాగునది మీరా ? శరీరము నుగ్గునూచగునది నాకా ? 'అవ్వ బెల్లము తినును. నీవు చెవులు కుట్టించుకొనుమమ్మా' యనునట్లున్నది. పర్వతమునకు నా శరీరము రాచుకొని నలుగును. ఇది నా వలనఁ గానిపని."

దేవతలును నసురులును నిట్లనిరి :- "నాగరాజా! ఇది పరోపకార కార్యము. తన శరీరమును గ్లేశపెట్టుకొనియైనను నితరుల కుపకార మొనర్పవలయును."

తల నూఁగించుచు వాసుకి యిట్లనెను :- "ఇట్టి పరోపకారమునకు దూరముననుండియే నమస్కారము. ముందుగా నాత్మ, తరువాతఁ బరమాత్మ, శరీరమును రక్షించుకొనుచునే పరోపకార మొనర్పవలయును. నా శరీరమును నేను గుదువఁబెట్టలేదు. అమృతమును ద్రాగునది మీరు. నలిగిపోవునది నా శరీరము ?"

ఇది విని దేవాసురు లిట్లనిరి :- "సరియే, మేము నీకును నమృతము నొసంగెదములే. అర్థభాగ మొసంగెదము వచ్చెదవా?"

ఇదివిని వాసుకి యిట్లనెను :- "సరియే. సగభాగము పంచి యిచ్చునెడల వచ్చెదను బొండు." అంత నాతనికి నచ్చఁజెప్పి క్షీర సముద్ర తటమునకుఁగొని వచ్చిరి.

శ్రీ శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా! ఇప్పటికిఁ గవ్వమును, తణ్త్రాడును వచ్చినవి, ఇక మథించుటయే తరువాయి. అందరకంటె ముందు పీతాంబరమును నడుమునకు బిగించి వస్త్రభూషణములను సవరించుకొని దేవతలపక్షమున నజిత భగవానుఁడు సముద్ర మంథన మొనర్చుట కుద్యుక్తుఁడయ్యెను. ఈ లీల యంతయును బూర్తిగాఁ గూట రాజనీతికి సంబంధించినది. ఇందుతో నడుగడుగునకు ఛలకపటములతోనే పని జరుగవల

యును. ఆరంభములోనే భగవానుఁడొక యుక్తినిఁబన్నెను. దాని నాతఁడు తప్ప యింకెవరును జేయఁజాలరు. ఆ వర్ణనమును నేను ముందు చేసెదను.'' అని పలికి శుకమహర్షి కొంచెము సేపు మౌనముగ నుండెను.

......

## దుష్టులతో దుష్ట వ్యవహారము

శ్లో॥ ఆరేభిరే సుసంయత్తా అమృతార్థం కురూద్వహ।
హరిః పురస్తాజ్జగృహే పూర్వం దేవాస్తతో భవన్॥
తన్నైచ్ఛందైత్యపతయో మహాపురుష చేష్టితమ్।
నగృహ్ణీమో వయం పుచ్ఛమహేరంగమమంగలమ్॥

శ్రీభాగ. ౮ స్కంద. ౭ అ. ౧. ౩. శ్లో॥

ఆ॥ కడఁగి యమృత జలధి కలశంబుఁ గావించు।
తచ్చునవసరమునఁ దలఁపులమర॥
బద్ధ వస్త్రకేశ భారులై యారెండు।
గములవారు తరువ గదిసి రచట॥

క॥ హరియును దేవానీకము
నురగేంద్రుని తలలువట్టి నుద్యోగింపన్
హరి మాయా పరవశులై
సురవిమతులు గూడి పలుకఁ జొచ్చిరి కడిమిన్ ।

శ్రీమదాంధ్ర భాగవతము

ప్రపంచములో నెవరితో నెట్లు పని జరుపుకొనవలయునో వానితోనట్లు పనినెరవేర్చుకొనవలయును. పిల్లవాఁడు చంద్రునిఁ దెమ్మని మారాము పెట్టుచు నేవిధముగను నొప్పుకొన కున్నచో వానికిజలమందు ప్రతిబింబమును జూపి యీతఁడే చంద్రుఁడని చూపవలయును. ఏదైన ననిష్టకరమగు వస్తువుకొరకు బలవంత మొనర్చినచో, నట్లే దానికొరకేడ్చు చున్నచో వానికబద్ధములను జెప్పి దానిని దాఁచుదుము. చేతులు చూపించి త్రిప్పి పక్షియెత్తుకొని పోయినదని చెప్పుదుము. ఎవఁడైన స్తుతిప్రియుఁడున్నచో వానిని స్తుతించి పనినెరవేర్చుకొనవలయును. ఎవఁడైన సంగీత ప్రియుఁ డైనచో వానికి సంగీతమును వినిపించి తన మనోరథమును నెర వేర్చుకొనవలయును. సారాంశ మేమనఁగా దనపని నెవనివలన జరుగఁ గలడో వానిని యథాశక్తిగా ననుకూలునిఁగాఁ జేసికొనవల యును. దుష్టులతో దుష్టవ్యవహారము తోడనే పనిని నెరవేర్చుకొన వలయును.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా! కవ్వము, తర్రితాడు, మొదలగు సామగ్రి సిద్ధము కాఁగానే యిఁక సముద్రమంథనము

వంతువచ్చెను. వేలకొలఁది యోజనములు పొడుగుగల వాసుకుని మందరాచలనమునకుఁ జుట్టిరి. ఒకవైపు దానితోకయును, మరియొక వైపు దానిముఖము నుండెను, ఇరువైపులను నిరుపక్షములవారు లాగుచు మథించినచో సముద్రమథన మగును. భగవానుఁడిట్లను కొనెను :- "ఈదేవతలు సుకుమారులు. కల్లకపటములు తెలియని వారు. ఈదుష్టదైత్యులు వీరిని ముఖమువైపున నిలుచుండఁబెట్టినచో బాపమువీరు నాగముయొక్క విషపు బుసలకుఁ జచ్చిపోవచ్చును. ఈయసురులు తలక్రిందు బుట్టు కలవారు. వీరినిఁ దోఁకవైపునఁ బట్టుకొనుఁడని చెప్పినచో వారెదురుతిరిగి మేముతోఁక నేలబట్టు కొందు మందురు ? కావున ముందు దేవతల చేత నోటివైపు పట్టించినచో వారు వ్యతిరేకించెదరు." అని యిట్లాలోచించి అజిత భగవానుఁడు మేఘగంభీర భాషణములతో నిట్లనెను :- "వీరులారా ! ఇఁక మీమీపనులలో మీరుచేరుఁడు." అనిపలికి స్వయముగఁ బీతాంబరుఁడు తననడుమునకు గుడ్డను గట్టుకొని, వస్త్రభూషణములను సవరించుకొని వాసుకి ముఖము వైపునఁ బట్టుకొనెను భగవానుఁడు ముఖమువైపునఁ బట్టుకొనుట గాంచి దేవతలాతని ననుకరించిరి. వారందరును ముఖము వైపునఁ బట్టుకొనిరి. అప్పుడు భగవానుఁడసురులతో నిట్లనెను :- "చూచెద రేమయ్యా! మీరును నొకవైపునఁ బట్టుకొని గుండ్రముగఁ ద్రిప్పుడు."

ఇదివినగానే అసురులు మెదలక నిలుచుండిరి. వారు మందరాచలము సమీపమునకైనను రాలేదు."

మరల భగవానుడు హెచ్చరింపఁగానే, కన్నులెఱ్ఱఁ జేసి అసురులిట్లనిరి :- "విష్ణూ ! నీవు మమ్ముల నేమనుకొనుచున్నావు ? మేము విద్వాంసులముకామా ? కులీనులముకామా ? మేము వేదాధ్యయనము, యజ్ఞము, హవనము, దానాదులు చేయుటలేదా ? మేమెవరికి తీసివేసితిమి ?"

భగవానుఁడు నవ్వియిట్లనెను :- "అయ్యా ! మీరు తీసివేసిన వారనియెవరనినారు ? మీరు దేవతలకంటె నొకటిన్నర చేతు లెక్కువే. ఇందులో నెక్కువతక్కువల గోలయేమున్నది. ఒక ప్రక్క మీరుపట్టుకొనుఁడు. మరియొక ప్రక్కన మేమందరమును బట్టుకొందుము."

అదే క్రోధస్వరమున నసురులిట్లనిరి :- "నీవు చెప్పిన నెట్లు పట్టుకొందుము. నీవీ జగత్తునందు మోసగాడవు. కపటివి. మేము కులీనులము, సదాచారులము, శ్రేష్ఠులమయ్యును సర్పము తోఁకను బట్టుకొందుమా ? సర్పముతోక మహా అశుద్ధమైనది. అమంగళ కారిణి మేముదానిని దాకనైనఁ దాకము."

భగవంతు డిదివిని నవ్వి లోలోన నిట్లనుకొనెను :- "సరియే నయ్య తాఁకకున్నఁ బోనిండు. నోటినుండి విషవాయువు బయలు దేరినప్పుడు సరుకు బయటపడగలదు. అప్పుడు గొప్పతనము బయటపడఁగలదు." అనుకొని భగవానుఁడు ముఖభాగమును వదలి దేవతలతో నిట్లనెను :- "పోదము పదండి. మనము తక్కువ వారము తోఁకను బట్టుకొనుఁడు. గొప్పవారిని ముఖమునే పట్టుకొన

నిండు." ఇట్లు పలికి తోఁకవైపునకుఁ బోయి పట్టుకొనిరి. దేవత లును భగవానుని వెనువెనుక తోఁకను బట్టుకొనిరి. అప్పుడు భగ వానుఁ డసురులతో నిట్లనెను :- ఇప్పుడు సంతోషముగ నున్నావా! మేము మీకు సంతోషమును గలుగఁ జేయవలయును. మంచిది. యిప్పుడు తలవైపుననే పట్టుకొనుడు."

భగవానుని వాక్యములు విని యసురులు మిక్కిలి సంతో షించిరి. ఈదేవతలు వట్టి బేలలు. ఏమి చెప్పిన దాని నంగీకరించు టకు సిద్ధముగ నున్నారు. వీరందరలో నీచతుర్భుజుఁడగు నజితుఁడే చాకచక్యము కలవాఁడు. వీరికి సలహాలు చెప్పుచుండు వాఁడితఁడే. ఈతఁడు లేకున్న నీదేవతలేమి చేయఁగలరు? వీరిచేఁ బరిశ్రమను జేయించెదము. నిర్బలులమృతము నెట్లు పొందఁగలరు. అని యను కొని వారు వాసుకి ముఖమును బట్టుకొనిరి.

అంత శౌనకుఁడిట్లనెను :- "సూతా! భగవానుఁడు గొప్ప కూటనీతితోఁ గార్యము నొనర్చెను. ఇట్టివంచనను భగవంతుఁడేల చేసెను?"

ఇదివిని సూతుఁడు నవ్వి యిట్లనెను :- "స్వామీ! పెడ కట్టెగా నుండు వారివలనఁ బని చేయించుకొనవలసి వచ్చినచో వ్యతిరేకపు మాటలు మాటలాడవలయును. అట్లు చేయనిచోఁ బని జరుగదు. ఈవిషయములో నొక మనోరంజకమగు కథను జెప్పె దను వినుఁడు."

ఒక బ్రాహ్మణుఁ డుండెను. దౌర్భాగ్య వశమున నాతని కొక తలక్రిందుగఁబని చేయు గయ్యాళి భార్య దొరకెను. ఈదినము క్షీరాన్నము, పప్పు మొదలగు బంచభక్ష్య పరమాన్నములతో వంట చేయవలయునని ఆతఁడనినచో నామె కారము మెతుకులు పెట్టును. ఈదినము కారపుమెతుకులు చాలులేవే యనినచో నాదినము పప్పు, పులుసు, కూరలు, పరమాన్నము, పిండివంటలు చేయును. నేడు తండ్రి శ్రాద్ధదినముఁ పదిమంది బ్రాహ్మణులను బిలుచుకొని శ్రాద్ధమును బెట్టుకొనవలయు ననినచో నేమియు నక్కరలేదులే యనును. ఈదినము శ్రాద్ధమక్కరలేదులేవే యనినచోఁ దప్పక తానే బ్రాహ్మణులను బిలిచి, వంట అంతయునుజేసి పెట్టును.

బ్రాహ్మణుఁడు దాని స్వభావము నెరిఁగెను. ఇప్పుడామెచే నేమైనఁ జేయించుకొనవలయుననిన తలక్రిందులుగఁ జెప్పవల యును. ఒడలు నెప్పులుగా నుండినచో నీదినము నాశరీరమును బిసుక నక్కర లేదనిన నామె వచ్చి పిసుక నారంభించుచునే నీదిన మున మీకు శరీరమును బిసుక వలసినదే యనును. పప్పుపరమాన్న ములు తినఁదలఁచిన దినమున నేఁడు కారపుమెతుకులు చాలులే యనినచోఁ దప్పక పప్పు పరమాన్నములను జేసి తీరును. ఈవిధ ముగ నాతఁడు పనిసిఁ జేయించుకొను చుండెను. ఒకసారి యిద్దరును గలిసి గంగా స్నానమునకుఁ బోయిరి. వడ్డున వస్త్రములనుంచి యిద్దరును స్నానము చేయుచుండిరి. వర్షాకాల మగుటచే గంగ పెరుగుచుండెను. బ్రాహ్మణుఁడు స్నానము చేయుచు నామె వ్యతి రేక స్వభావము సంగతిని మరచెను. సహజ స్వభావమున లోప లకిఁ బోవలదని యరచెను.

ఆమెకు బ్రహ్మ వ్యతిరేక స్వభావమును బెట్టెను. ఇది వినఁగానే ఆమె లోపలికిఁబోయెను. లోపలికిఁబోయి గుడుప్ గుడుప్పని మునుఁక లిడుచు, నీరు ద్రావుచు మునుఁగుచుండెను. బ్రాహ్మణుఁడు భయపడి, తన ధోవతిని విసరివైచి యిట్లనెను :- "ఓసీ! దీనినిఁ బట్టుకొనుము." అది పనులన్నిటిని వ్యతిరేకముగఁ జేయుచుండును గావున దగ్గరలో నున్నను ధోవతినిఁ బట్టుకొనలేదు. ఇంతలోనే ఒక తరంగము వచ్చి ఆమె మునిఁగిపోయెను.

బ్రాహ్మణుఁడేడ్చుచు నామెను వెదుకఁబోయెను. గంగా ప్రవాహమున కెదురుగాఁ బోయెను, ఏడ్చుచు వెదుకుచుఁబోవుచుండెను. ఒకానొక రిట్లడిగిరి :- "ఏమి సమాచారము ?"

బ్రాహ్మణుఁడిట్లనెను :- "నాభార్య కొట్టుకొని పోయినది. దానిని వెదుకుచున్నాను. అది దొరకకున్నను నామె శవము చిక్కినను గర్మలొనర్చెదను."

ఆతఁడు నవ్వి యిట్లనెను :- "నీవు పిచ్చివాఁడవువలె నున్నావే. గంగలోఁబడినఁ బ్రవాహములో వెదుకవలయును గాని, ఇచ్చట వెదకిన నేమి లాభము."

ఆతఁడిట్లనెను :- "అయ్యా! దానిది తలక్రిందులు బుద్ధి. అన్నిపనులును నామె తన జీవితములోఁ దలక్రిందు నడక నడిచినది. అందువలన నామె చచ్చియును నరిగాఁ గొట్టుకొనిపోక యెదురుగాఁ గొట్టుకొనిపోయినదేమోనని వెదుకుచున్నాను.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! భగవంతుఁడు దేవతలచే నమృతమును పానము చేయించవలసియుండెను. ఆతఁడిట్లను కొనెను :- "తలక్రిందుల బుద్ధిగల నీయసురులచే నేదోవిధమునఁ బనిచేయించవలయును." అందువలన భగవానుఁడీ యుక్తినిఁ బన్నెను ? ఆతఁడంతర్యామి. ఘటఘటములలోని భావము లెరుగును. ఈ సమయమున నాటగాని వేషమును ధరించెను. ఏ విధముగ నొనర్చిన నాటకము రోచకముగ నుండునో, ఏ క్రియచే నాటకు సరసత్వము వచ్చునో దాని నంతయును జేయుచుండెను. ఇప్పుడు ముఖమువైపున నసురులను దోఁకవైపు నాకవాసులును బట్టుకొనిరి. ఇద్దరును సముద్రమును మథింప నుద్యుక్తులైరి.

......

## కూర్మావతారము

శ్లో॥ విలోక్య విఘ్నేశ విధిం తదేశ్వరో

దురంత వీర్యోఽవితథాభిసంధిః ।

కృత్వావపుః కాచ్ఛప మద్భుతం మహత్

ప్రవిశ్య తోయం గిరిముజ్జహార ॥

శ్రీభాగ. ౮ స్కం. ౭ అ. ౮ శ్లో॥

మ॥ కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘుముక్తా శుక్తి చందంబునన్
నమదద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో
నమరేంద్రాదులు మౌళికంపములతో నౌనౌఁగదే బాపురే
కమలాక్షాశరణంచు భూదిశలు నాకాశంబునన్ మ్రోయఁ
గన్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము

వస్తువున కాధారపాత్ర లేకున్నచో వస్తువు సురక్షితముగ నుండఁజాలదు. అది పతనమగును. పతనము కాకుండ రక్షించు నదియే ఆధారపాత్ర, కావున శ్రీహరియే సర్వశ్రేష్ఠమగు పాత్ర. ఆతఁడు పతనము నుండి రక్షించును. పతనమగు వానికి సహాయ మొనర్చును. ఏ యవలంబనము లేనివాని కాతఁడే యవలంబనము. ఆధారము లేనివారి కాధారమగును. ఆతఁడు సర్వత్రకలఁడు, సర్వసమర్థుడు. జీవుఁడు ఘోరవిపత్తుల లోఁబడియుఁ గింకర్తవ్యతా విమూఢుఁడై యిప్పుడు నేనేమి చేయవలయును. ఇప్పుడు నన్ను శిక్షించు వారెవరని విలపించు చుండును, మనము విపత్తుల నుండి తప్పించుకొనుటెట్లని చింతింపవలసిన పనిలేదు. సర్వావస్థల యందును సర్వేశ్వరునిఁ జింతించుచుండి, నాతని మరవకుండినచో నట్టివాఁడెన్నటికిని విపత్తులలోఁ బడఁడు. సమస్త విఘ్నములను దూరము కావించును. అన్య దేవతలు కలిగించు నంతరాయములను గూడ తొలగించును. కావున సమస్త కార్యము లొనర్చుచు నాథా నమో యుపశోభితుఁ డగు నచ్యుతుఁ డనియే భావింపవలయును.

శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా ! మందరమును భగవానుఁడు మొదట తీరమునకు సమీపముననే జలమందుంచెను. దానికి నలువైపులను వాసుకినిఁ జుట్టి అగాధజలములో విడువఁగా నది క్రిందకు బోసాగెను. దేవతలిట్లని అరచిరి:- "సోదరులారా ! ఇంతవదులుగాఁ బట్టుకొంటిరేల ? గట్టిగాఁ బట్టుకొనుఁడు చూడుఁడు. మందరాచలము జలములలో మునుఁగుచున్నది."

అంత నసురులు గ్రుడ్లెఱ్ఱగాఁ జేసి క్రోధముతో నిట్లనిరి :- "మీ దేవతలందరెల్లప్పుడును నిర్బలులు, వీరికి వాంఛ్రు, మీకును మాకును నుజ్జీయెట్లుకుదురఁ గలదు. మీరు బలముతోఁ బట్టుకొనుటయే లేదు."

దేవతలు దీనతా స్వరమున నిట్లనిరి :- "ఇంకెంత బలముగఁ బట్టఁగలము. శక్తికొలఁది మేమెత్తుచునే యున్నాము.. నీటి క్రింద నాధారమేమియునులేదు. కల మంతులేని లోతుగా నున్నది. మంధరాచలమా బరువైనది. ఇది యాధారము లేక నెట్లు నిలువఁగలదు ?"

దైత్యులిట్లనిరి :- "వాసుకిని వత్తుఁడు. క్రిందుగానెత్తి మథించుఁడు." ఇది విని దేవతలు తోకను గట్టిగాఁబట్టుకొని లాగిరి. ఈసారి వాసుకిశరీరము నలిగెను. కష్టము గలుగుటచే నది నోటి నుండి విషముు గ్రక్కెను. ఆ విషవాయువుచే నసురులు మూర్ఛ

తులైనట్లుండిరి. అయినప్పటికిని వారును సాహసమును వీడలేదు. నిరాశులై యిట్లనిరి :- "సోదరులారా ? ఇది నిరాధారమున నిలువదు. మునిఁగిన మునుఁగనిండు. దీనికి మొదటినుండియును విఘ్నములే. మొదటినుండియును నడుగడుగునకు విఘ్నములగుచో దానికిఁ బరిణామమునఁగూడ శుభము కలుగదు. ఈయమృతము పొడగుగాఁక !" అనివారు వదలి కూర్చుండిరి. ఇచ్చట దేవతల స్థితి అత్యంత శోచనీయముగా నుండెను. నిరాశచే దుఃఖితులై లోలోన మదనమోహనుఁడగు మాధవునిస్మరించుచు నార్తులై యిట్లనిరి :- "ప్రభూ ! మీరేమాకాధారము మీరెప్పుడు దానిని నెరవేర్పఁదలఁచెదరో అప్పుడే మా ప్రయత్నములు నెరవేరఁగలవు."

అనంత పరాక్రముఁడును, అమోఘసంకల్పుఁడునగు నజిత భగవానుఁడు మీరాదిలో విఘ్ననాయకుఁడగు గణేశ్వరునిఁ బూజింపకయే యీ కార్యమును బ్రారంభించుటచే నిట్టి విఘ్నములు వచ్చినవని తెలిసికొని, ఆ కారణముననే దేవాసురులు దుఃఖితులై తన సహాయమును గోరుచున్నారని తెలిసికొని, నానారూపములను ధరింపఁగల భగవానుఁడొక గొప్ప కూర్మరూపమును ధరించెను. మందరాచలము క్షీరసాగరమున మునిగిఁపోవుచుండెను. కేవలము దానిపైన నొక చిన్న శేషఁడు మాత్రముండెను. వాసుకి భయభీతుఁడై దానిని వదలి వేయునంతలో వెంటనే కచ్ఛపమూర్తి అంత పెద్ద విశాల పర్వతమును దన వీఁపుమీఁద ధరించి వెంటనే జలము నుండి లేచెను. ఆతఁడు పైకిరాఁగానే మరల మందరాచలము పైకి వచ్చెను. దేవదైత్యులకు మిక్కిలి యానందము కలిగెను. అసురులు

మరల వాసుకి ముఖమును బట్టుకొనిరి. దేవతలు తోఁకను బట్టుకొని ప్రభువును ప్రార్థించుచుండిరి. మలినములైన నంతర ముఖములను మరలఁగాంతిచే ప్రకాశించుచుండెను అందర చిత్తములను ప్రపుల్లితములయ్యెను. ఇంతపెద్ద కచ్ఛపమును గాంచి దైత్యులు విస్మయమునుజెందిరి. ఈతఁడు దయాసాగరుఁడును, దీనబంధువును, నజితుఁడును నగు శ్రీహరియే యని దేవతలు నిశ్చయించుకొనిరి. ఆతఁడే కచ్ఛపరూపమున ధరించి ఆధార ప్రదాన మొనర్చినాఁడనియును, ఆతఁడే తమ విపత్తును హరించుటకై కచ్ఛపమై యీ పర్వతమును ధరించెననియు వారు తలఁచిరి.

అంత బరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ! వేలకొలఁది యోజనములు పొడవు వెడల్పుగల మందరాచలమును వీపునధరించిన భగవంతునకుఁ గష్టము కలుగలేదా! ఆతఁడెంత పెద్దరూపమును ధరించినాఁడు ?"

ఇదివిని నవ్వుచు శ్రీ శుకుఁడిట్లనెను :- "రాజా! అమేయుఁడగు వాసుదేవునకుఁ గష్టమేమున్నది ? ఆతనికి నంభవా సంభవములు లేవు. అది కచ్ఛపమా ? అది చిన్న జంబూద్వీపమువలె నుండెను. ఆ భగవంతునియొక్క విచిత్ర విగ్రహము లక్షయోజనము లుండెను. దానిమీఁద మందరా చలము మేరుపర్వతము మీఁద నొక ఫలమున్నట్లుండెను.

దేవాసురులు కలిసి యాతని వీఁపుమీఁద మందరాచలము నుండి త్రిప్పుచుండ నాతని వీపు మీఁదఁ జీమ ప్రాకుచున్నట్లుం

డెను. లేక గొప్పవారు నిద్రించుటకై కోమలి తనకోమల సుకుమార హస్తములతో మెల్లమెల్లఁగా గోకుచున్నట్లుండెను. అందువలన నాత నికిఁ గునికిపాటు వచ్చుచుండెను. కునుకు వచ్చినపుడు మందరా చలము కొంచెము క్రిందఁ గ్రుంకుచుండెను. మరలఁ దనుకొను చుండెను. ఈ విధముగ భగవానునకది యొక ఖేలనముగ నుండెను. జలమందు శయనించుట ఆతనికిది పురాతనపు టలవాటే, అందు వలన మధుర మధురములగు గునుకులు కునుకుచుండెను. ఆతఁడు క్షీరసాగర తరంగములందా నందమును జూరఁగొను చుండెను. ఒక్కొక్కప్పుడు క్షీరసాగరములోని పాలవలె నున్న జలములు నోటిలోఁ బడుచుండెను. అప్పుడు నోటిని జప్పరించి మరలఁ దన యంగములను ముడుచుకొని నిద్రించును. శీతలమంద సుగంధిత వాయువు వీచుచుండెను, దేవదానవులు మందరాచలముతో నాతని వీఁపును గోకుచుండెను. భగవానుఁడు గుఱ్ఱుఁబెట్టి నిద్రించుచుండెను. యోగనిద్రా నిమగ్నుడై ఆత్మలో నాతఁడు రమించుచుండెను.

ఈ సముద్ర మంథన లీల శ్రీహరికొక యద్భుత ఖేలనము. నాటకకారుఁడు చాలమంది స్వయముగ నేర్పించును, జదివించును. తానేదైన నాటకము నాడఁదలఁచుచోఁ దానే దానినిఁ గల్పించును. తానే పాత్రనేరుకొనును, ఆతడే తన యిచ్చానుసారముగఁ దెరల నేర్పఱచును. తానే రంగస్థలము నేర్పరచును. తానే పాత్రధారు లకు ఆట, పాట, వాద్యములు నేర్పును. తానే సైగఁజేసి అభినయ మును జేయించును. తాను దానినిఁగాంచి యానందించుచుండును. అదేవిధముగ భగవానుఁడు తానే గరుడునిపైఁబెట్టి మందరాచల

మును దెచ్చెను. తానే సలహా నొసంగి నాగరాజగు వాసుకిని బిలిపించెను. తానే కూర్మరూపుఁడై మందరమును ధరించెను. అన్నియును సిద్ధమైనవి గాని తాను వారికి శక్తినీయకున్న సముద్రమును మథించుటెట్లు? కావున దైత్యరూపమున దైత్యులందును, దేవతరూపమున దేవరూపముననను దాను శక్తినిఁ బ్రసాదించి, వారిలో శక్తి సంచారమొనర్పఁ జేసెను. నిద్రారూపమున వాసుకి శరీరమందుఁ బ్రవేశించెను. దీని మూలమున నాతనికి మాటిమాటికి లాగుచున్నను గష్టము కలుగకుండునట్లొనర్చెను. తాను దనశక్తిచే సహస్రభుజుఁడై ఆమందరమటు నిటుఁ గదలకుండు నట్లణచుచుండెను. ఈ విధముగఁ బైనను క్రిందను బ్రక్కలందును మథించు వారుగను, మథింపఁజేయు వారుగను, ఇట్లన్నిటియందును హరి వ్యాపించెను. తానే నానాక్రీడలను నానావేషములను ధరించి కౌతుకమును రచించుచుండెను.

శ్రీ శుక దేవుఁడిట్లనెను :- "రాజా! ఈ విధముగ శ్రీహరి శక్తి సర్వత్ర వ్యాపించియుండుటచే నిప్పుడు బాగుగా మథింపఁబడుచుండెను."

# శ్రీహరి ద్వారా సముద్ర మథనము

శ్లో॥ మేఘశ్యామః కనక పరిధిః కర్ణవిద్యోత విద్యుత్
మూర్ధ్ని భ్రాజద్విలులిత కచః స్రగ్ధరో రక్తనేత్రః।
జైత్రైర్దోర్భిర్జ గదభయదైర్దందశూకం గృహీత్వా
మంథన్మంథా ప్రతిగిరి వాశోభ తాథోద్ధృతాద్రిః ॥

శ్రీభాగ. ౮ స్కం. ౭ అ. ౧౭ శ్లో॥

వ. ఇట్లు సురాసుర యూథంబును వారిసనాథంబులయి కవచంబులు నెట్టంబులు వెట్టికొని పుట్టంబులు పిరిచుట్లు సుట్టికొని కరంబులు కరంబుల నప్పళించుచు భుజంబులు భుజంబుల నొరయుచు లెండు లెండు దరువఁ దొడంగుఁడు రండని యమందగతిం బెరుఁగుఁ ద్రచ్చు మందగొల్ల చందంబున మహార్ణవ మధ్యంబున మంథాయ మానమందర మహీధర విలగ్న భోగి భోగా ద్యంతం బులం గరంబులఁ దెమల్చుచు మథించిరి :

శ్రీమదాంధ్ర భాగవతము.

సద్వృత్తులే సురలు, అసద్వృతులే అసురులు. స్వద్వృత్తు లను నసద్వృత్తులు జయించినప్పుడు, మానవుఁడు తన పురుషార్థ ముచే నసద్వృత్తుల నణఁచుటకసమర్థుఁడై యుండును. అప్పు డాతఁడు గురుబ్రహ్మకడకుఁ బోవును. గురుదేవుఁడాతని భగవన్మా

ర్గమును బోధించును. గురువు సమర్థుఁడు. తన పురుషార్థముచేఁ బ్రభువును బ్రత్యక్షము కావించుకొనును. కాని శిష్యునకు సాధనను జెప్పును. సద్వృత్తులను గార్యమందు వినియోగించును. కర్మ మహత్వమును జెప్పును. సంసారమను సాగరమును జ్ఞానరూపమగు మంథరమును మంథానముగ నొనర్చి వైరాగ్య రూపమగు వాసుకినిఁ దత్రాడుగా నొనర్చుట కాజ్ఞాపించును. మథించుటలో లోభముండినచో మంథనము వ్యర్థము కావున సువర్ణరత్నముల యెడల నిర్లోభత నుపదేశించెను. అసద్వృత్తుల యెడలఁ దిరస్కారమును జెందఁబనిలేదు. తనయుద్దేశ్య మందలి యవి సహాయకములగ నున్నంతవరకు వాని నుపయోగించుటయును వాంఛనీయమే. పురుష ప్రయత్నముచేఁ ద్యాగవృత్తితో మంథనరూపమగు సాధనమును మరల మరల జేసినచో ననఁగా నిరంతర మభ్యాస మొనర్చుటచే ముందుగా విఘ్నరూపమగు విషముత్పన్నమగును. విఘ్నములేని సాధనము ప్రగతిశీలమైనది కాదు. యోగమందలి సమస్త విఘ్నములను శివుఁడు శాంతింపఁజేయును. విఘ్నేశుఁడా విఘ్నములను పాన మొనర్చును. తదనంతరము వివిధ రత్నరూపమగు సిద్ధులు సమ్ముఖమునకు వచ్చును. శ్రీ అనగా శోభవైపునకుఁ జూడక, సిద్ధులయెడల మనస్సును లగ్న మొనర్పక, నిరంతర మవ్యగ్రభావముతో మంథనకార్యమును, అనఁగా నభ్యాస మొనర్చినచో జీవరకు వాని కమృతత్వము ప్రాప్తించును. అమృతత్వ ప్రాప్తికలుగుటచే జీవుఁడు కృతకృత్యుఁడగును. ఆతఁడు జనన మరణ బంధము నుండి బయటఁబడును. ఇదియే సముద్ర మంథన రూపకము యొక్క ఆధ్యాత్మిక రహస్యము.

శ్రీ శుకదేవుఁ డిట్లనెను :- రాజా తామే మథించుచున్నా మనియుఁ దమ పురుషప్రయత్నము చేతనే యమృతోత్పాదనము కావింపఁగల మనియు దేవాసురులు తలంచుచుండిరి. పర్వతము పైనను, క్రిందను, తమ శరీరములందును, మందరాచల పర్వత మందును, వాసుకి యందును నాపరమాత్మయే కలఁడని వారికిఁ దెలియదు. ఆతని శక్తిచేతనే యీప్రపంచమంతయును నడుచు చున్నది, పర్వతము సముద్రమందు వేగముగఁ దిరుగుచున్నప్పుడు మత్స్యములు, మకరములు, తిమింగిలములు, మొదలగు జలజంతువు లెన్నో మిక్కిలి వ్యాకులతను జెందెను. నాగరాజగు వాసుకి శరీ రము కొంచెము బాధింపఁజొచ్చెను. ఆతఁడు తన నేత్రములనుండి యును, నోటనుండియును విషమును గ్రక్కఁ జొచ్చెను. ఆమూల మున నసురులత్యంత బాధను జెందిరి. వారి యుత్సాహము భంగ మయ్యెను, సర్పశ్వాసలనుండి వెలువడుచుండిన విషాగ్ని ధూమ్ర ముచే నిస్తేజులై పౌలోమ, కాలేయ, ఇల్వలాది దైత్యగణము దావా నలముచే నగ్ని తప్తమైన వృక్షమువలె వాడిపోయెను.

ఇచ్చట వాసుకి యొక్క శ్వాస దేవతల వరకును వచ్చు చుండెను. ఆ కారణమున దేవతల వస్త్రములు, మాలలు మకుట ములు, ముఖములు, మిగిలిన ఆయుధములు భూషణములు ధూమ్ర వర్ణము లయ్యెను. ఇప్పుడంతయును భంగమగునని భగవంతుఁడు తెలిసికొని ఖేలనమును సమాప్త మొనర్పఁ దలఁచెను. సెగ వచ్చు టకుఁ బూర్వమే పాకమును బాడుచేయఁ గూడదని ఆతఁడు సుశీ తల తరంగములచే స్పర్శింపఁబడిన సుగంధ వాయువును వీచు

నట్లొనర్చియు, నన్నని వానజల్లును వర్షింపఁ జేసియును, దేవతల శ్రమమును బోఁగొట్టెను. ఇంకను నమృతోత్పాదనము కాలేదని దేవాసురు లిద్దరును భయపడుచున్నారని తెలిసికొని భగవానుఁ డిట్లనెను :- దేవతలారా! దైత్యులారా! ఇప్పుడు నేనును నాబల పరీక్షను గావించుకొందును."

అందఱానందముతో నిట్లనిరి :- "అయితే స్వామీ! మీరును మీబలమును జూపింపుడు."

ఇంకేమున్నది? భగవానుఁడు గట్టిగా నడుమును బిగించి దేవతల వైపున నిలుచుండి, వాసుకి తోఁకను బట్టుకొని మథింప సాగెను. ఆసమయమున శ్రీహరి శోభ యెంత యద్భుతముగ నున్నదనుకొన్నారు? విద్యుత్ మెఱుఁగుతీగచే జుట్టఁ బడిన నీలాంజన పర్వతము మందర పర్వతముతో యుద్ధము చేయుచున్నట్లుండెను. ఆసమయమున నాతని కర్ణములకు వ్రేలాడుచున్న కర్ణకుండలములు "ప్రభూ! నీకీ కార్యము తగదు. నీబలమంతయును జూపించినచో నీధరాతలము రసాతలమునకుఁ బోఁగలదు. సముద్ర మెండిపోఁగలదు. మందరాచలము ముక్కలు కాఁగలదు. వాసుకి నిలువఁ జాలఁడను చున్నట్లూగు చుండెను.

ఆతని శిరస్సున నుండిన నీల కుంచిత కేశములు పాముల చుట్టలవలె నూగులాడుచు వాసుకి సంతానము తన తండ్రిపై జరుగు నత్యాచారమునకు విరుద్ధముగఁ దలనూపుచున్నట్లుండెను. భగవాను నట్లు చేయవలదని చెప్పుచున్నట్లుండెను. ప్రియతమ తనమీదఁ

గోపముతో నుండిన తన నాథుని గంఠప్రదేశమునకుఁ దన చేతు లతోఁ బెనవైచుకొని, వివిధ చేష్టలచే నాతని శాంతింపఁ జేయు చున్నదా యనునట్లాతని మెడపై నుండిన పంచరంగుల వనమాల కదలుచుండెను. సువర్ణ వర్ణముగల యులిపిరి. పీతాంబరము వాయు వేగమున నెగురుచు, శబ్ద మొనర్చుచు, నాక్రమణమునకుఁ బూర్వమే శత్రువు శస్త్రసంపాత మొనర్చి, స్వయముగ వచ్చి విజయ ధ్వజ మును నాటినట్లుండెను, కమల కోశమువలెనున్న నాతని యరుణ నేత్రములతో నమృతమును బయట పడవేయని కారణమున సముద్ర ముపై నలిగినట్లు సముద్రమును జూచుచుండెను.

భార్య యెచ్చటికోపోయినప్పుడు భర్త యింటివద్ద చల్ల చేయునట్లు తన విశ్వవిజయ మొనర్చు బాహువులతో ఘమరు ఘమరు మని యా క్షీరోదధినిఁ జిల్కుచుండెను.

భగవానుఁడు మథింపఁగానే జలజంతువుల యాహాకారము వెలువడెను. మకరములరువసాగెను. జలసర్పములనుండి యిటు నిటు నుండి అటులఁ బరువిడుచుండెను. తాఁబేళ్ళు పైకి వచ్చెను. కూర్మరూపుఁడగు భగవంతుని ద్వీపమనుకొను, వానిపైనఁ గూర్చుండి తమనోళ్ళను జప్పరించుచుండెను. తిమి, తిమింగిల, తిమింగిన గిలాది మహామత్స్యములు తమ గొప్పదనముయొక్క యభిమానములను వీడి ఆ మహా కచ్ఛపమును జూచుచుండెను. దైత్యుల చేతులు నొప్పులుపుట్టెను. దేవతలు తమ బలమునంతను విడిచివైచిరి. శ్రీహరి పట్టుకొనఁగానే వారు నిశ్చింతులైరి. ఇఁకఁ ద్ధికి సందేహముతేదని వారునిశ్చయించుకొనిరి.

భగవానుఁడు నాలుగైదు సారులు గట్టిగాఁ ద్రిప్పునప్పటికి నల్లగానుండు నత్యంత తీక్ష్ణ వాసనగల నొకవస్తువు కనఁబడెను. అందఱును దానినివదలి హాహాకారమొనర్చిరి. వాసుకిని వదలి దేవాసురులిద్దరును పారిపోయి దూరముగ నిలుచుండిరి.

......

## సముద్ర మథనమున ముందు విషము

శ్లో॥ నిర్మథ్యమానా దుదధర భూద్విషమ్
మహోల్బణం హాలహలాహ మగ్రతః।
సంభ్రాంత మీనోన్మ కరాహికచ్ఛపా
త్తిమిద్విపగ్రాహ తిమింగిలాకులాత్ ॥

భాగ. ౮ స్కం. ౭ అ. ౧౮, ౧౯ శ్లో॥

క॥ ఆలోల జలధి లోపల
నాలో నహివిడిచి సురలు నసురులుఁ బఱవం
గీలా కోలా హలమై
హాలాహల విషము పుట్టె నవనీనాథా॥

శ్రీమదాంధ్ర భాగవతము

కార్యములలో విఘ్నములు రాకుండుట అరుదు. 'శ్రేయాంసి బహువిఘ్నాని' మంచిపనులన్నిటికిని నడుగడుగునకును విఘ్నములే. ఆవిఘ్నములను గాంచి అల్పసాహసులు తమ కార్యములను విడుచుందురు. కాని ఉత్సాహులును, గర్మవీరులును బ్రశమ మొనర్చు వారును విఘ్నములకు భయపడరు విఘ్నముల దౌడలు జఱచి యుద్ధమొనర్పఁ జూచెదరు. తాము పురుష ప్రయత్నము చేయుచున్నప్పుడు వారు తామజరామరులమని కార్య మొనర్తురు. సూర్యచంద్రులు విపరీతముగ నుదయించినను, హిమాలయము తమ స్థానమునఁ గ్రుంగి పోయినను, సముద్రమింకినను, దిగ్గజములు భూమిని వీడినను, సమస్తప్రకృతియుఁ తమకు విరుద్ధముగ మార్పు చెందినను నొక్కజన్మములోఁ గాదు, అనేకజన్మములలో నైనను మేము మాలక్ష్యమును వీడమని ప్రతిజ్ఞ నొనరించెదరు ఇట్టి ప్రతిజ్ఞ గల పురుషుని సమ్ముఖమున సిద్ధి చేతులడు జోడించుకొని నిలుచుండును. శ్రీ వానిని నవ్వుచు వరించును. విజయము ఆతని గళమున స్వయముగ జయమాలను వేయును. సమస్త ప్రతికూలతలును ననుకూలము లగును. సదాశివుఁడా విషరూపమగు విఘ్నములను బానమొనర్చును. నీలకంఠుఁడు వానినిఁ దన పొట్టలోనికి పైచుకొని జీర్ణింపఁ జేసికొనఁడు, బయటకును గ్రక్కఁడు. కేవలము కంఠములో ధరించును. ఉద్యోగియగుఁ బురుష సింహుఁడే మథించి సముద్రము నుండి లక్ష్మిని నుత్పన్న మొనర్పఁగలఁడు, ఆఁతడు విషమునకు భయపడఁడు. ప్రళయానలమునకు జంకఁడు మృత్యువునకు వణఁకఁడు.

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా ! స్వయముగ సచ్చిదానంద సర్వేశ్వరుఁడు తత్త్రాపను దీసికొని సముద్రమును మథించిన నింక సిద్ధియేలఁ గలుగదు ? అందువలన మునుముందుగా సాధన యందు కాయశుద్ధి, నాడీశుద్ధ్యాదులచే నంతఃకరణములోని మలము లను బారఁద్రోలుదురు. ఈ న్యాయముచే సర్వప్రథమున సముద్రములోని మలము విషరూపమున బయటఁ బడెను క్షీరసాగరమున నాధవళ జలమందా కాలకూట హాలాహలమతి తీక్ష్ణముగను, మిక్కిలి యుగ్రముగను నల్లసల్లన నలువైపులను దేలియాడుచుండెను. దాని వాసన చేతనే దేవాసురులు మూర్ఛితులైరి. జలజంతువులు చూచు చుండెను. దశదిశలను హాహాకారములు వ్యాపించెను. పైనను గ్రిందను, నటునిటు నలువైపులను నాయుగ్రగంధము వ్యాపించెను. సమస్తప్రాణులును గిలగిల లాడెను. "ప్రభూ ! మేమేమి చేయ వలయునని" దేవతలు భగవాను నడిగిరి."

భగవానుఁ డిట్లనెను :- "నాయనలారా ! నేను యుక్తినిఁ జెప్పువాఁడనే కాని, చేయుటను, జేయించుటయును మీవంతే."

దేవతలిట్లనిరి :- "స్వామీ ! ఏదైన యుక్తినిఁ జెప్పుఁడు."

భగవానుఁ డిట్లనెను :- "ఒక్కపనినిఁ జేయుఁడు. ఇది యెవరిచేతనైనను నగుపనికాదు. శివుఁడిష్టపడినచో నీవిషమును ద్రావఁగలఁడు."

దేవతలిట్లనిరి :- "స్వామీ ! శివునకందరును లడ్డు, హలువా, పంచభక్ష్య పరమాన్నములను బెట్టుచుందురు. మేమువిషమును ద్రావుఁడని యెట్లనఁగలము?"

భగవానుఁ డిట్లనెను :- ఆతనికి విషామృతములు రెండును సమానములే. ఆతనిని విషమేమి చేయఁగలదు ? నిత్యమును జిల్లే డాకులను నుమ్మెత్తాకులను దినుచుండును. మీరుభయపడకుఁడు. ఆతనిపాదములఁ బడుఁడు. పరోపకార పారీణులకడనుండి నిరాశతో నెవరును రారు. వారివలన విరోధులును లాభమును బొందుదురు. విష మొసఁగువాఁడును నమృతమును బొందును. ఇది విఘ్నము. కావున విఘ్నేశుని తంత్రిదర్శన మొనర్పఁగానే సర్వమును సమాప్తము కాఁగలదు. దేవాసురలుపోయి యాతని పాదములపైఁబడి నిష్కాపటభావముతో స్తుతింపుఁడు.''

భగవానుని యీ యాజ్ఞలను బొంది దేవాసురులందరును గలిసి సదాశివుని సమీపమునకుఁ గైలాసమునకు బోయిరి. అచ్చట సదాశివుఁడు తన సతియగు సతీదేవితో సరస సల్లాపము లాడు చుండునంతలో దేవతలును, దైత్యులును వచ్చి యాతని సాష్టాంగ ప్రణామ మొనరించిరి.

సర్వజ్ఞుఁడగు శివునకన్నియును దెలియును. ఆతఁడు నవ్వి యిట్లనెను :- "దేవతలారా ! దైత్యులారా ! ఇంత పెద్ద పెద్ద నమస్కారములు పెట్టుచున్న కారణమేమి ? నేఁడు మీరిరువురును గలిసి యీ పిల్లి నమస్కారములను బెట్టెదరేల ? ఎంతో స్వార్థముండిన గాని యిట్టి నమస్కారములు పెట్టుట జరుగదు.''

అంత శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! నమస్కారము లన్నియు నొకేరీతిగానుండును. ఇందులో నిస్స్వార్థస్వార్థముల భేదమేమున్నది ?"

ఇదివిని సూతుఁడిట్లనెను :- "స్వామీ ! అగుటకన్నియు నొక్కటే. కాని పాత్రభేదముచే వానిలో భేదములున్నవి. జల మంతయు నొకేరకముగ నుండును. సురాపాత్రములో నుంచిన దుర్గంధమగును. సుగంధపాత్రములో నుంచిన సుగంధమగును. రంగు గాజుపాత్రలో జలమునుబోసిన నారంగువలెనే కనఁబడును. ఇదేవిధముగ స్వార్థుల నమస్కారము చాల పెద్దదిగ నుండును. అవమాన మొనర్చుటకును దండమును బెట్టుదురు. ఇట్లు హిరణ్య కశిపుఁడు వరుణునకుఁ జేసినాఁడు. ఎగతాళికిని దండమును బెట్టు చుందురు. వారు నవ్వి యిట్లందురు ;- "ప్రణామము దేవరా ! శిష్టాచార నమస్కారము కూడ గలదు. దూరముననుండియే 'నమస్తే' యని గబ గబ పోవుచుందురు. వేడుక నమస్కారములును గలవు. తనకుఁ బూర్వపు టుపాధ్యాయుఁడును, బెద్దయును గనఁ బడిన వారికి నమస్కారము చేయవలయునని యుండదు. వారిన్ దప్పించుకొనఁ జూతురు. కానితప్పక యెదురుపడుట తటస్థించి నది. అప్పుడు తొందరగఁ జేతులనెత్తి "నమస్కారము పండితుల వారూ !" అని ఒక్కసారి చేయెత్తి నమస్కరించి పోవుదురు. గొఱ్ఱెదాటు నమస్కారమొకటి కలదు. అందరును గాళ్ళమీఁదఁబడి నమస్కరించిరికావునఁ దానును నమస్కరించును. గుడ్లగూబనుజేయు నమస్కారమొకటియున్నది. ఒకసాధువుకడనో బ్రాహ్మణునికడనో యెదైన మంచి వస్తువుండుటనుగాంచి దానినెట్లైనఁ గాజేయుటకు వానికి సాష్టాంగనమస్కారమొనర్చి నమ్మించి యపహరించి, తన స్నేహితుల కడకుఁబోయి "నేనెట్లు కాఁజేసితినో చూచితిరా" యని

బడాయిలు కొట్టును. ఘోర సంసారికులు యేకాంతమున వచ్చి జ్ఞాన వైరాగ్య విషయములను బ్రసంగించుచు, రహస్యసాధనమును గూర్చి యడుగుచుఁ జాల శ్రద్ధను జూపించుచుందురు. సాధువులిట్టి వారిని జాగ్రత్తగఁ గనిపెట్టి యుండవలయును. వీరురాఁగానే వాని యొక్క ప్రభావమును దురుపయోగము కావించుచుందురు. ఎవరి వలననైనను దమ పనులను నెరవేర్చుకొనుటకై సిఫార్సు పత్రము లను వ్రాయుమందురు. ఇతర స్వార్థములను నెరవేర్చుకొనఁ దలఁచు చుందురు. సాధువుయొక్క పాదములను బూజించి, వానిని సాక్షా దీశ్వరునిఁగ భావించుచు వానిచే నేకార్యమునైనఁ జేయించుకొన వచ్చును. స్తుతిచే సాధారణముగ నందరును గరగిపోవుదురు. స్వార్థ ప్రణామముచేఁ గేవలమొక్క కార్యమే సాధింపఁబడును. నిస్స్వార్థ ప్రణామముచే మోక్షమునుగూడ పొందవచ్చును.

జప, తప, యోగ సమాధులెట్లు సాధనములో నట్లే ప్రణా మమును నొక్కసాధనము. కేవలము ప్రణామ మొనర్చుటచేతనే మోక్షప్రాప్తి కలుగును. ఆ సాధనము చేయవలసిన విధి యేమ నఁగా కుక్క, పంది, గాడిద, గుఱ్ఱము, ఆవు, ఒంటె, ఎద్దు, పశు, పక్షి, మనుష్యాదులలో నెవరు కనఁబడినను వారి సమ్ముఖమున శరీరముతో సాష్టాంగదండ ప్రణామ మొనరింపవలయును.”

శౌనకుఁడిట్లడిగెను :- “సూతా! అట్లైన నాతఁడు దినమంత యును బ్రణామమును గావించుచుండవలయునుగదా!”

సూతుఁడిట్లనెను :- "స్వామీ ! అది మంచిదే. ఏలననఁగా చరాచర విశ్వమందు విశ్వంభరుఁడు వ్యాపించి యున్నాఁడను జ్ఞానము కలుగును. ధారణము దృఢము కాఁగానే శరీరముచేఁ బ్రణామ మొనర్చుటను వీడి కేవలము మనస్సుతోఁ బ్రణామ మొనర్చుచు దానిని శ్రీహరిలోఁ గలుపవలెను. ఇట్టి ప్రణామ మొక్కటి చేసినఁ జాలును. నది తరింపఁ జేయును. ఈ విషయ మున నొక్క దృష్టాంతమును వినుఁడు.

ఒక గొప్ప శుద్ధాంతఃకరణము కలిగిన ముసలిది యుండెను. ఆమె ఒకదినమున మందిరమునఁ బండితునివలన నీ శ్లోకమును వినెను-

శ్లో॥ ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామః
దశాశ్వ మేధా వభృతేన తుల్యమ్ ।
దశాశ్వ మేధీ పునరేవ యాతి
కృష్ణప్రణామీ న పునర్భవాయ ॥

అనఁగా శ్రీకృష్ణున కొక్కసారియైనను బ్రణామ మొనర్చుచోఁ బది యశ్వమేధ యజ్ఞములం దవభృతస్నానతుల్య మగును. కాని యొక్కభేదమున్నది. అశ్వమేధ మొనర్చువాఁడు మరల సంసార మునకు వచ్చును. కాని కృష్ణప్రణామ మొనర్చువాఁడు మరల సంసారమునకు రాఁడు."

ఇది వినఁగానే ఆమెకు మనస్సులో మిక్కిలి పశ్చాత్తాపము కలిగెను :- "అయ్యో ! నేనెన్నడును భక్తి భావముతో భగవంతున కొక్కసారియైనను బ్రణామ మొనర్పలేదు." ఈభావము రాఁగానే ఆమెకుఁ కన్నుల నీరు వెడలెను. శరీరము పులకరించెను. కంఠము రుద్ధమయ్యెను. శరీరమున సమస్త సాత్త్విక భావములు ప్రాదుర్భావములయ్యెను. ఆమె అత్యంత భక్తి భావముతో భగవానునకు సర్వాంగ ప్రణామము గావించెను. దండమువలె నామె భగవంతుని సమ్ముఖమున నేలపైఁ బడెను. పడఁగానే ఆమె ప్రాణములు వదలి శాశ్వతముగ సంసార బంధమును వీడెను.

సూతుఁడిట్లనెను :- మునులారా ! ఈవిధముగ శ్రద్ధాభక్తులతో స్వార్థములేక కేవలము కృష్ణ ప్రీత్యర్థముగ భగవంతునకును, ఆతని చల విగ్రహములగు సాధువులకును నచల విగ్రహములగు నర్చామూర్తులకును, దృశ్యరూపమగు జరాచర విశ్వమునకును బ్రణామ మొనర్చిన వారి సమస్త కామనలు నెరవేరును. వారు మోక్షాధికారులగుదురు. కావునఁ బ్రణామ మొనర్చుట యన్నిటికంటె శ్రేష్ఠమైనది. ప్రతిదినమును దల్లికిని, దండ్రికిని, గురువునకును, వృద్ధులకును నెవరు బ్రణామ మొనరించెదరో వారికి ఆయువు వృద్ధి బొందును. విద్యాభివృద్ధి కలుగును-యశమబ్బును. బలవృద్ధి కలుగును. విపత్తులు నశించును.

దేవదానవులా సమయమున విపత్తులోఁ బడిరి. ఆ విపత్తు నుండి బయటపడుటకు భోళాశంకరుఁడగు శంకరుని శరణుఁ వేఁడుఁ డని భగవానుఁడు చెప్పెను. ఆతఁడే వారి మనోరథములన్నిటిని నెరవేర్చు ననెను.

అందువలనవారు పాపము స్వార్థప్రేరితులై కైలాసమునకుఁ బోయిరి. అచ్చటికిఁబోయి సాష్టాంగ దండప్రణామ మొనరించి శివుని స్తుతింప నారంభించిరి.

....

## ప్రజాపతులు మహాదేవుని స్తుతించుట

శ్లో॥ దేవదేవ మహాదేవ భూతాత్మన్ భూతభావన।
త్రాహినః శరణా పన్నాంస్త్రైలోక్య దహనాద్విషాత్ ॥
త్వమేకః సర్వజగత ఈశ్వరో బంధమోక్షయోః ।
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తి హరం గురుమ్ ॥
శ్రీభా. ౮ స్కం. ౭ అ. ౨౧, ౨౨ శ్లో॥

సీ॥ భూతాత్మ భూతేశ భూత భావన రూప
దేవ మహాదేవ దేవవంద్య
ఈలోకములకెల్ల నీశ్వరుండవు నీవ
బంధ మోక్షములకు బ్రభుఁడ వీవ
యార్తశరణ్యుఁడ వగు గురుండవు నిన్నుఁ
గోరిభజింతురు కుశల మతులు
సకల సృష్టి స్థితి సంహారకర్తవై
బ్రహ్మవిష్ణు శివాఖ్యఁ బరఁగుదీవు

అ॥ పరమ గుహ్యమైన బ్రహ్మంబు సదసత్త
మంబు నీవ శక్తిమయుఁడ వీవ
శబ్దయోని వీవ జగదంతరాత్మవు
నీవ ప్రాణమరయ నిఖిలమునకు ॥

శ్రీమదాంధ్ర భాగవతము

శరణాగత ప్రతిపాలనము సర్వశ్రేష్ఠ ధర్మముగఁ జెప్పఁబడినది. వచ్చి తన్నాశ్రయించినను, దీనులై సహాయమును యాచించినను, భయభీతులై యభయమును గాంక్షించినను, వారి దుఃఖములను బోఁగొట్టుటయును, నిర్భయుల నొనర్చుటయును, మహాపురుషులయొక్క మహత్వము. ప్రపంచములో నందఱును దుఃఖితులే, అందఱును నెవరి సహాయమైనను గావలసియుండును. అందఱును దుఃఖము లందితరుల సహాయము నపేక్షించెదరు. సర్వేశ్వరుఁడు తప్ప నింకెవఁడును స్వతంత్రుఁడు లేఁడు, సమర్థుఁడును లేఁడు. అతఁడే అందరకునుస్వామి. ఇతరులందఱును దుఃఖితులే వారు సర్వాంశములచే నందరను సుఖులుగనొనర్పఁజాలరు. వారు దుఃఖమునకు మూలకారణమును బోఁగొట్టఁజాలరు. ఆ పరాత్పర ప్రభువును శరణుఁ జొచ్చుటచేతను, ఆతనిస్తుతించుటచేతను, ఆతని మహిమను గానమొనర్చుటచేతను, దన సమస్తకోరికలను నెరవేర్చుకొనవచ్చును. కావున నాతని గుణములనే గానమొనర్పవలయును. ఆతనిస్తుతినే చేయవలయును.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా! త్రిలోకములలోని జీవులందరు నీ హాలాహల విషముచే నుద్విగ్నులు కాఁగా నందరును

గలిసి సదాశివుని శరణు జొచ్చిరి. త్రిలోకముల మేలుకొరకు సమస్తసురాసురలును, ప్రజాపతులును, మనువు మొదలగువారును గైలాసపర్వతము మీఁదనుండ, మునిసమూహముచేఁ బూజింపఁ బడుచున్న నాపరాత్పర దేవశ్రేష్ఠుఁడగు నుమాపతి నందరును దండ ప్రణామములాచరించి స్తుతింప సాగిరి.

శివుని సమ్ముఖమున నిలుచుండి, చేతులు జోడించుకొని గద్గదకంఠముతో సర్వప్రథమముగ గంధర్వాధిపతి స్తుతి యొన ర్చుచు నేకస్వరమున నందరిట్లనిరి :-

దేవ దేవ మహాదేవ, సర్వజగద్రక్షక ।
ప్రణతపాల ప్రభుకృపాల అంత విశ్వభక్షక ॥
కాలకూట విషమహాన్ హాలాహల జ్వాలకుల ।
త్రస్తజలజీవకచ్ఛ, సర్ప గజ తిమింగిల ॥
వామదేవ సద్యోజాత, త్రాహి త్రాహి విశ్వనాథ ।
తత్పురుషహర అఘోర, చరణ కమలనమో నాథ ॥
పృథివీ జల వహ్ని వాయు వాకాశాది తవయధీన
మాయాపతి రక్ష రక్ష ఉమానాథ హరప్రవీణ ॥

గంధర్వాదులైన తరువాత ప్రజాపతులు ముందుకు వచ్చి యిట్లనిరి :- "ప్రభూ ! నీవు సర్వవ్యాపకుఁడవు నీ జ్ఞానము స్వతహాగానున్నది. ఇంకెవరి యపేక్షయును లేదు. నీవు నీ గుణ మయమగు శక్తిచే నీజగత్తు నుత్పత్తిచేయుదువు. నీవే యుత్పత్తి

యైన జగత్తును రక్షించుచుందువు. నీవే చివరకు సంహార మొనర్చె దవు. నీవే బ్రహ్మవు, నీవే శ్రీవిష్ణుడవు. నీవే మహేశ్వరుడవు, నీవే సర్వేశ్వరుడవు."

అంత మనువు లిట్లనిరి:- "విశ్వనాథా! నీవే దేవతలు, నీవే మానవులు, నీవే పశు, పక్షి, వృక్ష, గుల్మలతాదులు, నీవే ప్రాణుల నందరను బుట్టించువాడవు నీవే అన్నిటికిని గోపనీయుడవును, గుహ్యుడవును, రహస్యమయుడవును, నద్భుతుడవునగు బర బ్రహ్మవు, నీవు జగదీశ్వరుడవు, పరమాత్మవు, అఖిలేశుడవు, నిరంజనుడవు, నిరాకారుడవయ్యును నీయొక్క అనేకశక్తులచే జగత్తునందు భాసమానుడవగుచున్నావు.

అంత విద్యాధరపతి యిట్లనెను :- "హరా! నీవు వేదము నకుత్పత్తిస్థానమవు. జగత్తునకు మూలకారకాము నీవే, నీవే మహత్తత్వము, నీవే అహంకారము, నీవే మనస్సు, నీవే సమస్తేంద్రియములు, నీవే ప్రాణము, అపానము, ఉదానము, సమానము వ్యానము నీవే పృథివి, నీవే జలము, నీవే తేజము, నీవే వాయువు, నీవేఆకాశమునై యున్నావు. శబ్దము, నీవే రూపము, నీవే రసము, నీవే గంధము, నీవే స్పర్శ, నీవే కాలము, నీవే సంకల్పము, నీవే సత్యము, నీవే ఋతము, నీవే ధర్మము, సత్వరజస్తమోగుణముల యొక్క సామ్యావస్థరూపమగు మూలప్రకృతి నిన్నాశ్రయించియున్నది.

అనంతరము శ్రేష్ఠులగు ఋషిగణ మిట్లనిరి :- "అశుతోషా దేవతలకు హవిస్సునొసగు నగ్ని దేవుడు నీ ముఖమే. ఈ వసుం

ధరయును, సప్తసాగరయగు మేదినియు నీ చరణములు. దేవత లందఱును నీ యంశలు నీవు తిరుగుటచే జగచ్చలనము, తూర్పు పడమర, ఉత్తర, దక్షిణ, ఆగ్నేయ, నైఋతి, వాయవ్య, ఈశాన్య, ఊర్ధ్వ, అధాది దశదిశలును నీ పంచముఖములకును బదికర్ణములు. వరుణదేవుఁడు నీ నాలుక, ఆకాశము నీ నాభి, వాయువు నీ శ్వాస ప్రశ్వాసలు సూర్యుఁడు నీ కన్నులు. జలము నీవీర్యము. ఉత్తమ, మధ్యమ, నికృష్ట, ఉచ్చ, నీచ, చిన్న, లావు సన్నముగనున్న జీవులన్నియును నీ యహంకారస్థానీయములు. చంద్రుడు నీ మనస్సు. స్వర్గము నీ శిరస్సు. సముద్రము నీకుక్షి, సమస్త పర్వతసమూహము నీ యస్థులు. ఓషధీ, లతా, గుల్మాదులన్నియును నీరోమములు. రస, రక్త, మాంస, మజ్జాస్థి, శుక్ర, ఓజాది సమస్తధాతువులు గాయత్రీ, అనుష్టుప్, బృహతీ, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతియను సప్త ఛందస్సులు, ధర్మము నీ హృదయము."

జ్ఞానులును, విజ్ఞానులునగు, బ్రహ్మర్షి గణ మిట్లనిరి :- "ప్రభూ ! ముప్పది యెనిమిది మంత్ర సమూహముత్పన్నమైన దత్పురుష, అఘోర, సద్యోజాత, వామదేవ, ఈశానాది పంచ ముఖములు పంచోపనిషత్తులు. దేవా ! శివుడనఁబడు నీవు స్వయం ప్రకాశ స్వరూపుఁడవగు బరమార్థతత్వము; అది నీ యొక్క యుపరతావస్థ."

దేవత లిట్లనిరి :- "దేవా ! నీవు శరణాగతవత్సలుఁడవు. శరణమునకు వచ్చి సమస్తప్రాణులను రక్షించుచుందురు."

అసురు లిట్లనిరి :- "ప్రభూ ! నీవు భేదభావరహితుఁడవు. అందఱను సమాన భావమునఁ జూచుచుందువు. నిరంజనుఁడవు. నిష్కళుఁడవు. నిష్కపటుఁడవు. నీవు సముద్రమునుండి పుట్టిన విషమును బానమొనర్పవలయును."

సమస్త దేవతలును దైత్యులును, మనువులును, ప్రజాపతులును గలిసి శివుని స్తుతించిరి. అప్పుడు పార్వతి మనస్సులో నిట్లనుకొనెను :- వీరెంత స్వార్థులో కదా ! నేఁడు వీరిచే విషమును ద్రావింపఁబోవుచున్నారు. దానికొరకే యెంతో స్తుతి యొనర్చుచున్నారు. వీరిపనికాఁగానే యిక మాటలాడనే మాటలాడరు. నా నాథునిచే వీరందరును గలిసి విషమును ద్రావింపఁ జూచుచున్నారు. నేను నాముందిట్టి యన్యాయమును జరుగనీయను. భగవానుఁడు బోళాశంకరుఁడు. ఎవరే వరమడిగిన దానిని నిచ్చివేయును. ఎవరే వస్తువు నడిగిన దానిని విచారింపకయే ప్రసాదించును. తరువాత మనము విపత్తులలోఁ బడవలసి వచ్చును. దుష్టుఁడగు భస్మాసురుఁడెవరి నెత్తిమీఁద జేతినిఁబెట్టిన వారు భస్మమగునట్లు కోరెను. చివరకు వాఁడు నన్నుగోరి, నా నాథుని శిరస్సునే చేయిపెట్టఁదలఁచెను. నేఁడును నట్టి ప్రస్తావమే వచ్చినది. ఇప్పుడు నేను జూచుచుండ నిట్టి యన్యాయమును జరుగనీయను.

శ్రీ శుకుఁడిట్లనెను :- రాజా! "భవాని యిట్లాలోచించుచుండునంతలో సర్వజ్ఞుఁడగు శివుఁడిది కనిపెట్టి మధుర వాక్కులతో నామెకు నచ్చఁజెప్పుట కుద్యుక్తుఁడయ్యెను."

......

# పరోపకార మహత్త్వము

శ్లో॥ అహోబత భవాన్యేతత్ప్రజానాం పశ్యవైశ్యసమ్।
క్షీరోద మథనో ద్భూతాత్కాల కూటాదు పస్థితమ్।
ఆసాం ప్రాణపరీ ప్స్యూనాం విధేయ మభయం హిమే।
యేతావాన్హి ప్రభోరర్థో యద్దీన పరిపాలనమ్॥

శ్రీభాగ. ౮స్కం. ౭అ. ౩౭, ౩౮॥శ్లో

క॥ కంటే జగముల దుఃఖము
వింటే జలజనిత విషము వేఁడిమి ప్రభువై
యుంటకు నార్తుల యాపద
గెంటింపఁగ ఫలము గాదే కీర్తి మృగాక్షి!

క॥ ప్రాణేచ్ఛ వచ్చిచొచ్చిన
ప్రాణుల రక్షింప వలయుఁ బ్రభువులకెల్లం
బ్రాణుల కిత్తురు సాధులు
ప్రాణంబులు నిముష భంగురములని మగువా॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచములో నందఱును సదాస్వార్థమునే చూచుకొన్నచో నీ ప్రపంచమంతయును రౌరవనరకము కాఁగలదు. ప్రపంచములో

నెందఱు భోగించువారు కలరో అన్ని భోగ్య పదార్థములు లేవు. ఇంత యెందులకు ? ఒక్క(డనుభవించుటకు సాంసారిక పదార్థ ములు యథేష్టముగ లేవు. ఒక వస్తువును గోరువారనేకులున్నచో( బరస్పర సంఘర్షణము, రాగ, ద్వేషములు బయలుదేరును. ఒక్క స్వార్థము కొఱకనేకులు పోరాడినచో( బరస్పరము మనోమాలిన్య మేర్పడును. ఇట్టి స్థితిలో( బరోపకారులు తమ స్వార్థమును ద్యాగ మును కావించి దుఃఖితుల దుఃఖమును దూరమొనర్చెదరు. తమ సుఖమును ద్యజించి స్వయముగ దుఃఖమనుభవించుచు సంతప్తులను సుఖులుగా నొనర్చెదరు. వారి జీవితములు ధన్యములు. పరోప కారమే జీవితముయొక్క అంతిమ లక్ష్యము.పురుషుల యొక్క పురు షత్వము పరోపకారము మీ(దనే యున్నది.స్వార్థులైన పతితజీవులు పరోపకారులును, దయాళువులును సమర్థులగు శివులే.

శ్రీ శుక దేవు(డిట్లనెను:-"రాజా! ప్రజాపతుల ప్రార్థనముచే నప్రసన్నయైన సతీదేవి లోలోన నసంతుష్టగ నుండ(గా, శంకరుని విష పాన మొనర్పు(డను ప్రస్థావముచే నంతఃకరణము కొంచెముగ విచలితమైనట్లుండ(గా నామె నోదార్చుచు శివుండిట్లనెను:-"దేవీ! శివా! వీరందఱ వాక్యములను వినుచున్నావా?"

తెలియని దానివలె సతీదేవి యిట్లనెను:-"ఏమది స్వామీ! వీరంద రింత పెద్ద పెద్ద నమస్కారములును ననునయ వినయ ముల నేల(జేయుచున్నారు?"

శివు(డిట్లనెను:-"ఈ దైత్యులును, దేవతలును గలిసి అమృ తము కొఱకు క్షీర సాగరమును మథించు చున్నారు. దాని నుండి

ముందుగాఁ గాలకూట విషము వెలువడినది, ఆ కారణమున వీరం దఱును దుఃఖితులై యున్నారు. వీరందఱకును నీ సమయమున గొప్ప సంకటము వచ్చిపడినది, ఈ సమయమున వీరందఱును మిక్కిలి క్లేశమునఁ బడియున్నారు.''

సతీదేవి యిట్లనెను:-''అయితే నేమి చేయవలయును? వీరే స్వయముగ సముద్రమును మథించిరి, దానిలోనుండి యేది వచ్చిన దాని ననుభవింపనిండు.''

భోళాశంకరుఁడు గంభీరుఁడై యిట్లనెను:-''దేవీ! అందఱకును సమస్త విధములగు దుఃఖములను సహించు సామర్థ్యముండదు అందఱును వచ్చిన విపత్తునకుఁ బ్రతీకార మొనర్చుకొనజాలరు, ప్రపంచములో నందఱును బరస్పరము సహాయమును గోరుచుందురు శ్రేష్ఠులును, సామర్థ్యవంతులున్నచో వారివలనఁ దమ దుఃఖములు దూరము కావలయునని దీనులును, దుఃఖితులును నాశించు చుందురు. ఈ సమయమున వీరందఱును దమ ప్రాణరక్షణము కొఱకాతురులైయున్నారు. భయభీతులై శరణమునకు వచ్చిరి. శరణాగత రక్షణమొనర్చుట శ్రేష్ఠులకుఁబరమ కర్తవ్యము, శరణాగతులను త్యజించుట మహాపాపము కావున నేను వీరందఱ కభయ దాన మొసంగవలయును.''

సతీదేవి యిట్లనెను:-"స్వామీ! దుఃఖితుల పని వచ్చి కంట నీరు బెట్టుకొని యేడ్చుటయే."

శంకరుఁడు గర్జించి యిట్లనెను:-దుఃఖితుల పని కంట నీరును బెట్టుకొనుటయును నేడ్చుటయును, నెట్టిదోసమర్థులగువారి పని దీనులను, దుఃఖితులను రక్షించుటయే.''

సతీదేవి సరళముగ నిట్లనెను:-"స్వామీ! రక్షించుట మంచిదే కాని తన విషయమును గూడ కొంచెముగఁ జూచుకొనవలయును గదా! ప్రాణములే లేకున్నఁ బరోపకారమెట్లు చేయుదురు? కావున ముందు తమ యుపకారమును జూచుకొని తరువాతఁ బరోపకారమును జూచుకొనవలయును, ముందుగ నాత్మ, తరువాత బరమాత్మ, శరీరముండినన్నియును గలవు ముఖ్యముగఁ జేయవలసినదేమనఁగాఁ బ్రాణములను రక్షించుకొనుచు, శరీరమును నిరామయముగ నుంచుకొని చేతనైనంత వఱకు ప రో ప కా ర మొ న ర్ప వలయును.

శివుఁడిట్లనెను:-"దేవీ! తన ప్రాణముల మీఁదఁ దీపి కలవాఁడు పరోపకార మేమిచేయఁగలఁడు? తాను దుఃఖమును బొంది యితరులకు సుఖమును గలిగింప వలయును. ప్రాణముల నొడ్డియైనను నన్యులను రక్షించుచో వాని ప్రాణోత్సర్గము ప్రాణరక్షణము కంటె గోటిరెట్లు శ్రేష్ఠమైనది. పరోపకార జీవనమే జీవనము, కేవలము శరీరపుష్టినిఁ గావించుకొనుచు నీ క్షణభంగురమగు నశ్వర దేహమును బోషించుకొనుచుండినచో బశు పక్ష్యాదులకును మానవులకును భేదమేమున్నది? సమర్థుఁడయ్యు శరణాగత రక్షణ మొనర్పకున్నచో వాని సామర్థ్యమునకును, వాని శరీరధారణమునకును ధిక్కారము. ఒక చెట్టుమీఁదనొక పావురము నివసించుచుండెను. ఒక వ్యాధుఁడు వలను బన్ని పావురమును బట్టుకొనెను, చాలపక్షులను జంపి చంపిచాల ప్రొద్దుపోయెను. ఇంతలోనే వానవచ్చెను ఆఁకలిదప్పులు బాధించుచుండెను, ఆతఁడు మగపావురము నివ

శించు చెట్టుక్రిందనే చేరుకొనెను. అప్పుడు మగపావుర మిట్లను కొనెను:- ఈతఁడు నాశరణమునకు వచ్చినాఁడు. నాకతిథి, వీని దుఃఖమును బోఁగొట్ట వలయును, చలికాలము వ్యాధుఁడాఁకలిదప్పులచే బాధపడుచుఁజలికి గడగడ వణఁకు చుండెను. ఆతఁడు చలినుండి కాపాడుకొనుటకాయరణ్యమున నేమియును లేకుండెను. దయచే మగపావురపు హృదయము కరిగిపోయెను. అది యెగురుచుఁ బోయి యెచ్చటనుండియో తన ముక్కునందొక కొఱవినిఁదెచ్చెను. పైనఁ గొన్ని యెండు పుల్లలను వైచెను. వ్యాధుఁడు దానిని రగుల్కొలిపెను. తన శరీరమునంతను నామంటతోఁ గాచుకొని స్వస్థమొనర్చుకొనెను. వాని చలిపోయినది. కాని ఆఁకలి తీరలేదు. పావురము పైనుండి అగ్నిలోఁబడి యిట్లనెను:- "నన్నుఁగాల్చుకొని తినుము" కావున దేవీ ! సాధుజనులు పరోపకారము కొఱకు ప్రాణములపై మోహమును జెందరు, జీవితమంతయును ప్రాణములనే పోషించుకొనువారి నెవ్వరెఱుగుదురు ? అసంఖ్యాకులగు జీవులు వేలకొలది సంవత్సరములు శరీరమును బలియఁజేసికొని చచ్చిరి. వారి పేరెవరికినిఁ దెలియదు. శిబిమహారాజు నామ మమరమేల నైనది? ఆతఁడు తన శరణమునకు వచ్చిన పావురమును దన ప్రాణముల నొడ్డి డేగనుండి రక్షించినాఁడు. దధీచి మహామునికి శరీరము లేకున్నను నాతని కీర్తి సర్వత్ర వ్యాపించియున్నది. దేవతల కుపకార మొనర్చుటకై యాతఁడు బ్రదికియుండఁగనే తన యస్థులను బ్రదానము గావించెను, దిలీప మహారాజు గోవును రక్షించుటకై సింహమునకు దన శరీరము సర్పించెను. ఈనశ్వర, రక్షణభంగుర, అనిత్య శరీ

రముచే నే ప్రాణికైన నుపకారము జరిగినను ఈనశ్వర శరీరముచే నెవరికైన నుపకారము కలిగినచో నింతకు మించిన యుపయోగము దీనివలన నింకేమున్నది ?

సతీదేవి యిట్లనెను :- "స్వామీ ! జన్మించిన వాఁడేదో ఒక దినమున మరణింప వలయును. నేఁడు మనము మన ప్రాణముల నొడ్డి దానిని రక్షించినచో నది సదా అమరముగ నుండదు. చచ్చుట దానికేదో ఒక రోజునఁ గలదు. అట్టియెడఁ బరోపకారమున నేమి ప్రయోజనము కలదు ? మనమెవరి దుఃఖము నైనఁ దొలఁగించినచో వారికి మరల దుఃఖములు రావని యేమున్నది. ఆతఁడు మరల దుఃఖమును జెందును. అట్లయిన బరోపకారము వలన నేమిలాభము ?

శివుఁ డిట్లనెను :- "ఇతరుల కొరకు పరోపకార మొనర్చువారు పరోపకార మహత్వము నెరుఁగఁ జాలరు. మన మితరుల కేమి యుపకార మొనర్పఁగలము ? మనము మన దయావృత్తిని వృద్ధి బొందించుకొని మనము మనకే యుపకార మొనర్చుకొనవలయును. మనము ప్రపంచములో పూర్తిగా దుఃఖము లేకుండఁ జేయఁజాలము. భగవంతుని యొక్క గుణమయమగు మాయచే మోహితులై జీవులు పరస్పరము వైరభావమును జెందుదురు. ఇతరులకు దుఃఖములు కలిగించుటకై నానాప్రకారములగు ఘృణిత కార్యముల నొనర్చుచుందురు. ఇట్టి దయాపాత్రులగు జీవులందు గృప నెవరు చూపెదరో ఆకృపాకారణమున నందరయంతఃకరణము లందును సమాన రూపముగ వ్యాప్తమైన సర్వాత్ముఁడగు నాశ్రీహరి

ప్రసన్నుఁడగును. సర్వాత్ముఁడగు పరమాత్మ యెవరి మీఁదఁ బ్రసన్నుఁడైనాఁడో వారియెడల జరాచరా జీవులందరును బ్రసన్నులగుదురు. ఏలయనఁగా జరాచరులందా విష్ణువే విరాజమానుఁడై యున్నాఁడు. సర్వాత్ముఁడును, సర్వప్రాణులు నెవరిమీఁదఁ బ్రసన్నులగుదురో వారిని నేనత్యంతము ప్రేమించెదను. నాకు ప్రియాపాత్రులైన వారికి ప్రపంచములో దుర్లభ మేమున్నది? కావునఁ పరోపకారము ప్రభుప్రీత్యర్థముగఁ జేయవలయును. ఎవరికైన నుపకారమొనర్చినను, నెవరిమీఁదనైనఁ గృపఁజూపినను నీమూలమున సర్వాత్ముఁడగు ప్రభువు ప్రసన్నుఁడు కావలెనను కొనవలయును. ఇదియే పరోపకారమునకుఁ బ్రధానలక్ష్యము. ప్రాణులకు మేలొనరించు కార్యములను సమర్థులగు వారొనర్చుటయే ముఖ్యకర్తవ్యము."

పార్వతి యిట్లనెను :- "అయితే స్వామీ! వీరందరకేమి చేసిన మేలుకలుగును?"

పరమేశ్వరుఁడిట్లనెను :- "వీరందరును నీసాగరము నుండి కాలకూట విషకారణమున దుఃఖితులై యున్నారు. నేనీ విషమును బానమొనర్చినచో నాప్రజలకు మేలుకలుగఁ గలదు. కావున నేను విశ్వకల్యాణార్థము హాలాహల విషమును బాన మొనర్చెదను. దీనికి నీయభిమతమేమి?"

సతీదేవి యిప్పుడేమి ప్రత్యుత్తర మీయఁగలదు? శివుఁడామెకు నానా ప్రకారములగు దృష్టాంతముల నొసంగి పరోపకార

మహత్వమును జెప్పెను. ఇప్పుడామె యిట్లనుకొనెను :- "సర్వజ్ఞుఁడగు నా నాథుఁడు సర్వసమర్థుఁడు. ఈ విషము వీరినేమి చేయగలదు ? వీరికేమి కష్టమును గలిగింపఁగలదు. వీరి శ్రీయంగములోనికిఁబోయి, ఈ విషమమృతము కాఁగలదు. శివుని శ్రీవిగ్రహము సంస్పర్శింపఁగనే అన్నియును శివస్వరూపములగును. ఇట్లంతయు నాలోచించి భవాని యిట్లనెను :- "స్వామీ ! మీరు సర్వసమర్థులరు మీకెవరైన సలహానీయఁ గలరా ? మీరు విషపానమును జేయుట చేతనే వీరందర దుఃఖములు పోయినచో, సంతప్తులగు వీరందఱును సుఖులైనచో, మీరు లోకకల్యాణార్థమై యీ హాలహాలమును బానమొనర్పుఁడు. మీ సామర్థ్యమును నేనెరుఁగుదును. ఇట్టి విషము లసంఖ్యాకములుగ నున్నను మిమ్ముల నేమియును జేయఁజాలవు. విశ్వకల్యాణమగు కార్యమునే చేయుఁడు. నేను మోహవశమునఁ గాదనను."

శ్రీశుకదేవుఁ డిట్లనెను:- "రాజా! సతీదేవి అనుమోదింపఁగా సదాశివుఁడా విషమును బానమొనర్చుటకు సిద్ధపడెను."

.....

## విశ్వనాథుని విషపానము

శ్లో॥ తతః కరతలీకృత్య వ్యాపి హాలాహలం విషమ్ ।
అభక్ష్యన్మహాదేవః కృపయా భూతభావనః ॥

శ్రీభాగ. ౮ స్కం. ౭ అ. ౪౭ శ్లో.

మ. తనచుట్టున్ సురసంఘముల్ జయజయధ్వానంబులన్ బొబ్బడన్
ఘన గంభీర రవంబుతో శివుఁడు లోక ద్రోహి హుంపోకు ర
మ్మని కెంగేలఁ దెమల్చి కూర్చికడిగా నంకించి జంబూఫలం
బని సర్వంకషమున్ మహావిషము నాహరించె హేలాగతిన్
శ్రీమదాంధ్ర భాగవతము.

ఈ సంసారరూప సముద్రములో నమృతమును గలదు. విషమును గలదు. ప్రశంసా ప్రతిష్ఠలు కలుగుటయే అమృతము. నిందాపవాదములు కలుగుటయే విషము. సహర్షముగ విషపాన మొనర్చువాఁడు అనఁగా నిందావమానములను సహించువాఁడే కల్యాణ స్వరూపుఁడగు శివుఁడు. కేవలము ప్రశంస కొరకే ప్రాకు లాడుచు, నిందకు భయపడువారిలో రెండు రకముల వారుందురు. ఒకడు సత్, మఱియొకఁ డసత్. ఒకఁడు దేవుఁడు. రెండవవాడు దైత్యుఁడు. సద్వృత్తి కలవారు ప్రశంసను గోరుదురు. దానికొరకై సంసార సాగరమును శ్రమతో మథింతురు, గాని తను కాధారమా యఖిలేశ్వరుఁడగు హరియనియే భావింతురు. వారికేవైన నాపద్వి త్తులు వచ్చిపడినచో వారు భగవంతుని శరణు వేఁడుదురు. ఇట్టి శరణాపన్నులగు వ్యక్తులను సదా ప్రభువు రక్షించుచుండును. తానే స్వయముగ మథించి ఆసద్వృత్తి కలవారి వద్దనుండి అమృతమును లాగుకొని వారికొసంగును. ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుక, శౌనక, భీష్మ, దాల్భ్యాదు లనేక భగవ

దృక్తులు గడచిపోయిరి. వారి కీర్తి భగవత్కృపచేఁ బ్రపంచమున నేటివరకుక్షుణ్ణముగ వ్యాపించినది. అసద్వృత్తి కలవారును బురుష ప్రయత్న మొనర్చెదరు. వారును నమృతము నిచ్చింతురు. పరి శ్రమ మొనర్చి అమృతమును గూడ ఉత్పాదమును గావించెదరు. ఏలయనఁగా బురుషార్థ ఫలము లభించి తీరవలయును కాని పొంది యును వారు దానిని రక్షించుకొనఁ జాలరు. చాల కష్టముగ వారు పరమపదమును బొందియును బతనమగుదురు. ఏలయనఁగా వారు ప్రభుపాదపద్మముల నొనరింపలేదు. ఆతని నాశ్రయింపలేరు. యథార్థమగు నమృతత్వము అమృత విషములను సమానముగఁ జూచుటలోఁ గలదు. ఏది లభించినను రామ నామమును బలికి త్రాగివేయ వలయును. ఉత్తరము మీఁదనెవని చిరునామాను వ్రాసిన నది వానికిఁ జేరును.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :- "రాజా ! విశ్వనాథుఁడు విషపాన మొనర్చుటకు సతీదేవియు ననుమతింపఁగా భూతనాథుఁడు దేవా సురలవెంట పాలకడలిలో విషము తేలుచున్న చోటునకుఁ బోయెను. క్షీరసాగరజలము పాలవలెఁ దెల్లగనుండెను. కీర్తిమీదఁ గళంకము వచ్చినట్లు దానిమీఁద నల్లనల్లఁగ హాలహాల కాలకూట విషము తేలు చుండెను. శివుఁడు మునుముందుగా నా విషమును దనచేతులతోఁ బ్రోతచేసి దానినొక గుండ్రని ముద్దగఁజేసి, చేతులలోఁబెట్టుకొని దాని మీఁద రామ నామాంకితము కావించెను. రామనామమును బలికి ఆతఁడు నోటవైచుకొని మ్రింగెను. గాని అది పొట్టలోనికిఁ బోవక కంఠములోనే ఉండిపోయెను.

అంత శౌనకుఁ డిట్లడిగెను :- సూతా ! శివుఁడు విషమును గొంతును దాటియెందులకు మ్రింగలేదు ? దానిని గళమందే యేల ధరించినాఁడు ?

ఇది విని సూతుఁడిట్లు ప్రత్యుత్తర మొసఁగెను:-"స్వామీ! సజ్జనుఁడు పరనిందా రూపమగు విషమును దిన్నను వానిమనస్సున కైన దోషమాపాదించును. ఏలయనఁగా నాహారమును బట్టియే మనస్సుండును." అందువలన శంకరుఁడు దానినిఁ జీర్ణింపఁజేసికొన లేదు, గ్రహింపనులేదు, పోనిండు దానినిఁగ్రక్కినచో ననగా నిత రుల దోషములను బ్రకటించు వారికి చేసినవారి పాపములే లభిం చును, అందువలన శివుఁడు దానినిఁగ్రక్కలేదు-ఎవరితోడను జెప్ప లేదు-దానినిఁ గంఠములోనే యుంచుకొనెను."

ఇంకొక కారణమిదియును గావచ్చును, అతని హృదయ ములో సదాశ్రీహరి విరాజమానుఁడై యున్నాఁడు. అతఁడిట్లను కొనెను:- నేను నిరంతరము రామనామ రూపమగు నమృతోచ్చార ణముచే నాతని నర్చించు చుందును. ఇప్పుడు నేనతనికి విషమేమని యర్పింపఁ గలను. అని అనుకొని యాతడు విషమును గంఠము క్రిందకు దిగనీయ లేదు, దానిని గంఠమందే ధరించి, రామ నామో చ్చారణమున దానినమృతముగఁ జేయుచుండెను.

మూఁడవ కారణమిదియును గావచ్చును. లోపల నుండి యెవరినైన నిందింపవలయునను భావనరాఁగానే దానినిఁ గంఠమందే

భస్మమొనర్పవలయును, శ్రేష్ఠమైన విషయమేమనఁగా -ఇతరుల యొక్క గుణదోషములను మనస్సుతోఁ జింతింపనే చింతింపఁ గూడదు. మనస్సులో నెవరి దోషమైనను గనఁబడినచో దానినిఁ గంఠమునకు బయటకు రానీయఁగూడదు. అనఁగా నెవరితోడను జెప్పఁగూడదు.

నాల్గవ కారణమింకొకటి యున్నట్లున్నది-సమస్త పోరాటములు కంఠమువలననే అనఁగా మాటలవలననే వచ్చుచున్నవి, కావునవాక్కును బయటకురానీయఁగూడదు. ఒక రాజునకు బిల్లవాఁడు పుట్టెను, మంచి సుందరుఁడు, సుశీలుడు. రూపవంతుఁడు, కాని ఆతఁడు మాటలాడలేఁడు, రాజు చాల ప్రయత్న మొనరించెను మంత్ర తంత్రజ్ఞులకుఁ జూపించెను, చికిత్సకులచేఁ బరీక్షింపఁ జేసెను. కాని వాని రోగమేమో యెవ్వరికినిఁ దెలియలేదు. రాజునకు మూఁగ పుత్రుఁడగుటచే నిరాశ కలిగెను.

ఒక దినమున రాజు బక్షులను వేటాడుచుండెను. పక్షి చెట్టుకొమ్మలో దాగెను. వెంటనే అది కూఁత కూసెను. కూయఁగానే కువలయేశుఁడొక కొలతో దానినిఁ గొట్టెను, అది చచ్చెను ,వెంటనే రాజపుత్రుఁ డిట్లనెను:- "మూర్ఖా! ఇంకను గూయుము, ఏదికూసినదో అదిపడినది."

రాజపుత్రుఁడు నేడు మాటలాడుటను గాంచి రాజు మిక్కిలి యానందమును జెందెను. ఆతఁడు చాల దానధర్మములను జేయించి పిల్లవానితో మిక్కిలి ప్రేమతో నిట్లనెను:- "వత్సా! నీవింతవఱకు

పలుకకుంటివేల ? నీవు మూఁగవాఁడవు కావు, తెలిసీ తెలిసి నీ వాక్కునేల నియమించుకొంటివి ?

అంత రాజపుత్రు డిట్లనెను:- రాజా ! నేను బూర్వ జన్మమున మిక్కిలి శాంత దాంతములు కలతపస్విని. ఒక మునికుమారుఁడను. నేనేకాంతమున మౌనముగానుండి తపమును జేసికొనుచుండువాఁడను. నా వాక్కు అతిమధురమైనది. దైవయోగముచే నచ్చటి కొకరాజు తన రాజకుమారునితోఁ గూడి వేటకు వచ్చెను. ఆ రాజకుమారుని బహుమూల్యములగు వస్త్రభూషణములనుగాంచి, అతని సుందర శరీరమును వీక్షించగనే నామనస్సావైపున కాకర్షింపఁబడెను, నేను మౌనమును వీడి వానితోఁ బ్రీతిగ మధురముగ మాటలాడితిని. ఆతఁడును నామధురవాక్కులచే ముగ్ధుఁడయ్యెను. మాకిద్దరకును మైత్రికలిగెను, ఇప్పుడు నామనస్సు తపస్సున లగ్నమగుటలేదు, ఆ రాజకుమారునే చింతించుచుండెను. ఆ చింతనమందే నాకు మృత్యువు సంభవించెను. తపః ప్రభావముచే నాకుఁబూర్వజన్మ విషయములన్నియును జ్ఞాపకమున్నవి. ఎవఁడు మాటలాడునో ఆతఁడు పతనమగునని నాకుదెలియును. అందువలన నేను మాటలాడకుంటిని. చూడుఁడు ఈ పక్షి పలుకకుండిన నేలఁగొట్టఁబడును ? కావున రాజా ! కల్యాణేచ్ఛకలవారు వాక్సంయమ మొనర్పవలయును. భగవంతుని నామ, గుణకీర్తనములు తప్ప కంఠమునుండి పరులయొక్క నిందాస్తుతులు రాఁగూడదని నోట గుండు పెట్టుకొనవలయును, రామనామము మీఁద విష్ణ్రభావము పడదు ఇతర విషయములు నోటినుండి వెలువడఁదలఁచినను నవి విషజ్వా

లలచే మధ్యలోనే భస్మమైపోఁగలవు. అందువలన విషమును గంఠ మునకుఁ గ్రిందకుఁ బోనీయలేదు.

శౌనకుఁ డిట్లడిగెను:- "తరువాత నేమైనది ? ఇంకను సూతా ! తరువాత జరిగిన కథను జెప్పుము."

సూతుఁ డిట్లనెను:- "స్వామీ ! మాగురుదేవుఁడగు శుక మహర్షి పరీక్షిత్తును కిట్లని చెప్పుచుండెను. "రాజా ! ఆ హాలాహల మెట్టిదైనను విషమే కదా ! అది శంకరునేమి చేయును జేయఁజాలకు న్నను దాని ప్రభావమును గొంత చూపకపోలేదు. ఆవిషముచేఁద్రి పురారి కంఠము నీలమయ్యెను. ఆదినమునుండి శివునకు నీల కంఠుఁడని బేరువచ్చెను. దీనివలన శివునకు వేడిచేసెను ఈకారణము ననే మంచుగడ్డలలోఁ గైలాస పర్వతమున కూర్చుండును, శంక రునకు జలప్రవాహమనిన మిక్కిలి ప్రియము చలి కాలముగానిండు గ్రీష్మఋతువు కానిండు శివునిపైఁ బుడిసెడు జలమిడినను శివుడు ప్రసన్నుడగును. ఎవరైనను సహస్ర ఘటముతో సదాశివునిఁ బూజించినచో వారికి తన రూపమును బ్రసాదించును.

ఎండ కాలములో శివుని కంఠ మధికముగ నెండిపోవును. అందుకనియే యెండకాలము నాలుగు నెలలును శివునకు జలాభి షేకము లొనర్చెదరు. ఆ దినములో నెనిమిది జాములును నాతని శిరముపై జలధారలు పడుచుండును. ఎండకాలములో శివునిపై నెవరు జలధారలచే నభిషేకించెదరో వారియెడల శివుఁ డత్యంత ప్రసన్నుఁడగును.

అంతఁ బరీక్షిన్మహా రాజిట్లడిగెను :- "స్వామీ! కంఠము నీలమగుటచే శివుని రూపమున కేమియును గడబిడ జరుగలేదా?"



శీఘ్రముగ శ్రీశుకుఁ డిట్లనెను :- "రాజా! మంగళ స్వరూపుఁడును, సర్వ సౌందర్య సాగరుఁడును నగు శివుని రూపమం దేమి గడిబిడి జరుగఁ గలదు? ఆ సాధు శిరోమణియగు శంకరుని కంఠమున కానీలత్వము మనోహరా లంకారముగ నయ్యెను, ఆనీలత్వముచే నాతని శోభయింకనూ నధికమయ్యెను.



పరీక్షిన్మహారాజు మరల నిట్లడిగెను:- "స్వామీ! నాకొక శంక కలదు శివుఁడు సదా అఖండ సమాధిలో నిమగ్నుడై యుండును గదా! ఆతడేకాగ్రచిత్తముతో సాయఖిలేశుని యారాధనమును జేయుచుండెనా? ఆతఁడా యారాధనమును వీడి విషపానాది బాహ్యావృత్తికి సంబంధించివ కార్యములందేల ప్రవృత్తుడైనాడు. తన నిజానందముననే నిమగ్నుఁడగు వాడుకదా! సురాసురలందఱును నాతని సన్మానించెదరే? శివుడు సమాధిని వీడి యీబాహ్య కార్యములందేలఁ ప్రవృత్తుఁడైనాఁడు?



అంత నవ్వి శ్రీశుకుఁ డిట్లనెను :- "రాజా! భగవంతునకు బూజచేయుటయును, ఆతని నామగుణములను గీర్తించుటయును, ఇవన్నియును భగవదారాధనా రూపములే, షోడశోపచారములచే నొనర్చిన భగవదారాధనము భగవానుని ప్రసన్నునిఁగావించును. ఈ విధమగు నారాధనము శ్రేష్ఠమైనది, కాని యీ యారాధనము నతిమించిన పరమాత్ముని పరమారాధనమింకొకటి కలదు అది-

ఇతరుల దుఃఖములను గాంచి దుఃఖించుట, రాజా! తమ దుఃఖము లచేఁ బ్రపంచములోని వారందఱును దుఃఖితులగుదురు. తన బంధువుల కొఱకై అందరు నేడ్చుచుందురు, ప్రపంచములోని యందరి దుఃఖముల కనుతాపమును జెందుటయే సర్వశ్రేష్ఠరాధనము, సర్వోపరియైనది అందఱిలో నీశ్వరునిఁగాంచి ప్రాణిమాత్రుల కెవరు సేవను జేయుదురో, అందఱి యెడల సహానుభూతినిఁ బ్రదర్శించెదరో వారు సమాధిలోఁ గూర్చుండకున్నను నిరంతర సమాధిలో మగ్నులైనవారే, అర్చా విగ్రహమును బూజింపకున్నను నిరంతరము జనతారూపుఁడగు జనార్ధనుని సేవచేయుచున్నాఁడు. శివుఁడు విషపానమొనర్చి బహిర్ముఖ కార్యము నేమియును జేయలేదు. ఆతఁడు తన యారాధనమును నింకను నుత్కృష్టము కావించుకొనినాఁడు.''

రాజిట్లనెను:- ''స్వామీ! ఈ విషయమును నాకు విస్తారముగఁ జెప్పవలయును, అంతరారాధనముకంటెఁ బరోపకారమెట్లు శ్రేష్ఠమైనది.''

శ్రీ శుక దేవుఁడిట్లనెను:- ''మహారాజా! వినుము, నేను దీనిని బాగుగాఁ జెప్పెదను.''

.........

( 22 వ భాగము )

భాను ప్రింటింగ్ వర్క్స్, తిలక్‌నగర్, హైద్రాబాద్-44